# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

జూన్ 1964

సంపుటము 41 : : సంచిక 6

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూన్ 1964

# తెలుగులో వచన కవిత్వం

శ్రీ కె. వి. రమణారెడ్డి

"నిస్సందేహంగా ఇకముందు పది సంవత్సరాలూ వచన గమకాలలో కొత్త పరిశోధనలకు వినియుక్తం కాబోతున్నవి."

1939 లో శ్రీ శ్రీ చెప్పింది మిడతంభొట్లు జోస్యం కాదు. పై వాక్యం ప్రత్యక్షర సత్యంగా పరిణమించింది. "నేటి తెనుగు కవిత : కొత్త పోకడలు" అనే శీర్షికతో, మద్రాసు రేడియో స్టేషను ప్రసారం చేసిన ఈ ప్రసంగాన్ని 'భారతి' ముద్రించుకొంది. నవీన కవులు (ఆ కాలానికి నవీనులు) పురాతన ఛ్ఛందస్సులను వదలి ముత్యాలసరాలు, ద్విపదలు, రగడలు, భుజంగ ప్రయాతం వంటి వృత్తాలు స్వీకరిస్తూ ఉండిన రోజులవి. ఈ ప్రయోగాల ద్వారా ప్రాచీన రీతులలోని భాషా కృత్రిమత్వం పైదొలగి కావ్యభాష వ్యావహారికానికి దాపుగా వచ్చింది. అయితే ఇది ప్రారంభమే గాని ముగింపుకాదు, తప్పటడుగులే గాని స్వచ్ఛంద గమనం కాదని శ్రీ శ్రీ గమనించాడు.

"గ్రాంథిక భాషను విసర్జించినట్లే ఈ గేయాలన్న కూడ మన కవులు ఎప్పుడు పరిత్యజిస్తారో ? సాహిత్య పరిణామం గుర్తిస్తే ఇందుకు ఎంతోకాలం పట్టదని చెప్పవచ్చును."

అడివి బాపిరాజు వంటి నవ కవులు వచన పదాలలోనికి "సాహసించబోయి సందేహిస్తున్నారు." "ముద్దుకృష్ణ మాత్రమే సాహసించాడు." "మల్లవరపు విశ్వేశ్వరరావు 'స్త్రీ' అనే కావ్యంలోను, 'చెప్పండి జవాబు' లోను వచనపు విరుపులతో రసవత్కావ్యం ఎలా సృష్టించవచ్చునో ప్రదర్శించాడు."

తనను గురించి రాసుకునేందుకు వినయం అడ్డు వచ్చినట్లుంది గాని, ఆ నాటికే పరమ స్వతంత్రంగా శ్రీ శ్రీ కవితా ! ఓ కవితా !', 'కొంపెల్ల జనార్దనరావు కోసం' వంటి గొప్ప వచన గేయాలను రచించే ఉన్నాడు గదా !

1940 ప్రారంభానికి తెలుగులో వచన కవిత్వ యుగం జంకుతూ, జడుస్తూ నైనా మొదలైనదని భావించవచ్చు. అయితే ఉవ్వెత్తుగా దూకిపడే సముద్రపు అల వలె ముంచెత్తడమంటూ ఇంకా జరగలేదు. ప్రయోగశాలలోనే అనేక పరీక్షలకు లోనౌతూ ఉండింది. సంప్రదాయవాదుల నిరసనకూ అపహాస్యానికీ అగ్గంగాక తప్పలేదు. శ్రుతి సుభగత్వమనే నినాదాన్ని పలికి, ఛందస్సును వెనక వేసుకుని, మితులన్న సూచిస్తూ, దువ్వూరి రామిరెడ్డి వంటి హితైషులు విమర్శ సాగించారు. గణ ప్రస్తారము చేసుకొని లక్షాధిక నవ్య ఛందస్సులను ఆవిష్కరించుకొని కవిత్వము రాయవచ్చుగదా, ఈ అసంయమిత విజృంభణ ఎందుకో వారి కర్థంకాలేదు. "తెలుగు కవితలో క్రొత్త తెన్నులు" అనే వ్యాసంలో రామిరెడ్డిగారు ఇలా రాశారు :

"ఈ నవకవులు రచించు వచనపు తుంటలకు పద్యములని ఎట్లు పేరు వచ్చినది ? జామెట్రి వలన. ప్రోజు పేరాను లయను ప్రకారము కత్తిరించి వివిధ పరిమితులుగా తుంటలుచేసి, ఒకదాని క్రింద నొకటి అతికించిన ప్రోజు పొయిట్రీగా మారును. ఇది జామెట్రి కవిత్వము. ఈ కవిత్వమున, తిక్కన చెప్పినట్లు చెవి ప్రధానముకాదు, కన్ను ప్రధానము. ఇది తను భంగమువలన గద్యమూ కాదు. ఛందోవిరహితమైనందున పద్యమూ కాదు. త్రిశంకుని వలె నడమంతరమున వ్రేలాడుచు రెంటికిం జెడిన రేవడ యైనది."

ప్రతి పాత కారుకూ కొత్త కారు పట్ల ఉండే తృణీకారభావ పూరితమైన అపహాస్యమే ఈ విమర్శలో కనిపిస్తూ

క్రింది గాని, తమ భావాలను పంచుకోనివారిపట్ల ఉండవలసిన సహృదయత్వం లోపించి, ఈ విమర్శను నిందగా మారుస్తున్నది. అయితే రామిరెడ్డి హృదయావేదనను శంకించవలసిన పనిలేదు. ఆకార సమగ్రతనూ శ్రవోపేయత్వాన్నీ కవిత్వం నుండి శతాబ్దాలనుండీ రాబట్టుకొంటూ వచ్చి, ఇప్పుడు కావ్యం యొక్క ఆకృతికీ పదం యొక్క మాధుర్యానికీ ప్రమాదము ఏర్పడితే, ఎవరికైనా బాధ కోపం కలగక మానవు. రాయప్రోలు ఆశించిన "సరళ మృదులాక్షరముల సమ్మేళన" ఇక్కడ మొక్కబోతున్నట్లు కనిపించేసరికి, 'నవ' కవులకు కోపం కలగక తప్పలేదు.

రామిరెడ్డిగారు "వాఙ్మయ హిట్లరు" ను గురించి భయపడ్డారు. కవిత్వ విషయాలలో ప్రజాతంత్రం అనర్థదాయక మన్నారు. ఇవి అసత్యా లనలేము గాని, "యదార్థమైన కవిత్వమునకు అనివార్యముగా ఛందస్సు అనుగతమౌను" అని కవిత్వానికి గల 'సార్వకాలిక' 'సార్వ లౌకిక' 'మూలసూత్రము' నొకదాన్ని విధించడంలో ఈ హిట్లరత్వాన్ని అప్రయత్నంగా ప్రదర్శించారు. లేకపోతే "అనివార్యము" అంటా రేమిటి ? ఆయన కారణాలు ఆయనకు లేకపోలేదు. "లయ కృత్రిమముగా కల్పించుకొన్న కవితోపకరణము గాదు. అది సహజము ... లయ యొక్క శ్రుతి శుభగత్వమే ఛందస్సు .... ఛందస్సులేని పద్యము విన్నప్పుడు ఉప్పులేని చప్పిడి కూరతో అన్నము తిన్నట్టులుండును. శ్రుతి రంజకత్వము అభావ మగును. ఆనందదాయక హేతువులలో ఒకటి లుప్తమయి మన ఆనందము పరిపూర్ణము కాదు." ఛందస్సు లయా ఏక విషయాలుగా కనిపించినప్పుడు, ఇలాంటి తీవ్ర నిర్ణయమే చేయవలసి ఉంటుందేమో గాని, ఛందస్సుకు బయట గూడా లయను తదాశ్రితమైన శ్రుతి శుభగత్వాన్ని సాధించే వీలున్నప్పుడు మాత్రం ఛందస్సే కవిత్వానికి ఏకైక రూపం కాబోదు. తెలుగు కవిత్వంలో ఛందస్సు తాల్చిన ఇనుప తొడుగుల్ని నిరసించి, కావ్య భాషలో గేయాల అవతరణ తర్వాత కూడా మిగిలిఉన్న కృత్రిమత్వాన్ని నిరాకరించి, కావ్య గమనాన్ని నిరాఘాటం చేసేందుకు ఆధునిక కవులు చేబట్టిన రచనా పద్ధతినే వచన గేయమని, వచన పద్యమని, వచన గంధి అని, ముక్తచ్ఛందమని రకరకాల పేర్లతో పిలుస్తున్నాము.

"ఛందస్సుల చండశాసనానికి కూడా కాలం వెళ్లిపోయింది. కవి హృదయంలో రాగాలాపన ఎట్టి తీగలు సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలి."

దువ్వూరి రామిరెడ్డి వంటి ఛందోవాదులకు భయం గొల్పిన ఈ మేనిఫెస్టో ఆధునికాంధ్ర కవిత్వానికి ప్రసాదించింది శ్రీ శ్రీ యే. "ఫిడేలు రాగాల డజన్" కు ఆయన రాసిన "ఇంట్రో" లోనిది ఈ ప్రకటన. మార్పును గుర్తించడంలో సమ ప్రజ్ఞను చూపినా, ఆ ఇద్దరిలో ఒకరు దానిని ఈసడించారు. ఇంకొకరు ఆహ్వానించారు. నిన్నటి విప్లవవాది నేటి సంప్రదాయవాదిగా ఘనీభవించడం గురించి మరొకచోట శ్రీ శ్రీ చేసిన వ్యాఖ్య, ఇలాంటి 'నవ' కవులకు వర్తిస్తుంది. సంయమనం (restraint) పేరుతో యథాస్థితిని శాశ్వతీకరించగోరిన నవ కవులు, తమ విప్లవం సాధించిన సత్ప్రయోజనాలను దాటి ముందుకు చూడలేక పోయారు. ఇది వ్యక్తుల విమర్శ అనుకొనేరు సుమా, భిన్న మనస్థితి. పరిశీలన మాత్రమే.

అందుచేతనే, ఈనాడు కూడా ఆ మనస్థితి కొందరిలో ఇంకా మిగిలే ఉంది. 1940 తర్వాత దాదాపు పాతికేళ్ల కాలం గడిచింది. ఇంగ్లీషువా డన్నట్టుగా, వంతెన కింద ఎంతో నీరు ప్రవహించింది. శ్రీ శ్రీ కనుగొన్న భావి పరిణామ దృశ్యం ఇప్పుడు రేఖాసంపుష్టంగా యదార్థత వహించింది. వచన గేయం స్థిరపడిపోయింది. ఆ నాళ్లలో దానిని ప్రయోగించ జూచినవారిలో కొందరు (పఠాభి కూడా) ఈనాడు మాత్రాచ్ఛందో రీతులను ప్రయోగిస్తున్నారు, నిజమే. 'అభ్యుదయ' (మార్చి 1958) లో చేకూరి రామారావు 'మాత్రాఛందస్సు ప్రాశస్త్యం' అనే వ్యాసంలో అన్నట్టు.

"కవిత్వమూ సంగీతమూ వేర్వేరు కళలనీ, అంచేత కవిత్వం ఛందోబద్ధంగా ఉండకూడదనిన్నీ, స్వేచ్ఛగా ఉండాలనిన్నీ కొంద రభిప్రాయ పడ్డారు. అయితే ఈ వాదాన్ని అనుసరించినవారే తమ అభిప్రాయాలను మార్చుకొని మాత్రా ఛందస్సులపైపే మళ్లినట్టు కనిపిస్తున్నది."

అయితే కొత్త కవుల మాటో ? వాళ్లకు మాత్రలే మింగుడు పడడం లేదంటే, గణాల గుణింతాల మాటెందుకు, యతి ప్రాసల ఊసెందుకు ? నడిమికారు తెలుగు కవులలో గూడా తిలక్, కుందుర్తిలాంటి వాళ్లు సవ్యసాచిత్వం ప్రదర్శిస్తున్నారు. వచన గేయంలోని గేయ గుణాన్ని ఆరుద్ర బాగా దెబ్బ తీశాడు. ఊహాప్రహేళికలు (యస్వీ జోగారావు), కావ్యోపన్యాసాలు (రమణారెడ్డి) పేర్లతో వచన గేయం ప్రయుక్తమౌతూనే వస్తోంది. అరిపిరాల విశ్వం వంటి అత్యాధునికులు దానికి సిద్ధాంత పటిమను సమకూరుస్తున్నారు. కేశవ్‌రావ్, వరవరరావు, మురళీధర్, మాదిరాజు రంగారావు వంటి కవులు దానికి గల అవకాశాలను కొల్ల గొడుతున్నారు. కాబట్టి మాత్రా ఛందస్సు వచన గేయాన్ని ఫీటు గొట్టిన సూచనలు నా కెక్కడా కనిపించడంలేదు.

# తెనుగులో వచన కవిత్వం

అంతేగాదు. భాషా విషయాలలో ఆధునిక భావాలు లేని విమర్శకులు గూడా ఈ స్థితిని విధిలేక నైనా గుర్తించి, అందు లోని గుణాలను చిత్తశుద్ధితో బయల్పరుస్తున్నారు. అంటే వచన గేయానికి మన్నికతోబాటు మన్నన (Respectability) కూడా లభిస్తోంది. 1955 ఆగస్టునెల 'భారతి' లో బైరాగి, తిలక్‌గార్ల గీతాలను రెంటిని ప్రస్తావిస్తూ, కురుగంటి సీతా రామయ్య ఇలా రాశారు :

"రెండును గీతములని పిలువబడినను, గణ మాత్రా ఛందస్సులలో నేదియు వానిలో లేదు. కాని, యొక విలక్షణ మైన లయ మాత్ర మున్నదని చెప్పక తప్పదు. ఆ లయయే వీనికి కావ్యత్వమును కల్పించినది. వీనిని భావ గద్యము లన దగును."

ప్రాచీనులు నవీను రౌతుంటే, నవీనులు కొందరు ప్రాచీనతా రక్షణకు కాసెలు బిగించడంలో వింత ఏమీ లేదు' వచనగేయ కావ్యాలు మింగుడుపడని సమీక్షకులు, దిన పత్రిక లలో అనేకు లున్నారు. సమీక్షల పేరిట వారు కవుల తలల మీద అక్షింతలు చల్లి ఆశీర్వదిస్తున్నా మనుకొంటారేమో గాని, నిజానికి మొట్టికాయలు గూడా అంత విసురుగా గట్టిగా తగలవేమో ! అదైనా మేలు. ఎందుకంటే, మెల్ల మాత్రమే కాబట్టి. పూర్తి గుడ్డితనాన్ని ఉదాహరణ పూర్వకంగా ఈ విషయంలో చూపాలంటే ఇదుగో, 'గోరా' ను చూడండి ! 17—12—63 'ఆంధ్రభూమి' సంచికలో 'వినాయకుడి వీణ' ను మీటుతూ ఎంత రౌద్ర సంగీతం వెలయించాడో చూడండి ! ఆయన దూషించ దలచుకొన్నవా రెవరెవరో తెలుసా? (1) అభ్యుదయ కవులనిపించుకుందా మనుకునే ఎం. ఏ. చదివిన యువకులు (2) అందులోనూ తెలుగు ఎం. ఏ. చదివినవాళ్లు (3) వాళ్లలోనూ వచన పద్యాలు రాసేవాళ్లు (4) ఇలాంటి శిష్య ప్రశిష్యులను చేరదీసే అభ్యుదయ కవిత్వ పీఠాధిపతులు. వచనం కూడా సరిగ్గా రాయలేనివాళ్లు తగుదునమ్మా అంటూ "ఎగుడు దిగుడు వాక్యాలు వ్రాసుకుంటూ" వచన పద్య సంఘాలు స్థాపించుకుంటున్నారట. "వచన పద్యం కాబట్టి ఛందస్సు కానీ, కనీసం అంతర్లయ కాని ఉండనక్కరలేదు. అర్థం, భావం, అసలే అక్కరలేదు. నాలుగు గజిబిజి వాక్యా లను అడ్డదిడ్డంగా - కత్తిరించి ఎగుడు దిగుడుగా పేరిస్తే చాలు కవిత్వమై కూర్చుంటుంది." "అవి రాయడానికి భాష అంతగా రానక్కరలేదు. ఆఖరికి శబ్దస్వరూపం కూడా తెలియనక్కర లేదు."

ఇలాగుంది తెలుగు విమర్శకుల స్థిమితమూ మనస్థితీ! నచ్చనివాడి కార్టూను గీసి, మీసాలూ, గడ్డమూ పెట్టి, వీడు ఫలానా మనిషి అంటే నమ్మ శక్యంకానట్లే, ఈ విమర కూడా విమర్శగా నమ్మ శక్యంకాదు—ఇది రాక్షసి ప్రవృత్తి

## 2

దువ్వూరి రామిరెడ్డి హయాం నుండి 'గోరా' హయాం వరకు, సాంప్రదాయ విహితులైన విమర్శకులకు ఇంత మన స్తాపం కలిగించిన వచన గేయాల పూర్వాపరాలను నెమకక తప్పదు.

సాంఘిక జీవిత పరిణామ క్రమానికీ భావరూపాల పరి ణామ క్రమానికీ నేరుగా, జోరుగా గాకున్నా, డొంకతిరుగుడుగా హెచ్చు తగ్గులుగా నైనా సంబంధం ఉంటుంది. ఇది ప్రధా నంగా వచన యుగం కావటం యాదృచ్ఛికమైన ఘటన కాదు. ప్రపంచ సాంఘిక చరిత్రలో 17 వ శతాబ్ది మధ్యకాలం నుండీ మొదలై త్వరలోనే ఉధృతం కాసాగిన పెట్టుబడిదారీ పరిణామానికి జతగా, నవల, చిన్న కథ, సాంఘిక ఇతివృత్తం గల వచన నాటకం వగైరా వగైరా రూపొందాయి. మత విశ్వా సాల్లూ, రాజరికమూ, భూ సంపన్నవర్గపు ఆధిక్యమూ ప్రబ లంగా ఉండిన రోజుల్లో, ప్రకృతి శక్తుల గురించి మర్మ వాదపు పొరలతో భావించిన రోజుల్లో, విజ్ఞానశాస్త్రం పెంపొందని రోజుల్లో, కావ్యానిది అగ్రతాంబూలంగా ఉండేది. యధార్థంమీద భ్రమలు పెంచడం, అందమైన అబద్ధాలను ఊహాశక్తితో సృష్టించడం, సాహిత్యపరుల ధ్యాసగా ఉండేది. అయితే ఇప్పటిరోజుల్లో, అబద్ధానికి అంత విలువలేదు. అందంగా చెప్పడం మాత్రం అప్పటికీ ఇప్పటికీ సాహిత్యానికి ధర్మంగా నిలిచిఉంది. సాంప్రదాయిక కవిత్వ సూత్రాలలో వర్తమాన వాస్తవాన్ని సమస్తాన్నీ ఇరికించిపెట్టే వీలు ఉండటంలేదు. యధార్థాన్ని వివరించి చెప్పడమే సాహిత్యపరుని ధర్మ మౌతోంది. అంటే, శాస్త్రానికీ కళకూ సరిహద్దు చెరిగిపోతోం దనడం నా భావం కాదు. పూర్వం వాటిమధ్య ఉండిన విరోధభావం ఇప్పుడూ లేదననుగాని, అది క్రమంగా సన్నగిల్లుతున్నట్లు ఎందరో మేధావు లంటున్నారు. Two Cultures అనే గ్రంథంలో సి. పి. స్నో ప్రభృతులు ఈ సమన్వయాన్నే దర్శించగలుగుతున్నారు. ఈ యదార్థ దర్శ నంలో కవిత్వ స్వరూపం మార్పుచెందక తప్పలేదు. వచనగేయ మనేది ఆ మార్పులకు పరాకాష్ఠ.

దువ్వూరి రామిరెడ్డి విజ్ఞుడైన విమర్శకుడు కాబట్టి, వచన గేయానికి గల మూలాల విషయంలో కొంత పరిశోధ నకు పూనుకొన్నాడు. వాల్ట్ విట్మన్ Leaves of grass లో ప్రయోగంచేసి చూపిన Vers Libre (ముక్తచ్ఛందం)

వచన గేయానికి వాల్మీకం అని కనుగొన్నాడు. కాదని ఎవడన గలడు గాని, తెలుగు కవిత్వంలో నవీన యుగావతరణం తర్వాత గూడా త్వరలోనే ఘనీభవించి స్వేచ్ఛ ప్రసారాన్ని నిరోధించిన కావ్యరూపానికి వ్యతిరేకంగా ఆధునిక కవులు తలపెట్టిన పితూరీలో వచనగేయ మనేది అంతర్భాగమేనని ఆయన గ్రహించలేదేమో! భావకవులు తెలుగు కవిత్వానికి స్వేచ్ఛను ప్రసాదించినట్లే ప్రసాదించి, అచిరకాలంలోనే (1920 ల నుండి 1930 చివర వరకు) కావ్య భాషను అతి నాగరికం (Sophisticated) గానూ, కృత్రిమంగానూ మార్చివేశారు. ఏదో క్వాచిత్కంగా పల్లెపదాలకు (నండూరి, బసవరాజు) ప్రతిధ్వనుల్లాంటివి కల్పించారేమో, ద్విపదలను పద్యప్రాయంగా వాడారేమో, గేయ కవితను కూడా సమాదరించారేమో, అయితే ముఖ్యంగా వృత్తాలకు చిలవలూ పలవలూ కల్పించారు. మాత్రాబద్ధమైన ఛందస్సులను సృష్టించకపోలేదు. భావ కవిత్వ యుగాంత కాలంలోని కవులు కొందరు (సంపత్, గణపతిశాస్త్రి, మల్లవరపు విశ్వేశ్వరరావు వగైరా), మాత్రా ఛందోగతులలో చిత్ర విచిత్ర రీతులను కల్పించి గేయాలు రాశారు. అయితే ఇవేవీ సరిపోలేదు కనుకనే, ఆధునికుల్లోనూ ఆధునికులైన కవులు (శ్రీ శ్రీ, పఠాభి, శిష్ట్లా, ముద్దుకృష్ణ వగైరా) ఇంకొక అడుగు ముందుకు వేశారు. మాత్రా ఛ్ఛందస్సులనుండి వేసే ముందడుగు ఎక్కడికి దారితీయగలదో, ఆ ముక్తచ్ఛందో సీమలకే వచ్చి చేరారు. ఇది—వచన గేయావతరణ—నవ్య సాహిత్య పరిణామగతికి శిఖరాయమానమైన సిద్ధి. 1947 జనవరి 'భారతి' లో, 'కవిత్వంలో క్రొత్త రీతులు : వచనము లాంటి పద్యాలు' అనే వ్యాసం రాస్తూ, మల్లవరపు విశ్వేశ్వర రావుగారు ఇట్లన్నారు :

"ప్రబుద్ధ జీవితం యొక్క మెలకువలన్నీ కవిత్వ రచనలో ప్రతిబింబించాలంటే, మన కావ్య సాహిత్యంలో ప్రచారంలో ఉన్న అయిదారు ఛందస్సులూ సరిపోవడంలేదు. పైగా అవి అతకడమూ లేదు. అందువల్ల స్వతంత్రించి, విషయభావాలకు అనుగుణమైన క్రొత్త గమనాలు కనిపెట్టుతూ, నవ కవులు సంపూర్ణ వ్యక్తతకు మార్గాలు నిర్మించుకొంటున్నారు."

ముక్తచ్ఛందో రూపాలను సృష్టించడంలో, ఈ ఆధునికులకు ఎలాంటి ఉద్దేశాలు ఉండినాయో, వాళ్లయి వాళ్ళ వివరించిందాకా మనకు విస్పష్టంగా తెలియకపోవచ్చునేమో గాని, శ్రీ శ్రీ వాక్య మొకటి భావగర్భితంగా ఉంది : "పద్యం రైలుబండి నడక వంటిది. గద్యం విమాన విహారం వంటిది.' పద్య గద్యాలను సంధానించినప్పుడు, సిద్ధించగల ప్రయోజనం ఒక్కటికాదు. సూక్ష్మాతిసూక్ష్మభావ విశ్లేషణానికి పరిపూర్ణమైన అవకాశం, పొల్లు మాటలను దాదాపు పూర్తిగా విసర్జించి వాడుకలోని పలుకుబళ్లకు అతి సమీపంగా కావ్య భాషను తీసుకెళ్లే వీలు, నియమితస్థానాల్లో యతి, ప్రాసా నిర్బంధం వైదొలగినప్పటి భావ వ్యక్తీకరణకు నిరాఘాటమైన వెసులుబాటు మరెన్నో!

అంతేగాని, ఛందస్సును నిర్వహించలేక నిర్బంధాలకు లోబడి కావ్యం రచించలేక వచన గేయాలను ఆశ్రయిస్తున్నారని వినవచ్చే విమర్శలు, ఎవరిపట్లనైనా నిజవౌనేమోగాని, దాని ప్రయోక్తలైన శ్రీ శ్రీ, పఠాభి, తిలక్, కుందుర్తి వంటి వారిపట్ల పచ్చి కల్ల. అత్యాధునికుల్లో గూడా నావంటి ఒక రిద్దరితో నేమి గాని, అనేకులకు ఛందస్సు భయం గొల్పే భూతం కాదు. ఇలాంటి విమర్శలను మనస్సులో బెట్టుకొనే ఏమో, The Music of Poetry అనే వ్యాసంలో టి. ఎస్. ఇలియట్ ఇలా రాశాడు :

"As for 'free Verse', no verse is free for the man who wants to do a good job. A great deal of bad prose has been written under the name of free Verse Only a bad poet could welcome free verse as a liberation from form. It was a revolt against dead form, and a preparation for new form, or for the renewal of the old; it was an insistence upon the inner unity which is unique to every poem, against the outer unity which is typical."

ముక్తచ్ఛందమనేది కవిని విశృంఖలవర్తినీ విధ్వంసకారుని చేయదు, కావ్యరూపాన్ని గౌరవించని కవి, చెడ్డకవి అవుతాడు. కావ్యాన్ని విరూపమో కురూపమో చేయడంగాదు సమస్య. మార్పు చేర్పులకు వీలీయక శవప్రాయమైన కావ రూపాన్ని విసర్జించడం, కొత్త రూపాన్ని సాధించడంకోసమో, పాతదానికే ప్రాణప్రతిష్ఠ చేసి పునర్నవం చెయ్యడం కోసమో! కావ్యానికి గల ఐక్యతలలో బాహిరమైన ఐక్యతను గురించి బల్లగుద్ది చెప్పేవాళ్ళు ఛందస్సును ప్రస్తుతిస్తారు. ఆంతరంగికమైన ఐక్యతను గురించి నొక్కి చెప్పేవాళ్ళు, ఆ కావ్యం యొక్క విలక్షణత్వాన్ని అభిమానిస్తారు. ముక్త ఛందంవల ఈ ఆంతరంగిక ఐక్యత, విలక్షణత్వమూ కావ్యానికి సంప్రాప్తిస్తాయి, అని ఇలియట్ భావం.

ఇంగ్లాండులో 'జార్జియన్ పొయట్రీ' అని పేరు బడిన కావ్య సంప్రదాయం ఇలాంటి వృత రూపాన్ని ఆశ్రయించి ఉండింది. దానికి సవాలుగా బయలుదేరిన నవ్య అంగ

కవిత్వం కొన్నేళ్లపాటు ఛందో స్వాతంత్ర్యాన్ని వరించింది. ఇలియట్, పౌండ్, లారెన్సు, ఆల్డింగ్టన్ ప్రభృతి కవులు అప్పట్లో 'ఇమేజిస్టులు' గా పేరు మోశారు. స్పష్టత, సందర్భ శుద్ధి, పటుత్వము లక్షణాలుగా కలిగి అప్రస్తుతమైన వ్యక్తి మనోద్రేకాలను నిరాకరించి, దర్శించినదాన్ని చిత్తశుద్ధితో చూపెట్టగోరిన ఈ ఉద్యమం, ముక్తచ్ఛందాన్ని ప్రయోగించింది. సానెట్, హీరాయిక్ కప్లెట్ వంటి సాంప్రదాయిక కావ్యరూపాలు వాడివాడి చేవదరగిపోయి ఉండినందుచేత, వాటికి కాస్త విరామం కలిగించడం జరిగింది. ఫ్రెంచి కవులూ అదే అవస్థకు లోనైనారు. కాబట్టి ఉభయులకూ, ఇప్పుడు పనికి వచ్చిన కావ్యరూపం కొంతవరకు పూర్వం పద్య నాటకాలలో ఉపయుక్తమైన బ్లాంక్ వెర్స్, కొంతవరకు వాల్ట్ విట్మన్ పెట్టిన వరవడి. ముఖ్యంగా రెండవది. 'Contemporary Poets' అనే కావ్య సంకలనానికి ఉపోద్ఘాతంలో, కెన్నెట్ అల్లాట్ ముక్తచ్ఛందాన్ని ఇలా నిర్వచించాడు :

"A Cadenced form of writing, butt. ressed with repetitions, perallelisms, and occasional rhymes, derived directly from Whitman and beyond him from the translators of the metrical portions of the Bible."

బైబిలులో ఛందోబద్ధమైన భాగాలను అనువదించిన వాళ్లనుండీ, వాల్ట్ విట్మన్ నుండి నేరుగానూ, ఈ పద్ధతిని ఆంగ్ల కవులు స్వీకరించారట. నియమిత స్థానాలలో గాకుండా కావ్యమంతటా ప్రవహించి శ్రవణపేయత్వానికి తోడ్పడే ప్రాసతోబాటు, ఒండొంటితో సానురూపత కలిగిన కావ్య చరణాలు సాధించే ఐక్యత, అక్కడక్కడగా పద్య పాదాలను పోలిన భాగా లుండటంవల్ల కలిగే వైచిత్రి—వీటి ఆధారంగానే ముక్తచ్ఛందానికి బటువు ఏర్పడిందని అల్లాట్ భావం.

వాల్ట్ విట్మన్ గురించి వివరాలకు పోకుండా ముఖ్య విషయాలను స్పృశిస్తే చాలు. Leaves of grass రచించక ముందునుంచీ, వృత్తగంధి గద్యమని వర్ణించదగిన (Poetic prose) రచనా పద్ధతిని చేబట్టినట్లు అతని నోటుబుక్స్ సాక్ష్య మిస్తున్నాయి. మామూలు జర్నలిస్టుల భాష, తన 'ఆత్మ' యొక్క భావనా సంపత్తినీ ప్రవక్తృ దృష్టినీ వెల్లడించజాలదనీ, సాంప్రదాయిక కావ్యభాషగానీ, ఛందస్సులు గానీ తన భావ సంఘర్షణను నిరూపించజాలవనీ విట్మన్ గ్రహించాడు. అది గద్యమూ కాదు. పద్యమూ కాదు. గద్యంగా కనిపించే పద్యం ! పద్యగుణమే ప్రధానంగాని గద్య గుణం కాదు. అమెరికన్ ప్రజా సామాన్యం అవగత మొనర్చుకోగల ఉద్రిక్త ఉపన్యాస ధోరణితో, వివిధానుభూత, లను స్వచ్ఛంద లయా వ్యూహాల ద్వారా వ్యక్తీకరించి, పఠితల, శ్రోతల భావనను ఉన్నత సీమలకు ఎగయింపజేయ సంకల్పించాడు. "కళాసంగీతం" కంటె "హృదయ సంగీతం" మరింత సుభగమైనదని నమ్మాడు. లయా ప్రధానంగా రాశాడు. లయ నిరంతరాయ మైనందుచేత, భావ గోచరమైన దృశ్యం అవిచ్ఛిన్నమైనందుచేత, ఈ ముక్తచ్ఛందానికి గూడా కావ్యానికి గల రూపూ విసురూ, అందమూ శ్రవణసుఖమూ లభించాయి. మహోపన్యాస ధోరణి కావ్యచరణ నిర్మాణాన్ని శాసించింది. (Walt whitman: A Biography: H. S. Canby) విషయం ఇది కాగా, ప్రజాతంత్ర భావములకు దర్పణ మైనందుచేతనే, Leaves of grass కు ఇంగ్లాండులో బహుళ ప్రశస్తి చేకూరినట్లు రామిరెడ్డిగారు ఆ వ్యాసంలో రాశారు. నేనా గ్రంథమును మొట్టమొదట చదివినప్పుడు ఇటువంటి మహోన్నత భావములు ఛ్ఛందోబద్ధమై యుండిన మరెంత రమణీయముగా నుండెడివో యని తలంచితిని."

ఇంగ్లాండులోకూడా ముక్తచ్ఛందో ప్రాభవకాలం చాలా పరిమితమే ననాలి. ఎందుకంటే 1930ల తర్వాత మళ్లీ సాంప్రదాయక ఛందో రూపాలు తల ఎత్తడం జరిగింది. ఈనాడు ఫ్రీవెర్స్ అనేది అంతగా గౌరవ స్థానం పొందడం లేదు. అది వేరే విషయం. ఇంతకూ తెలుగు కవిత్వ పరిణామంలో వచన గేయానికి అంకురార్పణ చేసినవారు ఎవ్వరూ నేరుగా వాల్ట్ విట్మన్‌నుండి ప్రోత్సాహం పొందినట్లు కనిపించదు. బహుశా ఇంగ్లీషు కవిత్వంనుండి పొంది ఉండి ఉంటారు. అనుకరణోత్సాహం దీనికి కారణం కాదు. స్వభాషా కవిత్వంలో ఏర్పడిన దుస్థితికి ప్రతిచర్యగానే దీనిని భావించాలి. గాని, ఇంకో విధంగా కాదు.

## 3

నేటి వచన గేయానికి గల వేళ్లను వెదికి కనిపెట్టడంలో, ప్రాచీన సంస్కృతాంధ్ర కావ్యాలలోనూ ఛందో గ్రంథాలలోనూ కనుదగిలే రూపాలను కొన్నిటిని కొందరు ఉద్ధరిస్తున్నారు. పోలికలు చూపి తేడాలు చెప్పడం వరకే అయితే ఫరవాలేదు గాని, ఆ బోదెలనుండి ఈ శాఖలు మొలిచాయని భావిస్తే, అబద్ధాన్ని సత్యంగా భ్రమించిన వాళ్ల మౌతాము.

'అభ్యుదయ' (1956 జనవరి)లో 'వచన పద్యాలు : కొన్ని సూచనలు' అనే వ్యాసం రాసిన శ్రీ బూదరాజు రాధాకృష్ణగారు, 'జయంతి' (జూలై 1960)లో 'వచన పద్యం' అనే వ్యాసం

రాసిన శ్రీ దామెర మల్లారెడ్డిగానీ ఈ భ్రమకు లోబడలేదు. ఇద్దరూ ప్రాచీన వచన రూప విశేషాలను వివరంగా వర్ణించారు. బూదరాజు రాధాకృష్ణగారిలాగంటారు.

"అటు సంస్కృతాలంకారికులు, ఇటు ఆంధ్ర లాక్షణికులు గద్య భేదాలను వక్కాణించినప్పుడు— పద్య భాగాలు అంతర్గర్భితంగా ఉన్న గద్యాలను 'వృత్తగంధి గద్య'లని పేర్కొని ఉన్నారు.....లాక్షణిక మర్యాదలనుబట్టి చూడగా 'ఉదాహరణ కావ్యాల'లోని 'కళికోత్కళిక'లనే మాత్రాచ్ఛందస్సులు, పాల్కురికి సోమనాథాదులు రచించిన 'గద్యము'లూ, రగడలుగా, వాటి వికార రూపాలుగా, గాన యోగ్యములుగా ఉన్నప్పటికీ, పద్యాలుగా పరిగణింపబడలేదని తెలుస్తున్నది. ఈ విధమైన రచనకు 'ఉత్కళికా ప్రాయగద్యం' అనిపేరు. ఇట్లు గద్య భేదాలుగా చెప్పబడిన నాల్గింటిలో రెండు గాన యోగ్యతచే పద్య కవితకు, లేక పద కవితకు సన్నిహితంగానే ఉన్నాయి.

" 'అల్ప సమాసకము' అని లాక్షణికులు నిర్వచించిన 'చూర్ణిక' అన్న గద్యభేదాన్ని 'సంకీర్తనా చార్యు'డైన అన్నమాచార్యుడు 'తాళగంధి చూర్ణిక'మని వ్యవహరించాడు. అంటే గద్య భేదాలలో మూడవదైన చూర్ణికగూడా తాళబద్ధమై గాన యోగ్యమైనదేనని గుర్తించాలి.....

"కాగా ముక్తకము' అన్న గద్యభేద మొక్కటే గాన యోగ్యం కానిదిగా ఉన్నది."

వచన 'పద్యం' అన్నప్పుడు, పద్యశబ్దంవల్ల శ్రవ్యపేయత్వాన్ని ప్రయోజనంగా భావించినట్లవుతుంది. గాని, వచనంవలె 'చదువదగిన' పద్యాలనుకొన్నప్పుడు ప్రయాజనమేమీ ఉండదంటూ, రాధాకృష్ణ పై చారిత్రక సమాచారాన్ని అందించారు. అయితే, గాన యోగ్యత ఈ వచన గేయాలకు దాదాపు లేనట్లే అనుకోవాలి. పద్య కవితకుగానీ పదకవితకుగాని ఇవి సన్నిహితం కావు. సంగీత మనేది, అనుక్రమంగా మనకు పరిచితమైన ఛందస్సులను ఆశ్రయించుకొనే ఉండనక్కరలేదు. దానిని సాధించే అవకాశాలు ఛందస్సుకు బయట గూడా అనేకంగా ఉన్నాయి. మల్లారెడ్డి అన్నట్లు " .... ఈ రచనలో (వచన పద్యంలో) ఆ సంగీతమూ ఆ నియమాలూ లేకపోయినా, ఇందులో అంతర్వాహినిగా ఉన్న అంతర్లయ, రచనా శిల్పంలోని మెలకువలూ ఈ స్థితిని కలిగిస్తవి." వచనంలోని వచనత్వం పోయి "పద్యం చదివిన అనుభూతి" కలగాలంటే, యతిప్రాసలూ, మాత్రలూ, గణాలూ అక్కరలేదు.

"మహాకవి ఆశ్చర్యం" అనే పేరుతో శ్రీశ్రీ గారి అద్భుత వచన రచన నొకదానిని మల్లవరపు విశ్వేశ్వరరావుగారు పైన పేర్కొన్న వ్యాసంలో ఉదహరించి, ఇది "పద్యంలాంటి వచనం" అన్నారు. వచనకావ్య రచనకు గల సమర్థనలన్నీ క్రోడీకరించినట్లున్న ఈ గేయంలోని ఒక ఖండం చూద్దాం:

".... ఛందస్సు (గాయత్రి సాక్షిగా చెబుతున్నాను) ఎటు తిరిగితే అటు ఒరుగుతుంది. విధానంలో వికారం. మాత్రలు మింగడం నాకు చేతకాదు. అల్లిక రంగవల్లి. అంకెలు మన సంకెళ్లు ...."

స్వచ్ఛంద మనోవ్యాపారాలకు అనుగుణమైన రచనా నిర్నిబద్ధత, వచన కావ్యం ద్వారా సాధ్యమౌతుంది. బహిరంగంగా ఆకారం వికారానికి లోబడినట్లు కనిపించినా, అంతరంగిక ఐక్యత దూరం కానంతకాలం, రచన కావ్యం కాకుండాపోదు. కవి భావోద్రేకానికి కనిపించే గట్లు ఉండవేమో గాని, సానుభూతితో చూస్తే దరులు రెండు గాక రెండువేలు కనిపిస్తాయి. అంటే, ఎక్కడికక్కడ, ఎప్పటికప్పుడు (Spontaneous) వచనగేయకారుడు ఉద్రేకాన్ని అనేక విధాలుగా సంయమితం చేసుకుంటూ రచన గావిస్తాడు. ఇక పద సంగీతమా ? అది గణాలమీద, మాత్రలమీద, యతి ప్రాసల మీద మాత్రమే ఆధారపడుతుం దనుకునే వాళ్లకు తమ చెవులు తప్పి ఇతర ప్రమాణాలేవీ లేవు. విని విని వాడుక బడిన పద్ధతులనే గాని, వింత పద్ధతులను చెవి గానీ, మనస్సు గానీ హర్షించలేదు.—విచిత్రాన్ని కన్ను హర్షించలేనట్లే !

నిజానికి మాటకూ, పాటకూ వైరుధ్యంలేదు. కవిత్వంలో వచనం అనివార్యం. పదాలలోనే గాక అర్థంలో గూడా సంగీతం ఉంది. అయితే వచన పద్ధతి ద్వారా సూచించదగిన అర్థం కంటె, పద్య పద్ధతి ద్వారా సూచించగలిగేది భిన్నమైనదీ, అతీతమైనదీ. కవిత్వంలో సంభాషణాక్రమం ఉంది. అయితే అది నిత్య వ్యవహారంలోని సంభాషణారీతికి నకలేమీ కాదు. కావ్యంలోని సంభాషణను విన్నప్పుడు ఆ శ్రోత, చదివినప్పుడు ఆ పఠిత ఏమనుకోవాలంటే, 'నేనే గనక కవిత్వం చెప్పగలిగితే, ఇలాగే నేను మాట్లాడగోరుతాను'. అలా అనుకొన్నప్పుడే, ఆ కవిత్వంలోని సంభాషణ క్రమం ధన్యమౌతుంది. అంటే, తన కాలంలోని నిత్య సంభాషణలో గర్భితమై ఉన్న సంగీతమే, ఆ కవిత్వానికి ప్రాప్తిస్తుంది. అందమైన పదాలను కూరిస్తేనే సంగీతం పుట్టుకువస్తుం దనుకోవడం భ్రమ.

"The music of a word arises from its relation first to the words immediately preceding and following it, and indefinitely to the rest of its context; and from another

**relation, that of its immediate meaning in that context to all other meanings which it has had in other contexts, to its greater or less wealth of association.''**

(The Music of poetry· T. S. Eliot)

అంటే, కవిత్వ గత సంగీత మనేది శబ్దార్థాలను ఆశ్రయించుకొని ఉంటుంది. గాని, శబ్దాశ్రితం మాత్రమే కాదు. ముత్తెపు సరులు పోహళించినట్లుగా "తమలోన దొరయు శబ్దములు గూర్చి" తేనే చాలదు. 'ప్రభావతీ ప్రద్యుమ్నము'లో పింగళి సూరన చేసిన వర్ణన, టి. ఎస్. ఇలియట్ భావాన్ని పూర్తిగా నిరాకరించదు.

"సీ. శబ్ద సంస్కార మెచ్చటను జాఱఁగనీక
పద మైత్రి యర్థ సంపదలఁ బొదలఁ
దలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తి దోషంబు పొంతఁ బోక
యాకాంక్షిత స్ఫూర్తి యాచరించుచును శా
ఖా చంక్రమక్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థ భావంబు పాదుకో నదుకుచు
నుపపత్తి యెందు నత్యూర్జితముగ
తే. గీ. నొకటఁ బూర్వోత్తర విరోధ మొందకుండఁ
దత్త దవయవ వాక్య తాత్పర్య భేద
ములు మహా కావ్య తాత్పర్యమునకు నొనరఁ
బలుకనేర్చుట బహు తపః ఫలముగాదె ?"

పాడడ మనేది ఒక్కటే కవిత్వానికి ధ్యేయం కాదు. అలాగయితే ప్రతి కావ్యమూ పద్యమో పదమో కావాలి. కవి స్వగతమే లోకంతో అతని సంభాషణ. ఆ సంభాషణ వచన గేయంలో సాగినంత సులువుగా ఒడుపుగా ఇంకొకదానిలో సాగదు. పైగా, దానికి సహజత్వం కూడా ఇక్కడ సిద్ధించినంతగా ఇంకెక్కడా సిద్ధించదు. దామెర మల్లారెడ్డి రాసినట్లు "రచనలో ఉండే వచనత్వంవల్ల దైనికంగా మనం వాడే పదాలూ, వస్తువులూ, అభివ్యక్తులూ, యథాతథంగా దీనిలోకి వస్తవి. ఛందో నియమాదులు లేకపోవడంవల్ల వ్యర్థ పదాలు దాదాపుగా రావనే చెప్పాలి. పాద పూరణం అన్న యిబ్బంది అసలే లేదు. భావాన్నిబట్టి వాక్య నిర్మాణం చేసుకోవచ్చు." చెప్పదలచిన భావాన్ని శాఖా చంక్రమణం లేకుండా చెప్పాలంటే, మాత్రాచ్ఛందస్సు కంటె వచన గేయమే ఎక్కువ యోగ్యమైనది.

వచనగేయాన్ని గురించి అతిశయోక్తులు పలికి, లేని ప్రహత్వాన్ని దానికి ఆపాదించడం మంచిదికాదు. కావ్య స్వరూపంలో వచ్చిన ఈ మార్పును కావ్య స్వభావానికి అంటగట్టడం తగదు. ఈ రెంటి నడుమ సంబంధం లేదనను గాని, ఆ సంబంధం శ్రీ అరిపిరాల విశ్వం ఊహించిన సంబంధం కాదనుకుంటాను. 'కాలం గీస్తున్న గీతలు' అనే తమ కావ్య సంపుటికి చేర్చిన 'ఆ ముఖమ్' లో విశ్వం ఇలాగంటారు. "ఆవేశరహితంగా, పురాణ సంప్రదాయం నుంచి, కావలసిన మంచిని స్వీకరిస్తూ ఆలోచనాత్మక పరిణామాన్ని కోరే తత్త్వం (Evolutionists) ప్రస్తుత వచన కవితకు వెన్నెముక యీ పరిణామ వాదమే, ఈ సమన్వయ సౌమనస్య సిద్ధాంతమే."

ఈ వాక్యాల భావంతో ఎవరికీ పేచీ ఉండనక్కరలేదు గానీ, దీనికీ వచన కవిత్వానికీ గల బాంధవ్య మేమిటో ? "ఆలోచనాత్మక పరిణామాన్ని కోరే తత్త్వం" పద్యంలోనూ, పదంలోనూ వెలువడగూడదా ? వచన కవిత్వం నుండి ఒక తత్త్వాన్ని రాబట్టే ప్రయత్నం వృథా పరిశ్రమ. అది ఆ కవి వైయక్తిక తత్త్వమే గాని, వచన కావ్యకర్తల సమిష్టి తత్త్వం కాదు. మార్క్సికవాదుల నుండి అభ్యుదయవాదుల వరకు ఈ ప్రక్రియను నేడు ప్రయోగిస్తున్నారని మరవగూడదు.

శ్రీ శ్రీ, తిలక్‌ల తర్వాత వచన గేయాన్ని కుందుర్తి ఆంజనేయులుగారికంటే బహుళంగానూ సామర్థ్యంతోనూ ప్రయోగించిన కవులు లేరేమో! గోపాల చక్రవర్తిగారి కావ్య సంపుటి "కలం కలలు"ను "హృదయం విప్పి" పరిచయం చేస్తూ, కుందుర్తి చెప్పిన మాటలు వెలలేని మాటలు. వచన గేయం రాసి మెప్పించడమంత కష్టమైన పనిలేదు. దానికి ఛందస్సు లేదుగా ఆదరువుగా? అసమర్థుని చేతిలో అది కుంటుబడుతుంది. లేకుంటే చప్పబడుతుంది. ఒక్కొసారి చెడిపోయిన వచనంకంటే చెడిపోతుంది. ఇంకోసారి పద్య వాసనలు మస్తుగా ఒళ్లంతా పులుముకుని, అదీ ఇదీ కాకుండా పోతుంది. అంచేతనే కుందుర్తి ఇలాగంటారు.

"కేవలం పద ప్రయోగ కౌశలం, ఊహాశక్తి ప్రదర్శన, నిరంతర శబ్ద చిత్ర కల్పన, ఎక్కడికక్కడ ఓహో అనిపించగల నేర్పు ఉంటేనే, వచన గేయం రక్తి కడుతుంది".

అది ఎందరికోగాని లేకపోవడ మటుంచి, అద్యంతమూ అందాల ముద్దగా ఏ కావ్యాన్నీ తీర్చిదిద్దనక్కరలేదుకూడా. కాస్త మన్నూ కాస్త మిన్నూ కలగలిసినట్లు, వాస్తవాన్ని కల్పననూ, సామాన్యాన్నీ అసమాన్యాన్నీ కలగలుపుతాడు కవి. అందుచేత వచన కావ్యం, పద్యగద్యాల మేలికలయిక, నవీన యుగ భౌతిక మానసిక వాతావరణంలో కవిత్వ స్వరూపంలో సహజంగా కలిగిన మార్పు.

ఈ మార్పును టాల్స్టాయివంటి మహాశయుడు అభిలషించాడని, సోవియట్ సాహిత్య విమర్శకుడైన కాన్స్టాన్‌టిన్ పౌస్టోవస్కీగారి 'The golden Rose'లో నేను చదివాను.

"Where is the border line between prose and poetry, I shall never know. Why are poetry and prose so closely linked, and happiness and unhappiness?... Try all at once to blend poetry with prose..."

పౌస్టొవస్కీగారి అభిప్రాయాన్ని గూడా గమనిద్దాం:

"The summits of literature and true perfection can be reached only in an organic integration of poetry and prose, or, to be exact, in saturating prose with the essence of poetry with its well-springs, its pure breath, the alluring power of its beauty."

కవిత్వానికీ వచనానికీ రూపంలో చెరిగిపో మొదలైన ఎల్లలు అక్కడితో ఆగుతాయా? వచనంలోని మెళుకువలను కవిత్వం స్వీకరించి కాయకల్ప చికిత్స చేసుకుంటున్నట్లే, కవిత్వంలోని సౌందర్య ప్రధాన దృక్పథాన్ని వచనం స్వీకరించి ఉత్సాహి కాగోరుతున్నది. కవిత్వానికి కావలసింది పటువు, బిగువూ, వచనానికి కావలసింది సొగసూ మెత్తనా. ఈ లోపపూరణం విడివిడిగా గాక, రెండూ సమ్మేళన పొందినప్పుడే సులువుగా జరుగుతుంది. శ్రీ శ్రీ గారిని గురించి ప్రస్తుతిస్తూ, 'భువన ఘోషలో' పూర్వం నేను రాసిన చరణం, ఈ ఊహను మనస్సులో బెట్టుకుని రాసిందే :

"రసము పౌరుష పాటవంబును
లుప్తమైచను పద్యనాడుల
గద్యతోపలి గర్జ దూరిచి,
నడక హుందా నగిషి నేర్పరి
తనము పోయిన గద్య ముక్కున
కవనగతమౌ కదము దూరిచి,
పద్య గద్యోద్వాహ వైభవ
శుభారంభకు డాయె శ్రీ శ్రీ!"

1939 'భారతి'తో శ్రీ శ్రీ చెప్పిన జోస్యం మిడతం భొట్ల జోస్యం కాలేదన్నది, 1964 వరకూ గడిచిన పాతికేళ్ల కాలపు తెలుగు కవిత్వపు ముందు నడక రుజువు చేస్తున్నది. ఇది బుజువని లోకం అంటున్నది.



# మహారాజ యోగములు

శ్రీ దివాకరుని వెంకటసుబ్బారావు

రాజయోగములు పలువిధములని, వానియందు పలు స్థాయీలు గలవని తెలిపియున్నాను. ఇట్టి రాజయోగములు అనేకము లున్నవి. దేశాధ్యక్షులు పలువు రున్నారు. వారి ఔన్నత్యము వారి దేశ ఆర్థిక స్థితి, సైనిక బలము, ప్రజాసంఖ్య, దేశ విస్తీర్ణము మొదలగు వానిపై నాధారపడి యున్నవి. కోటీశ్వరులు గల దేశమును పాలించు నతడు అధ్యక్షుడే. అట్లే ఫకీరులున్న దేశమును పాలించు నతడును అధ్యక్షుడే. కాని, వారు అనుభవించు గౌరవ ప్రతిష్ఠలందు ఎడలేని భేద మున్నది గదా ! దేశ వైశాల్యము గొప్పదైనను, జనసంఖ్య ఎక్కువైనను, దేశ పురోగమనము సర్వ విధముల కుంటుపడియుండ ఆ దేశాధ్యక్షుడు, అంతకంటె స్వల్ప జన సంఖ్య గలిగి, విస్తీర్ణతయందును చిన్నదై యున్నను సర్వాంగ లక్షణ సముపేతమై శోభిల్లు దేశమును పాలించు నధ్యక్షునితో సరితూగడు గదా ! అట్లే ఉపమంత్రులు, సహాయ మంత్రులు, మంత్రులు, ముఖ్యమంత్రులు, ప్రధాన మంత్రులు వివిధ దేశములందు భిన్న రీతులలో రాజయోగ మనుభవించు చున్నారు. వీరియందు గూడ పరదేశముపై నాధారపడియుండు దేశ ప్రధాని పేరునకు ప్రధానమంత్రి యగును గాని సర్వ విధముల తన దేశము నాదుకొను విదేశ ప్రధానితో సరితూగజాల డనుట విశదమగు విషయము. అత డనుభవించు రాజయోగము గూడ స్వల్పము. ఈవిధముగా సర్వ రంగములందు రాజయోగములో గోచరించు విభిన్న స్థాయీ పథముల నూహింపనగును.

ఒక్క రాజకీయ రంగమున మాత్రమే గాక ఇతర రంగములందును పరిశీలించి చూచిన వివిధ రాజయోగము లందు మితిలేని భేదములు గన్పించుచున్నవి. కాని, అందఱును కొలదిగనో గొప్పగనో రాజయోగ మనుభవించుచున్నారు. గాన, ఈ వ్యాసమునందు రాజయోగ కారకులగు గ్రహములు ద్వాదశ లగ్నములందు ఒక్కొక్క లగ్నమునకు ఏయే స్థానములందుండి, ఏవిధముగా రాజయోగమును ప్రసాదించు చున్నవను విషయముపై సమగ్రముగా చర్చించితిని. దీని విషయమై రాజ, మహారాజ యోగములను భిన్నరీతులం దనుభవించిన నూర్గురు మహావ్యక్తుల జాతకముల పరిశీలించుట జరిగినది. ఈ జాతకులు దేశ చరిత్రలందు ప్రఖ్యాతి గాంచిన నాయకులు. అసమాన ప్రజ్ఞావంతులు. వీరియందు దేశాధ్యక్షు లున్నారు. ప్రధాను లున్నారు. వివిధ స్థాయిల యందున్న మంత్రిపదవులనుభవించుచున్న, అనుభవించిన మేధావు లున్నారు. సార్వభౌములు, మహారాజులు, మహా రాణులు ఉన్నారు. నిరంకుశపాలన గావించినవా రున్నారు. దేశ స్వాతంత్ర్య సాధనకై నడుము కట్టిన ధీరులున్నారు. వీరం దరు ఈనాటికిని ప్రజలచే మన్ననలందుచున్నారనుటలో ఇసుమంతయు సందేహములేదు. ఇట్టివారి జాతకములను పరిశీలించి వ్రాసినందున ఈ వ్యాసమందు తెలుపబడిన రాజయోగ విషయములు సత్యదూరములు గావని తలంపవచ్చును. ఇందలి రహస్యములు పాఠకులు గ్రహించి ఋషి సంప్రదాయ బద్ధమైన జ్యోతిషశాస్త్రమును గౌరవింతురని ఆశించుచున్నాను. ఈ పరిశోధనచే జ్యోతిషశాస్త్రమందలి సత్యము గ్రహించిన ఈ శాస్త్రము న్యాయసమ్మతమైనదని, కాలానుక్రమమున రాజ పోషణకు దూరమై, తుంటరులచే దుర్వినియోగపరుపబడి అగౌరవింపబడుచున్నదని స్పష్టముగా గ్రహింపగలరు.

రాజయోగముల నెరుగుటకు పరిశీలింపవలసిన ముఖ్యాంశములు :—

1. లగ్నాధిపతి స్థితి, బలము, 2. లగ్న స్వభావము, 3. ద్వితీయ, పంచమాధిపతుల స్థితి, బలములు, 4. దశమ స్థానము, దశమాధిపతుల స్థితి, బల, స్వభావములు, 5. చంద్ర లగ్నము, చంద్రలగ్నాత్తు లగ్న దశమాధిపతుల స్థితి, బల, స్వభావములు, 6. దశమమందున్న, దశమమును వీక్షించుచున్న గ్రహముల స్థితి, బల, స్వభావములు, 7. రవి, చంద్రుల బలము, జాతకబలము, 8. రాజయోగ కారక, రాజయోగముల పరిశీలన, 9. లగ్న దశానాథులున్న నక్షత్రాధిపతుల విచారణ, 10. లగ్న, లగ్నాధిపతుల, నవాంశాధిపతుల విచారణ, 11. దశమ, దశమాధిపతుల, దశాంశాధిపతుల విచారణ, 12. త్రింశాంశ, లగ్న, దశమాధిపతుల,, లగ్న దశమ భావముల సమగ్ర పరిశీలన.

**యోగ కారక గ్రహములు:—** భాగ్య, రాజ్యాధిపతులు, పంచమ రాజ్యాధిపతులు, పంచమ భాగ్యాధిపతులు, లగ్నపంచమాధిపతులు, చతుర్థ పంచమాధిపతులు, లగ్న రాజ్యాధిపతులు, లగ్న భాగ్యాధిపతులు, చతుర్థ రాజ్యాధిపతులు, చతుర్థ భాగ్యాధిపతులు, లగ్న చతుర్థాధిపతులు, లాభాధిపతితో కలిసిగాని, కలియకగాని, లాభమందున్న పంచమ, భాగ్య, రాజ్యాధిపతులు. వీరితో శుక్ర, కేతులు చేరరాదు.

**వివిధ రాజయోగ ప్రాప్తికి ముఖ్యసూత్రములు:—** 1. లగ్న, ద్వితీయాధిపతుల పరివర్తన, 2. లాభాధిపతి శుభ గ్రహ సంబంధుడై కేంద్రమందుండుట. 3. శుభ గ్రహ సంబంధముగల గురు, రాహులయుతి., 4. శుక్ర దృష్టిగల ఉచ్చ చంద్రుడు, 5. రాజయోగ కారకులు శుభ రాశిస్థితి, 6. భాగ్య రాజ్యాధిపతులకు అష్టమ, లాభాధిపతుల సంబంధము లేకుండుట, 7. రాహు కేతులు దశమ కేంద్రమందు దశమాధిపతి దృష్టి నందిన, బలవంతుడగు దశమాధిపతి పంచమ నవమాధిపతులతో కూడిన లగ్నాధిపతి లగ్న ప్రథమద్రేక్కాణమందుండి పాప సంబంధము లేకున్న, 8. పూర్ణచంద్రుడు కేంద్రములగు, ఉచ్చ, స్వ, మిత్ర క్షేత్రములందుండి శుభ దృష్టి నొందిన, లగ్న, భాగ్య, రాజ్యాధిపతులు భాగ్య, రాజ్యములందున్న, 9. బుధ, గురు, శుక్ర క్రమమున చంద్రాధియోగము ప్రాప్తించిన, 10. ద్వితీయ సప్తమములందున్న రాహు కేతులకు కోణాధిపతుల సంబంధము గల్గిన 11. రాజయోగ కారకులు ఉపచయము లందున్న, 12. ఎక్కువ గ్రహములు స్వక్షేత్రములందున్న లేదా స్వక్షేత్రముల చూచిన పంచమహా పురుష యోగములందు రెండుగాని, అంత కన్న నెక్కువగాని మహాపురుషుల యోగములు ప్రాప్తించిన, 13. చంద్ర, గురులు శుక్రవీక్షణ నొంది కేంద్రములందున్న, 14. నైసర్గిక పాపులు లగ్నమునుండిగాని, లగ్నాధిపతినుండిగాని చంద్రునినుండిగాని, 3,6,11, స్థానములందున్న, 15. కుజ బుధులు ద్వితీయమందు, రవి శుక్రులు చతుర్థమందు, కుజుడు దశమమందు, శని ఏకాదశమందు, గురువు లగ్నమందున్న, 16. గురు, బుధ, శుక్రులు లగ్నములగు కర్కాటక, కన్య, ధను ర్మీన ములందున్న, లేదా శుక్రుడు మీన, తుల లందుగాని, గురుడు కర్కాట, ధను, ర్మీనములందుగాని, బుధుడు మిధున, కన్యలందు గాని యుండి వారికెట్టి పాప సంబంధము కలుగకున్న, 17. లగ్న, చంద్రులు వర్గోత్తమాంశల నొంది మిత్రగ్రహములచే వీక్షించ బడిన, 18. నవాంశ లగ్నము వర్గోత్తమముకాగా, చంద్రాత్తు ధన భావమందు శుభులుండి, కేంద్రములు గ్రహయుక్తములైన, 19. ఉచ్చనొందిన గ్రహములు కేంద్రములందున్న, 20. నీచ గ్రహములు 2, 3, 10, 11 లందున్న, 21. భాగ్యమందున్న ఉచ్చగ్రహము శుభగ్రహ వీక్షణనొందిన, 22. లగ్న, చంద్ర లగ్నాధిపతులు భాగ్యమందున్న శని కుజులతో కలసిన, 23. చతుర్థాధిపతి భాగ్యాధిపతితో కలసి చతుర్థమందున్న, 24. లగ్నమందున్న చతుర్థాధిపతిని గురుడు చూచిన, 25. 3,6, 11, ఆధిపత్యములు గల గ్రహములు భాగ్య, రాజ్యాధిపతులతో కలసి భాగ్య, రాజ్యములందున్న, 26. పంచమ, రాజ్యాధిపతులు యోగ కారకులై రాహువుతో గలసిన, 27. దశమాధిపతి బలవంతుడుకాగా దశమమందు రాహుకేతువులున్న, 28. భాగ్యాధిపతి శుభయుతుడై కేంద్రములందున్న, 29. గురు, రాహువులు శుభ దృష్టి నొందిన 30. 3,6,10 భావములకు కుజ సంబంధము గల్గిన, 31. మంద, శీఘ్ర గ్రహములకు భాగ్య, రాజ్యాధిపతులు కలసినపుడు శీఘ్ర గ్రహము మంద గ్రహమునకు వెనుక 12 భాగల నతిక్రమింపకుండిన వీరిరువురు 8 మధ్య, చంద్రుడుండిన విపరీతరాజ యోగవం, 32. దుస్థానాధిపతులగు గురు, బుధ, శుక్రులు క్రమముగా షష్టాష్టమ, వ్యయములందు ఉండుట గొప రాజయోగము, 33. భాగ్యరాజ్యాధిపతులు తృతీయ, షష్ఠ లాభాధిపతులతో గలసియుండుట 34. లాభాధిపతి శుభులతో గలసి కేంద్రమందుండుట, 35. తృతీయ మందున్న కేతువు రాజయోగ కారకుడు, 36. దశమమందున్న రాహువు రాజయోగ కారుకుడు, 37. సప్తమమందున్న శనిగాని, రాహువుగాని రాజయోగ కారకులు. 38. తృతీయ, భాగ్యము లందున్న శని రాజయోగ కారకుడు, 39. ఉపచయములందున్న చంద్ర శనులు, 40. నైసర్గిక పాపులైన అష్టమ వ్యయాధిపతుల షష్ఠ స్థితి రాజయోగము. 41. శుభుడగు రాజ్యాధిపతి శుభయుతుడైనను, వర్గోత్తమము కలిగినపుడు లగ్నాధిపతి లగ్నమందున్న గొప్ప రాజయోగము. 42. రాహు, కేతులు కోణాధిపతులతోగూడి కేంద్రములందు, కేంద్రాధిపతులతో కోణము లందున్న రాజయోగము. 43. స్థిర రాశియగు చంద్ర కేంద్రము లగ్న పంచమమై, అందు గురుడుండ పంచమాధిపతి రాజ్య మందున్న గొప్ప రాజయోగము, 44. కేంద్రమందుగాని, కోణ మందుగాని, మూలత్రికోణమందుగాని, ఉచ్చయందుగాని యున్న బలవంతుడగు శనికి రాజ్యాధిపతి సంబంధము గల్గిన రాజ్యాధిపతి, భాగ్య, స్వక్షేత్ర ఉచ్చలోగాని, స్వనవాంశనుగాని పారావతాద్యంశల నొందిన, శని రాహువులు దశమమందుండి భాగ్యాధిపతిచే వీక్షితులై లగ్నాధిపతి నీచగ్రహయుతుడైనను రాజయోగము, 45. చంద్రరాశి నాధుడు కేంద్ర కోణములందుగాని, బుధునకు కేంద్రమందు గాని యున్న రాజయోజగము, 46. లగ్నాదిగా ఆరు రాసులలో 7 గ్రహములుండి పూర్ణ చంద్రుడు భాగ్యాధిపతిచే చూడబడినను, 47. రాజ్యాధిపతి నుండి వరుసగా 6 రాసులలో గ్రహము లున్నను, 48. 1, 2, 3 భావములలో

గాని 10, 11, 12 భావములలో గాని శుభగ్రహము లున్నను, 49. ద్వితీయ పంచమాధిపతులు ఆ క్షేత్రములందుగాని, భాగ్య, రాజ్యములందున్నను, 50. ధన, లాభాధిపతులు దోష రహితులై రాజ్యమందున్న, 51. తులా, మీనములుగాని దశమ మందు రవి బుధులున్న, 52. చంద్ర, శుక్రులు దశమ మందున్న, 53. కర్మ స్థానమందు కుజు డుచ్ఛ నొందిన 54. గ్రహయుక్తమగు చరరాశి లగ్నమై కేంద్రములం దుచ్ఛ గ్రహములుండి ఇతర గ్రహములు తృతీయమందున్న 55. పంచమమందు రవి, రాజ్యమందు కుజుడు, లాభమంద శని యున్న, 56. మేష, సింహ, కన్య, తుల, కుంభములంద సప్తగ్రహములున్న, 57. శుభులు భాగ్య, లాభములందు పాపులు షష్ఠ, రాజ్యములందున్న, 58. బలవంతులగు శుభులు కేంద్రములందు, కుజ, శనులు భాగ్య, రాజ్యములం దున్న, 59. ఉచ్ఛ నొందిన మూడు గ్రహములు పరస్పర కోణములందున్న, 60. బలహీనులగు పాపులు, బలవంతులగు శుభులు కోణ కేంద్రములందున్న, 61. గురు, బుధులు కేంద్రములందుండి భాగ్య లాభాధిపతులచే చూడబడిన, 62. భాగ్యాధిపతియున్న నవాంశాధిపతి లగ్నమునకు కేంద్ర కోణములందున్న, 63. నీచగ్రహ నవాంశాధిపతి లగ్న కేంద్ర కోణములందుండ, లగ్నాధిపతి చరరాశిగతుడైన, 64. లగ్నమందు శుక్రుడు, చతుర్థమందు బుధ, శనులు, మిగిలిన గ్రహములు తృతీయ లాభములందున్న, 65. కుజ, శని, గురులు వరుసగా రాజ్య, లాభ, లగ్నములందున్న, 66, ద్వితీయ, పంచమ, లాభాధిపత్యములలో నొకటి గల గురుడు చంద్ర కేంద్రమందున్న, 67. తృతీయ వ్యయములందున్న చంద్ర, కుజ, బుధులు అస్తంగత్వము నొందకుండిన, 68. రవి, చంద్రులు వర్గోత్తమాంశల నొందిన, 69. రవి, చంద్ర శుక్రులు ఏకభాగ గతులై గురు వీక్షణ నొందిన, 70. భాగ్య లాభములందున్న శుభుల మధ్య రాజ్యమందు పాపులున్న, 71. చరరాశి లగ్నమై రవి, శుక్ర, శనులు, గురు, చంద్ర, కుజులచే వీక్షింపబడిన, 72. శుక్రుడు అశ్వినీ, కృత్తిక, పుష్యమి, స్వాతి, రేవతి నక్షత్రములందున్న, 73. రవి, పుష్యమి, పుబ్బ, మూల, రేవతి నక్షత్రయుక్తమైన లగ్నములందున్న, 74. మకర పంచమాంశమందు శని యున్న, 75. చంద్రుడు అశ్విని కృత్తిక, పుష్యమి నక్షత్రములందు వర్గోత్తమ మొందిన, 76. అశ్విని, అనూరాధ, ధనిష్ఠలందున్న కుజుడు నవాంశమం దుచ్ఛ నందిన, 77. తుంగ రాహువు దశమమందున్న, 78. కేంద్రములగు చర రాశులు ఉచ్ఛగ్రహ యుక్తములైన రాజ యోగములు ప్రాప్తించుచున్నవి. పై జెప్పబడిన సూత్రములు గాక అనేకము లున్నవి.

**యోగకారక గ్రహములు:**

మేషము—రవి, కుజ, గురు, శనులు.
వృషభము—రవి,బుధ, శని. శుక్రుల్కు
మిధునము—శుక్ర, శనులు.
కర్కాటకము—గురు, కుజులు.
సింహము—కుజ, బుధ, రవులు.
కన్య—శుక్ర, శనులు.
తుల—శని, కుజ, బుధులు.
వృశ్చికము - రవి,చంద్ర గురు, శనులు.
ధనస్సు—కుజ, రవులు.
మకరము—కుజ, బుధ, శుక్రులు.
కుంభము—రవి,కుజ, బుధ,శుక్రులు.
మీనము—చంద్ర, కుజులు.

**ద్వాదశ రాశులకు కలుగు యోగములు:—**

మేషము:—రవి :—3, 12 అందు రాజయోగ కారకుడు, 6, 8 లం దవయోగము. 5 లేక కేంద్రములం దుపయోగింపడు.

పూర్ణచంద్రుడు :— 3, 6, 8 12 అందు శుభము. అందు 3, 12 లం దత్యంత శుభము. 2, 11 అందు సామాన్యము. 5, 9 అందు యోగింపడు. కేంద్రములం దవయోగము.

కుజుడు :—లగ్నము తప్ప ఇతర కేంద్రములందు శుభుడు. దుఃస్థానమ్మునలందు యోగింపడు.

గురువు :— ఇతనికి వ్యయాధిపత్య దోషములేదు. కేంద్రములందు శుభము. దుఃస్థానములందు పాపము.

శుక్రుడు :—6, 8, 12 అందు యోగము. అందు వ్యయమందు విపరీతయోగము. 3, 11 అందు సామాన్యము. కేంద్ర కోణములందు యోగింపడు. సప్తమ కేంద్రమందు ద్వితీయమందు కన్న ఎక్కువ అవయోగము. శని—తుల తప్ప ఇతర కేంద్ర, కోణములందు రాజయోగకారకుడు. దుఃస్థానమ్ము లందు యోగింపడు. ద్వితీయ లాభములందు ధన భావము నకు యోగించును.

రాహువు :—అష్టమ లాభములందు ఎక్కువ శుభము. 2, 3, 6, 12 అందు కొంచెము తక్కువ. స్వతంత్రుడై లగ్నము తప్ప ఇతర కేంద్రములందు యోగించును.

కేతువు :— కేంద్ర కోణములందు శుభుడు. తృతీయ వ్యయములం దత్యంత శుభము. కోణములం దధిక శుభుడు. లాభ మందు యోగింపడు. రవి దుస్థానాధిపతులతో గలసి దుఃస్థానముల లందున్న యోగించును. రవి, శుక్రులు దుస్థానములందున

యోగము. రవి, బుధులు లగ్నము తప్ప ఇతర కేంద్రములందు కోణములందు ఎక్కువ శుభము నిత్తురు. భాగ్యమందు వీరి కలయిక బుధ యోగమునకు మంచిది. దుస్థానమందు బుధుడవయోగముల జేయును. చంద్ర, కుజులు, చంద్ర, బుధులు కేంద్ర కోణములం దుండుట శుభము. చంద్ర, శుక్రులు దుస్థానములందు యోగింతురు. ద్వితీయమందు సామాన్య యోగమైనను, లాభమం దధికయోగము. చంద్ర, కేతువుల కలయిక దుస్థానములందు శుభము. చంద్ర, శనులు ధన, లాభములందుండుట మంచిది. గురు, చంద్రులు 1, 3, 10, 11 లందు మంచి యోగ మిత్తురు. కుజ, బుధులు 1, 4, 5, 7 లందుండుట శుభము. కుజ, శుక్రులు కర్కాటకమందుండుట యోగము. కుజ, శుక్రులు, తుల యందున్న కుజుడు మాత్రము యోగించును. దుస్థానములందు శుక్రుడు స్వల్పయోగ మిచ్చును. కుజ, రాహువులు లగ్న చతుర్థ, పంచమములం దుండుట శుభము. భాగ్యమందు కొంచెము తక్కువ. బుధ, శుక్రులు కేంద్ర, కోణములందున్న సామాన్య యోగము, 2, 3, 6, 11, 12 లం దధికయోగము. బుధ, శనులు సప్తమము తప్ప ఇతర కేంద్రములందు, కోణములందుండుట మంచిది. గురు, శుక్రులు ద్వితీయ, లాభములందు యోగమిత్తురు. కేంద్ర కోణములందు సామాన్య యోగము. గురు, రాహులు బుధ సంబంధములేక కేంద్ర కోణములందుండుట శుభము. శని, శుక్రులు లాభ వ్యయములందు యోగమిత్తురు. శని, బుధులకు, రవి కుజులకు సంబంధ ముండుట అశుభము. వీరలకు రవి, గురులతో భాగ్యస్థాన సంబంధము ధనయోగము. శుక్ర, రాహులు సప్తమము తప్ప ఇతర కేంద్రములందుండుట యోగము.

**వృషభము** :—ద్వాదశ లగ్నములలో శుభ లగ్నములందు వృషభ మొకటి. ఈ లగ్నాధిపతి శుక్రుడు ద్వితీయ, ద్వాదశములం దత్యంత శుభప్రదుడు. 3, 4, 7, 10 లందు యోగకారకుడు. నవమ కోణమందు పంచమము కన్న ఎక్కువగా యోగించును. కుజుడు లగ్నము తప్ప ఇతర కేంద్రములం దత్యంత యోగ ప్రదుడు. మేష, ధనుస్సులందు కుజస్థితి కడు పాపము. రవి సింహమందుండి, శని మకర, కుంభములందున్న యోగము. గురుడు 3, 8 లందు శుభ మొసంగును. బుధుడు కేంద్ర కోణములందుండుట శుభము; తృతీయమందు రవితో చేర కుండిన అత్యంత యోగము. కేంద్ర కోణములందున్న గురువు యోగప్రదుడు. శని 4, 8, 10, 12 లందు యోగించును. పూర్ణ చంద్రుడు కేంద్రములం దుండుట మంచిది. రాహువు కేంద్రములందు, కేతువు 3, 12 స్థానము లందు, కేంద్రములందు యోగించును. రవి, కుజులు **గాని,** రవి, శనులు గాని, కుజ, శనులుగాని కేంద్ర కోణములందు యోగింతురు. వీరికి యీ స్థానములందు బుధ సంబంధము కూడ శుభము. రవి, చంద్రులు బుధ సంబంధము లేకుండ కేంద్రములందుండుట మంచిది. చంద్ర, శుక్రులు లగ్నము తప్ప యితర కేంద్రములందు శుభులు. రవి, చంద్ర, శుక్రులకు, కుజ లేక శని సంబంధ మత్యంత యోగకారణము. చంద్ర, గురులు లాభమందున్న ఆయుర్భావము బాగుండును. వీరు కేంద్ర కోణములందు కలియుట శుభము. వీరికి కేంద్రములందు రవి లేక కుజ లేక శనుల సంబంధ మత్యంత శుభప్రదము. కోణములందు కొంచెము తక్కువ. చంద్ర, బుధ, గురులు కేంద్ర, కోణములందున్నను, చంద్ర, గురు, శుక్రులు కేంద్రముల కంటె కోణములందున్నను గొప్ప యోగము ప్రాప్తించును. బుధ, శుక్రులు పంచమ కోణమం దున్న అధిక రాజయోగము. ఇది ఈ లగ్నమునకు విశేషము. బుధ, గురులు పంచమమందుండుట మంచిది. బుధ, శుక్రులు ద్వితీయమందున్న బుధ దశాకాలమందు గొప్ప యోగము ప్రాప్తించును. గురు, శుక్రులు 4,7,10, కేంద్రములందు రవి లేక కుజ లేక శనుల సంబంధముచే నధిక రాజయోగ మిచ్చుచున్నారు. వీరిలో గురు దశాకాలమున యోగ మినుమడించును. గురు, శుక్రులు ద్వితీయమందున్న గురుదశ యోగించును. రవి లేక, కుజ లేక శనులతో కలసి రాహువు కేంద్రములందు కోణములందుకంటె ఎక్కువ రాజయోగమిచ్చుచున్నాడు. రాహువు 8, 11, 12 లందు యోగప్రదుడు.

**మిథునము** :— ఈ లగ్నమునకు శుక్రునకు వ్యయాధిపత్య దోషములేదు. రవి కేంద్ర కోణములందు, చంద్రుడు ద్వితీయ, లాభములందుగాని, కేంద్రకోణములందుగాని రాజయోగ ప్రదులు. కుజుడు కేంద్రములందు బుధుడు లాభ వ్యయమ్ము లందు, గురువు అష్టమ ద్వాదశములందు శుక్రుడు 2, 11 స్థానములందు కేంద్రములందు, శని 3, 11 లందు యోగింతురు. శని తృతీయమందు యోగించుటకు ఈ లగ్నమునకు విశేష లక్షణము. గురువు అష్టమ, ద్వాదశములం దధిక రాజయోగ మిచ్చును. బుధుడు పదునొకండవనింట, గురుడు పండ్రెండవ ఇంటగాని లేక గురువు లాభమందుండ బుధుడు వ్యయమందున్నను సమాన రాజయోగము. అష్టమమందు బుధుడిచ్చు యోగము గురువిచ్చు యోగముకంటె తక్కువ. అట్లే షష్ఠమందుకూడ గురువధికయోగ మిచ్చును. బుధ, రవులు, లగ్నమందుండుట మంచిది. కుజ, రవులు గాని, కుజ శనులుగాని కేంద్రములం దున్న శుభము. దుస్థానాధిపతులతో గలసిన రవి గాని, కుజుడు గాని, శని గాని దుస్థానములందు రాజయోగ మిచ్చుచున్నారు. రవి, గురులు దుస్థానములందున్న గురు దశయందు

మంచియోగము. రవి, శుక్రులు కేంద్ర కోణములం దుండుట మంచిది. అశ్లే రవి, బుధులను చూడవలెను. రవి, శనులు కేంద్రములందు మాత్రము యోగ మిచ్చు చున్నారు. రవి కేంద్రములందుండ బుధుడు దుస్థానములం దున్నను రాజయోగము. రవి, కుజ, శనులు కేంద్ర కోణములం దుండుట అధియోగము. చంద్ర, శనులు కుజునకు లాభమం దుండుట మంచిది. చంద్ర, కుజ, శుక్రులుగాని, చంద్ర బుధ, కుజులుగాని లాభమందుండుటధనయోగము. చంద్రుడు ద్వితీయ లాభములందు కుజ, గురు, శనులతో గలియుట అధిక ధనయోగ ప్రాప్తి. ఇది ఈ లగ్నమునకు విశేషము. చంద్ర, కుజులుగాని కుజ, శుక్రులుగాని ధన, భాగ్య, లాభము లందున్న అధిక ధనలాభము. కుజ, బుధులు లాభమందున్నను బుధుడు వ్యయమందుండ గురువు అష్టమమందున్నను అధిక రాజయోగము. బుధుడు సప్తమ, దశమములందు దుస్థానాధి పతులతో గలసినను లగ్న, చతుర్థములందు కుజ, శనులతో కలసినను మంచిది. బుధ, గురులు దుస్థానములందుండుట లేదా పంచమ, భాగ్యములందు దుస్థానాధిపతులతో కలియుట అధియోగము. వీరి సంబంధము, ధన లాభములందు కొంత వరకు మంచిది. పాపుల యుతి లేని బుధ, గురులు దుస్థానము లందున్నను శుభము. కుజుడు కేంద్రాధిపతులతోగాని కేతు వుతో గాని కలసి లాభమందుండుట మంచిది. కుజ శుక్రులు కేంద్రములందు యోగింతురు. బుధ, శనులు గూడ లాభ మందు యోగింతురు. బుధ, గురులు లాభ, వ్యయములందు ప్రబలయోగమిత్తురు. షష్ఠాష్టమాధిపతులతో గలసిన గురువు కేంద్రములందున్నను, కుజ, శనులతో గలసి సప్తమ దశమములందున్నను దుస్థానాధిపతులతో లగ్న చతుర్థమందు న్నను శనితో సప్తమమందున్నను శుభము. శుక్ర, శనులు కోణములందుండుట మంచిది. శని, కేంద్రాధిపతులతో సంబం ధము గలిగి కేంద్రములందుండుట శుభము. శని, కుజ రవులు కేంద్ర కోణములందు యోగింతురు. రాహు కేతువులు కేంద్ర కోణములందు శుభులతో గలియుట మంచిది. రాహువు లాభమందున్నను శుభమే.

**కర్కాటము :**—రవి కేంద్రములందుండుట శుభము. రవి, చంద్రులు కేంద్రములందు, రవి, గురులు ధన, లాభము లందు, రవి, కుజ, శనులు కేంద్రములందుండ గురు, శుక్ర, సంబంధము గల్గిన రవి, కుజులు లగ్న చతుర్థములందున్న, రవి, శుక్రులు ద్వితీయ, భాగ్య, లాభములందున్న ధన, రాజయోగ ములు గల్గును. పూర్ణచంద్రుడు 3, 6, 12 లందు క్షీణ చంద్రుడు కేంద్ర కోణములందు యోగ కారకులు. శని చంద్రులు మేష, కర్కాటములం దుండుట అధియోగము. చంద్ర, కుజ, శనులు లగ్న రాజ్యములందు చంద్ర, కుజులు చతుర్థమందు యోగింతురు. చంద్రుడు లాభమందున్న పూర్ణాయుర్దాయము గల్గును. కేంద్ర కోణములందు చంద్ర, బుధ గురులు కలసిన గురు, బుధులు యోగింతురు. వీరి కలయిక దుస్థానములందు చంద్రునకు శుభము, చంద్ర, రాహు వులు, చంద్ర కేతువులు కేంద్రములందుండుట మంచిది చంద్ర, గురులు లగ్నమందుండుట మంచిది. కుజుడు 1, 4, 10, 11 లందు శుభుడు. కుజుడు కేంద్రములందు చంద్ర, శని, శుక్రులతో గలియుట అంత శుభముగాదు. కుజ, రాహు వులు మేషమందుండుట రాజయోగము. రవి సంబంధములేని కుజుడు కేంద్రగతు డగుట రాజయోగము. రవి, కుజునితో గలసి మేషమందుండుట రాజయోగము. బుధ, శుక్రులు, 1, 7, 10 లం దుండుట మంచిది. బుధ, గురు, శుక్రులు దుస్థానములందుండ శుక్రుడు మాత్రము యోగించును. బుధ, గురులు కేంద్రములందు గాని, దుస్థానములందుగాని, స్వక్షేత్రములందు గాని యుండుట కడు మంచిది. బుధ గురులు కేంద్రములందు, బుధ, శుక్రులు కేంద్ర దుస్థానము లందు, బుధ, శనులు మేషమందు కలియుట అత్యంత శుభము. శుక్రుడు అష్టమ, ద్వాదశములందు అధిక యోగ మిచ్చుచున్నాడు. పంచమమందు కొంత మంచిది. శుక్ర రాహువులు కేంద్ర కోణములందు యోగించుచున్నారు. శుక్ర సంబంధముచే ధన, లాభములందున్న రవి, కుజ, గురులు ధన యోగ మిత్తురు. శని కేంద్రమునం దుండుట మంచిది. రాహు, కేతువులు కేంద్ర కోణములందున్నను, పాపులతో గలసి భాగ్యమందున్నను యోగకారకు లగుచున్నారు. కోణములందు కుజ, శనులతో గలసిన మంచిది. శని, రాహువులు గాని, శని కేతులు గాని మకరమందుండుట, గురు యుతులై రాహు, కేతువులు కేంద్ర కోణములందుండుట అత్యంత శుభము. పూర్ణ చంద్ర యుతుడగు శుక్రుడు అష్టమ, వ్యయములందున్నను, రవి, గురులకు పరివర్తన గల్గిననూ అత్యంత శుభము. ఈ లగ్న మున కిది విశేషము.

**సింహము :**—ద్వాదశ లగ్నములలో సింహము శుభలగ్న ముగా పరిగణింపబడుచున్నది. రవి, శనులు లగ్నమందున్నను కుజుడు సప్తమమందున్నను శుభము. రవి, చంద్ర, కుజ శనులు కేంద్రములందుండుట అధియోగము. రవి, కుజ, శనులు, రాహు, కేతువుల సంబంధము గల్గి కేంద్ర కోణములందుండుట మంచిది. రవి, కుజ, శనులకు పూర్ణ చంద్ర, బుధ, గురుల సంబంధము 1, 4, 7 కేంద్రములందు కలుగుట అత్యంత రాజ

యోగము. పూర్ణచంద్రుడు కేంద్ర కోణములందుండుట మంచిది. ఇచట బుధునితో గలియుట శుభము. చంద్ర, బుధ, గురులు కేంద్ర, కోణములందున్నను, చంద్ర, గురు, శుక్ర, శనులు చతుర్థము తప్ప ఇతర కేంద్రములందున్నను మంచిది. చంద్ర, కుజులు దుస్థానములందున్న కుజుడు మాత్రము యోగించును. కుజుడు 6, 8 12 అందు యోగ కారకుడు. కుజ, శుక్రులు ధన, సహోదరభావములం దుండుట మంచి రాజయోగ లక్షణము. బుధుడు కేంద్ర కోణములందుండుట మంచిది. ఇచట కేంద్ర కోణాధిపతుల సంబంధము వీనికి శుభము. ఇట్లే గురుని కూడ చూచు కొనవలెను. గురుడు 8, 12 అందు యోగ కారకుడు. గురు, శుక్రుల యుతి పాప ఫలముల నిచ్చును. శుక్రుడు 8, 12 అందు శుభుడు. దుస్థానాధిపతులతో గలసి కేంద్ర కోణములం దుండుట రాజయోగము. బుధ, శుక్రులు ధన భావమందుండి అధియోగ కారకు లగుట ఈ లగ్నమునకు విశేషము. చంద్రునకు తృతీయమందున్న శుక్రుడు మంచియోగ మిచ్చును. శని లగ్న సప్తములందు, పంచమ నవమములందు రాజయోగ మిచ్చు చున్నాడు. గురు, బుధ, చంద్రులతో గలసిన రాహు కేతులు శుభులు. రాహు కేతువులు కేంద్ర కోణములందు, 3, 11 అందు యోగ మిచ్చుచున్నారు. కేతువు మాత్రము వ్యయమందుండుట అత్యంత శుభము.

**కన్య** :—రవి కేంద్రములందు శుభుడు. రవి, శుక్రుల పరివర్తన శుభము. రవి, బుధుల కలయిక యోగింపదు. రవి, కుజుల యుతి కేంద్ర కోణములందు మంచిది. రవి, బుధ, గురుల కేంద్ర కోణ యుతి మంచిది. రవి, శుక్రులు ధన భావమందున్న యోగము. రవి, కుజుల పరివర్తన శుభము. పరివర్తనా శుభములు ఈ లగ్నమునకు విశేషము. చంద్ర, గురులు లగ్నమందున్న, చంద్ర, శుక్రులు కేంద్రములందున్న, భాగ్యమందున్న యోగము. చంద్ర శుక్రుల కోణ, ధనస్థాన యుతి ధనలాభము. చంద్ర శుక్రులు కేంద్రములందు గురు బుధులతో కలియరాదు. చంద్రుడు కేంద్రములందుండుట శుభము. కుజుడు వ్యయమందు రాజయోగ మొసగుట ఈ లగ్న మునకు విశేషము. వ్యయమందు రాహువుతో కలసిన అత్యంత శుభము. ఇతర దుస్థానములందు కూడ కుజుడు కొంతవరకు యోగించును. తృతీయ కుజుడు ఈ లగ్నమునకు సోదర వృద్ధి నిచ్చును. ఎట్టి సంబంధములేని కుజుడు కేంద్రము లందు శుభుడు. బుధుడు 3, 6, 12 అందు యోగించును. రవి సంబంధము లేకుండుట మంచిది. బుధ, గురులు సప్తమ మందు రవితో కలియుట శుభము. వీ రిరువురు దుస్థానాధి పతులతో గలియుట మంచిది. గురుడు 6, 8, 12 అందు శుభుడు. ఉచ్చ, గురునకు పాపము. గురు, శుక్ర, చంద్రులు లగ్నమందున్న శుభము. శుక్రుడు వ్యయమందు యోగించును; ద్వితీయమందు రాజయోగము. కేంద్ర కోణములందున్న శుభము. బుధుడు దుస్థానములందుండుట మంచిది. శని రాజ్యమందు శుభుడు. శని, కుజులు వ్యయమందుండుట మంచిది. రాహువు ద్వాదశమందు, రాహు, కేతులు కోణము లందు, 3, 6 నందున్న యోగకారకు లగుచున్నారు.

**తుల** :—ఈ లగ్నమునకు బుధునకు వ్యయాధిపత్య దోషములేదు. రవి భాగ్యమందుండుట శుభము. ధన, లాభము లందు సామాన్యము. రవి, కుజులు మేషమందు తప్ప ఇతర కేంద్ర కోణములందు యోగించుచున్నారు. రవి బుధునితో గాని, గురునితో గాని గలసి దుస్థానములందు ఆ స్థానాధిపతు లతో నుండుట శుభము. చంద్రుడు 6, 8, 12 అందు శుభుడు. కుజుడు మకరము తప్ప ఇతర కేంద్రములందు యోగించును. ధన భావమందు కుజస్థితి శుభము. మకర మందు యోగమునకు కొంత పాపము సంభవించును. కుజ, గురులు, కుజ, గురు, బుధులు కాని కేంద్ర కోణములం దుండుట మంచిది. కుజ, శనులు, తుల, మేష, కర్కాటకము లందు క్రమముగా అధియోగ మిత్తురు. మకరమందు వీరి కలియక శుభముగాదు. బుధ, గురులు కేంద్రములందున్న రాజ యోగము. కోణములందు కొంచెము తక్కువ. కేంద్ర కోణములందు వీరలకు రవి, కుజుల సంబంధము శుభము. బుధుడు కేంద్ర కోణములందుండుట మంచిది. గురుడు కేంద్రములందున్న శుభము. ద్వితీయమందు ధనయోగము. శుక్రుడు 4, 7, 10 అందు చక్కని యోగ మిచ్చుచున్నాడు. నీచ నొందినను యోగించును. నీచ శుక్రుడు కేతువుతో కలి యుట మంచిది. కోణములందు యోగకారకుడు. మకర శుక్రుడు అత్యంత శుభుడు. ద్వాదశ సప్తమములందున్న శని పరమ శుభుడు. శని, కేతులు వ్యయమందుండుట మంచిది. రాహు, కేతులు, మకర, మేషములందు అత్యంత శుభము నిచ్చుచున్నారు. చంద్ర, కుజ, శనులతో చేరిన వీరు కేంద్ర కోణములందు పూర్ణ యోగము నిత్తురు. రాహువు వ్యయ మందు, రాహు కేతువులు 3, 6 అందు యోగింతురు. కేతువు కూడ వ్యయమందు శుభుడే కాని రాహువంత రాజ యోగ మివ్వడు.

**వృశ్చికము** :—ద్వాదశ లగ్నములందు పేర్కొనబడిన శుభలగ్నములలో వృశ్చికము మూడవది. ఈ లగ్నమునకు రవి స్వతంత్ర ఫలముల నీయజాలడు. కుజునితో గాని, శనితో గాని కలిసి 4, 10 కేంద్రములందున్నపు డత్యంత రాజయోగ

మిచ్చుచున్నాడు. కేంద్రములందు శుభుడు. పూర్ణ చంద్రుడు కేంద్రములందున్న మంచిది. బుధునితో కలసి కర్కాటము తప్ప ఇతర కేంద్ర కోణములందున్న శుభము. ఇట్లే చంద్ర, రాహులు, చంద్ర కేతులు, కేంద్ర కోణములందు యోగించు చున్నారు. కుజుడు లగ్నమందు శుభుడు. ఇతర కేంద్ర కోణము లందు శుభుడైనను అంత యోగకారకుడు కాదు. బుధుడు కేంద్ర కోణములందున్న మంచి యోగము ప్రాప్తించును. గురు, బుధులు, బుధ, శుక్రులు కేంద్ర కోణములందు యోగించుచున్నారు. రవి, కుజ, శనులతో కలసిన బుధుడు కేంద్ర కోణములం దధిక యోగ మిచ్చును. సప్తమమందు శుక్రయుక్తుడైన బుధుడు మాత్రము యోగకారకుడగును. గురుడు స్వక్షేత్రమగు ధనస్సునందున్న ధనలాభము. అచట కేతు యుతి గల్గిన ఆకస్మిక ధనప్రాప్తి. కేంద్ర కోణాధి పతులతో గలసి కేంద్ర కోణములందుండుట యోగకారణము. ద్వాదశ గురుడు తరచుగా యోగింపడు. శుక్రుడు 3, 6, 8 లందు శుభుడు. నైసర్గిక పాపులతో కలసి దుస్థానములం దున్న శుక్రుడు యోగకారకుడు. గురు, బుధ, శుక్రులు., గురు బుధ, శనులు, ధన, లాభములందు యోగింతురు. శని చతుర్థ రాజ్యములందు యోగ కారకుడు. రాహు కేతులు పాప యుతులై కేంద్రములందున్న యోగింతురు.

**ధనస్సు:**— రవి, 6, 8 లందు శుభుడు. ఇచ్చట బుధ యుతి మంచిది. వీరి కలియక భాగ్య, రాజ్యములం దంత మంచిదికాదు. రవి, కుజుల దుస్థానయుతి శుభము. రవి, చంద్రులు కేంద్ర కోణములందుండుట మంచిదైనను మేష మందు ఫలింపదు. రవి, శుక్రులు దుస్థానములందు కలసిన రవి యోగించును. రవి, శనులు లాభమందుండుట శుభము. చంద్రుడు కేంద్ర కోణములందు సామాన్య యోగ మిచ్చును. నీచ చంద్రు డధిక ఫలమిచ్చుట ఈ లగ్నమునకు విశేషము. చంద్ర, కుజులు; చంద్ర, బుధ, గురులు కేంద్ర కోణములం దున్న చంద్రుడు యోగించును. చంద్ర, శనులు కేంద్రములం దుండుట మంచిది. కుజుడు 3, 6, 8 లందు అధిక యోగ మిచ్చుచున్నాడు. కుజ, శుక్రులు 3, 6, 8, 11 లందున్న కుజునకు శుభము. కుజ రాహులు భాగ్యమందున్న రాహుదశ ప్రబలయోగమిచ్చును. బుధుడు దుస్థానములందు శుభుడు. శనియుత దుస్థాన స్థితి శని దశా కాలమున అధిక రాజ యోగ మిచ్చును. బుధ, శనులు లగ్నమందుండుట మంచిదే కాని శని, గురుల స్థితికి సమానముగాదు. గురుని కూడ బుధుని వలెనే చూడవలెను. గురుడు 6 నందు అధిక రాజ యోగ మిచ్చును. 12 నందు కొంచెము తక్కువ. శుక్రుడు కేంద్రమందుండుట మంచిది. గురు, బుధులతోగాని, రవి, కుజులతో గాని, కలసినపుడు శుక్రుడు కేంద్ర కోణములందు యోగపురుషుడు. కేంద్ర కోణములందున్న శని శుభుడు. శని శుక్రులు గాని, చంద్ర శుక్రులు గాని కేంద్రములందుండుట శుభము. శని, రవులు లాభమందున్న మంచిది. శని, గురుల యుతి యోగకారణము. ఉచ్చ శని ప్రబలయోగ మిచ్చు చున్నాడు. దుస్థానాధిపతులతో కలసిన కుజుడు కేంద్రము లందు రాజయోగ మిచ్చుచున్నాడు. రాహు, కేతులు కేంద్ర కోణములందు శుభులు. దుస్థానములందు యోగకారకులు. కుజ, శనులతో కేంద్ర కోణములందు కలియుట మంచిది. ఉచ్చ గురుడు ప్రబల రాజయోగ కారకుడు.

**మకరము :**—రవి కేంద్ర కోణములందు, వ్యయమందు శుభుడు. రవి, బుధులు కలియుట కంటె విడిగా నుండుట మంచిది. రవి, శుక్రులు కేంద్రములందున్న రవి యోగిం చును. రవి, బుధ, గురులు కేంద్రములం దుండుట మంచిది. వీరు దుస్థానములందున్న విపరీత రాజయోగ ప్రాప్తి. రవి, కుజ, బుధులు కేంద్ర కోణములందు యోగింతురు. పూర్ణ చంద్రుడు దుస్థానములందు, క్షీణ చంద్రుడు 2, 3, 11 లందు యోగ కారకులు. చంద్ర, గురులు కాని, చంద్ర, బుధ గురులు కాని 1, 4, 5, 9, 10 లందున్న యోగము. చంద్ర, గురులు 1, 4, 10 లందుండుట విశేషము. చంద్ర, కుజ, బుధులు లగ్నము తప్ప ఇతర కేంద్రములందు యోగింతురు. చంద్ర, రాహుల కలియక శుభము. కుజుడు కేంద్ర కోణ ములం దుండుట యోగము. ద్వితీయమందు ధనప్రాప్తి. కుజ బుధులు, రవి, గురుల సంబంధములేక లగ్నము తప్ప ఇతర కేంద్ర కోణములందు యోగింతురు. కుజ, రాహులు లేక కుజ, శుక్ర రాహులు అష్టమమందున్న అధిక ఫలము. కుజ, శనులు కేంద్ర కోణములందు యోగింతురు. కుజ, గురులు లగ్నమందు తప్ప ఇతర కేంద్రములందు శుభులు. గురుడు మాత్రము లగ్నమందున్న శుభము. గురు, శనులు కేంద్రములం దుండుట శుభము. గురు, బుధులు రవి సంబంధములేక కేంద్ర కోణములందు యోగింతురు. గురుడు సప్తమమందుండి కుజ దృష్టి నొందిన యోగించును. గురు, శుక్రులు తుల యందు తప్ప ఇతర కేంద్రములయం దుండుట మంచిది. శుక్రుడు 3, 5, 6, 8, 12 లందు యోగించును. అందు అష్టమ మందు విశేష యోగము. వీనికి ఈ స్థానములందు కుజ, శనుల సంబంధము యోగమును తగ్గింపదు. శని కేంద్ర కోణము లందు యోగించును. ద్వితీయ శని ధనమిచ్చును. శని, బుధులు 1, 2, 9, 10 లందున్న రాజయోగము. కుజ, శనులు ద్వితీయ లాభములందున్న ధనప్రాప్తి. శని భాగ్య మందు శుభుడు. ఇచట బుధ సంబంధము విశేష యోగ

కారణము. శని, బుధులు 1, 2, 4, 5, 7 లందుండుట విశేషము. ఉచ్చ శని అత్యంత శుభుడు. రాహు కేతులు కేంద్ర కోణములందు యోగకారకులు. వీరలకు కుజ, శనుల సంబంధము ఈ స్థానములం దత్యంత శుభము. రాహువు అష్టమమందు విశేష యోగమిచ్చును. బుధ, కేతులు కేంద్ర కోణములందున్న శుభము.

**కుంభము** :—రవి, కుజ, శనులు శుభ సంబంధము లేక కేంద్ర కోణములందు స్వతంత్రించియుండుట విశేష యోగము. రవి, బుధులు పంచమమందుండుట విశేషము. చంద్రుడు కేంద్రములందుండుట మంచిది. కేంద్ర కోణము లందు గురు, శుక్రులతో కలసిన శుభము. చంద్రుడు, రవి లేక కుజ లేక శనులతో గలసి కేంద్ర కోణములందుండుట అధిక రాజయోగప్రాప్తి. రాహు, కేతులతో కలసి కేంద్రములం దున్నను శుభ మొసగుచున్నాడు. కేంద్రములందు చంద్రునితో కలియని రవి, కుజ, శను లధికయోగ మిత్తురు. కుజుడు కేంద్రములందుండుట అత్యంత రాజయోగము. కోణములందు తక్కువ. కుజ, రవులు గాని, కుజ, శనులు గాని కేంద్ర కోణములందు గలసిన రాజయోగప్రాప్తి. కుజ శుక్రులు భాగ్య రాజ్యములందున్నను, పరివర్తన నొందినను కేంద్రాధిపతులతో గలసినను పంచమాధిపతితో గలసినను కేంద్ర కోణములందున్నను అధిక రాజయోగము. బుధ, గురులు కేంద్ర, కోణాధిపతులతో గలిసి కేంద్ర కోణములం దున్న మంచిది. గురుడు, రవి, కుజ, శనులతో గలసి కేంద్ర కోణములందున్న శుభుడు. మీన గురుడు ధన మిచ్చును. భాగ్య మందు శుక్ర యుతి శుభము. శుక్రుడు దుస్థానములందున్న యోగము. భాగ్యమందున్న ధన రాజయోగములు గలుగును. బుధ, చంద్రులతో గలసి కేంద్రములందుండుట మంచిది. శని ద్వితీయ ద్వాదశములందు యోగించును. 1, 7, 10 కేంద్రములందు భాగ్యమందు పూర్ణయోగ మిచ్చును. రాహు, కేతువులు రవి, కుజ, శనులతో గలియుట శుభము, దుస్థానము లందు వారు యోగింతురు. గురు కేతులు కేంద్ర కోణములందు యోగ మిచ్చుచున్నారు.

**మీనము** :—రవి సప్తమము తప్ప ఇతర కేంద్రము లందు శుభుడు. రవి, బుధులు షష్ఠాష్టమములందుండుట మంచి యోగము. కేంద్రములందు కుజునితోగాని, శనితో గాని కలసిన రవి యోగించును. శని, చంద్రులు గలసి కేంద్ర కోణములందుండుట మంచిది. కుజుడు దుస్థానములందుండుట మంచిది. ద్వితీయమందు ధనయోగము. కుజ, శనులు ద్వితీయ లాభములందున్న యోగము. బుధ, గురులు పంచమమందుండుట మంచిది. దుస్థానములందు యోగ మిచ్చుచున్నారు. వీరు కేంద్రములందు దుస్థానాధిపతులతో గలసిన కొంత రాజ యోగము ప్రాప్తించును. గురు, శనులు కేంద్రములందున్న సామాన్య యోగము. శుక్రుడు అష్టమమందుండుట యోగము. ఇచట శనితో గలసిన విశేషాధియోగము. శని కేంద్రకోణములందుండుట శుభము. గురునితోగాని, బుధునితో గాని గలసి శని కేంద్ర కోణములందున్న యోగించును. రవి శుక్రులతో సంబంధములేని శని యోగకారకుడు. కేంద్ర కోణములందు రాహు, కేతులు, కుజ, శనుల సంబంధముచే రాజయోగ మిచ్చుచున్నారు. వీరు దుస్థానములందున్నను శుభము నిత్తురు.

మహారాజయోగముల విధాన మెఱుంగుటకు పరిశోధింప బడిన నూరు జాతకముల వివరములు :

మేషము—7, వృషభము—4, మిథునము—5, కర్కాటకము—14, సింహము—6, కన్య—5, తుల—17, వృశ్చికము—8, ధనస్సు—14, మకరము—6, కుంభము—10, మీనము—5,

0 మేషము—7. ఈ లగ్నమునకు రవి, కుజ, గురు, శనులు శుభులు.

| | కుజ | శని | రవి | గురు. |
|---|---|---|---|---|
| దశమ భావ సంబంధ గ్రహములు— | 4 | 4 | 2 | 1 |

| | కుజ + గురు | రవి + శని | గురు + శని | రవి + కుజ |
|---|---|---|---|---|
| | 4 | 3 | 2 | 3 |

| | మాలవ్య | శశ | మాలవ్య + శశ |
|---|---|---|---|
| పంచమహాపురుషయోగజాతకులు | 1 | 3 | 1 |

| | 2 గ్రహములు, | 1 గ్రహము. |
|---|---|---|
| ఉచ్చ— | 2 | 1 |
| నీచ— | 1 | 4 |
| స్వక్షేత్ర— | 1 | 5 |

0 వృషభము—4. రవి, బుధ, శుక్ర, శనులు శుభులు.

దశమభావ సంబంధ గ్రహములు

| రవి | శుక్రుడు | కుజుడు (3,6,10లకు) |
|---|---|---|
| 1 | 2 | 3 |

| | 2 గ్రహములు. | 1 గ్రహము. |
|---|---|---|
| ఉచ్చ— | 1 | 2 |
| నీచ— | — | 2 |
| స్వక్షేత్ర— | 1 | 1 |

0 మిథునము—5. శుక్ర, శనులు శుభులు.

దశమభావ సంబంధ గ్రహములు

| శని | కుజుడు | (3,6,10 శుక్రుడుంకు) |
|---|---|---|
| 3 | 1 | 4 |

,, శని + శుక్ర=1

# మహారాజ యోగములు

| | 3 గ్రహములు | 2 గ్రహములు | 1 గ్రహము |
|---|---|---|---|
| ఉచ్చ— | 1 | — | — |
| నీచ— | — | — | 4 |
| స్వక్షేత్ర— | — | 2 | 1 |

పంచ మహా పురుషయోగ జాతకులు. హంస 1, భద్ర 1.

0. కర్కాటము—14. కుజ, గురులు శుభులు.

దశమభావ సంబంధ గ్రహములు

| కుజ | గురు | కుజ+గురు | కుజుడు (3,6లకు) |
|---|---|---|---|
| 5 | 1 | 2 | 5 |

నవమభావ సంబంధ గ్రహములు—గురు—6.

ఇతర భావములకు కుజ, గురుల సంబంధము—7.

| | 3 గ్రహములు | 2 గ్రహములు | 1 గ్రహము |
|---|---|---|---|
| ఉచ్చ— | — | 1 | 1 |
| నీచ— | — | 1 | — |
| స్వక్షేత్ర— | 1 | 2 | 1 |

పంచమహా పురుషయోగ జాతకులు— మాలవ్య—2; హంస—2; రుచక—2; శశ—2, మాలవ్య + హంస 1; రుచక—శశ—1.

0. సింహము—6. రవి, కుజ, గురులు శుభులు.

దశమభావ సంబంధ గ్రహములు

| రవి | గురు | కుజ | రవి+గురు | కుజ (3,6లకు) |
|---|---|---|---|---|
| 1 | 2 | 1 | 2 | 3 |

రవి, కుజ, గురుల సంబంధము—4.

| | 1 గ్రహము. |
|---|---|
| ఉచ్చ— | 1 |
| నీచ— | 2 |
| స్వక్షేత్ర— | 2 |

పంచమహా పురుషయోగ జాతకులు— రుచక—1; మాలవ్య—1.

0. కన్య—5. శుక్ర, శనులు శుభులు.

| | శుక్ర | కుజ | కుజ(3, 6లకు) |
|---|---|---|---|
| దశమభావ సంబంధ గ్రహములు | 1 | 1 | 3 |

| | 1 గ్రహము | 2 గ్రహములు | 3 గ్రహములు |
|---|---|---|---|
| ఉచ్చ— | 2 | 1 | — |
| నీచ— | 2 | 1 | — |
| స్వక్షేత్ర— | — | 1 | 1 |

పంచమహా పురుషయోగ జాతకములు—భద్ర—1, హంస—1, మాలవ్య—1.

0. తుల—17. కుజ, బుధ, శనులు శుభులు.

| | కుజ | బుధ | శని | కుజ (3,6 లకు) |
|---|---|---|---|---|
| దశమభావ సంబంధ గ్రహములు | 7 | 6 | 7 | 12 |

| | 1 గ్రహము | 2 గ్రహములు | 3 గ్రహములు |
|---|---|---|---|
| ఉచ్చ— | 2 | 2 | 1 |
| నీచ— | 3 | — | — |
| స్వక్షేత్ర— | 8 | 4 | 1 |

పంచమహా పురుషయోగ జాతకులు— మాలవ్య—4; రుచక—5; శశ—4; హంస—3; శశ+రుచక—2; రుచక+మాలవ్య+హంస—1.

0. వృశ్చికము— 8. రవి, చంద్ర, గురు, శనులు శుభులు.

దశమభావ సంబంధగ్రహములు—

| రవి | చంద్ర | గురు | శని | కుజ | కుజ(3,6లకు) |
|---|---|---|---|---|---|
| 2 | 3 | 1 | 4 | 3 | 3 |

శని చంద్ర సంబంధము—4, బుధ ఉపచయ స్థితి—7, గురు రాహు సంబంధము—6.

| | 1 గ్రహము | 2 గ్రహములు. |
|---|---|---|
| ఉచ్చ— | 2 | — |
| నీచ— | 4 | — |
| స్వక్షేత్ర— | 2 | 1 |

పంచమహా పురుషయోగము జాతకులు—శశ—1.

0. ధనస్సు—14. రవి కుజులు శుభులు.

| | రవి | కుజ | కుజ (3, 6 లకు) |
|---|---|---|---|
| దశమభావ సంబంధ గ్రహములు | 3 | 3 | 11 |

గురు దుస్థాన స్థితి—8.

| | 1 గ్రహము | 2 గ్రహములు | 3 గ్రహములు |
|---|---|---|---|
| ఉచ్చ— | 4 | 4 | 1 |
| నీచ— | 2 | 1 | — |
| స్వక్షేత్ర— | 2 | 2 | 1 |

పంచమహాపురుష యోగ జాతకులు - హంస - 3; భద్ర-1. చంద్ర అష్టమ స్థితి—3; గురు దుస్థాన స్థితి—7; శని ఉపచయస్థితి—6, రాహు కేంద్ర స్థితి—4.

0. మకరము—6. కుజ, బుధ, శుక్రులు శుభులు.

దశమభావ సంబంధగ్రహములు

| కుజ | శని | కేతు | కుజ(3, 6లకు) |
|---|---|---|---|
| 3 | 4 | 3 | 3 |

| | 1 గ్రహము | 2 గ్రహములు. |
|---|---|---|
| ఉచ్చ— | 3 | 1 |
| నీచ— | 3 | — |
| స్వక్షేత్ర— | 2 | 1 |

పంచమహాపురుష యోగ జాతకులు—రుచక—3; శశ—1; శశ+రుచక—1.

0. కుంభము—10. రవి, కుజ, బుధ, శుక్రులు శుభులు.

దశమభావ సంబంధగ్రహములు.

| రవి | కుజ | శుక్ర | శని | కుజ(3,6లకు) |
|---|---|---|---|---|
| 2 | 1 | 4 | 5 | 5 |

శని శుక్ర సంబంధము—4.

| | 1 గ్రహము | 2 గ్రహములు. |
|---|---|---|
| ఉచ్చ— | 6 | — |
| నీచ— | 4 | 2 |
| స్వక్షేత్ర— | 4 | — |

పంచమహా పురుష యోగ జాతకులు—శశ—1.

12. మీనము—5. చంద్ర, కుజాలు శుభులు.

దశమభావ సంబంధగ్రహములు.

| కుజ | శని | కుజ (3, 6 లకు) | రవి, బుధ సంబంధము |
|---|---|---|---|
| 2 | 3 | 4 | 1, 7 లందు. |

3

| | 1 గ్రహము | 3 గ్రహములు. |
|---|---|---|
| ఉచ్చ— | 1 | 1 |
| నీచ— | 3 | — |
| స్వక్షేత్ర— | 1 | 1 |

పంచమహా పురుషయోగ జాతకులు—భద్ర—2.

**సారాంశములు:** నూరు జాతకములందు తుల, కర్కాట ధనస్సులు, కుంభము, వృశ్చికము, మేషము, మకరము, సింహము, కన్య, మీనము, వృషభము క్రమముగా మహారాజయోగ ప్రాప్తికి బలిష్ఠములగు లగ్నములైనవి. వీనిలో మొదటి 5 లగ్నముల వివరములు.

| | ఉచ్చ | | | నీచ | స్వక్షేత్ర |
|---|---|---|---|---|---|
| | 1 గ్రహము | 2 గ్రహములు | 3 గ్రహాలు | 1-2-3 | 1-2-3 |
| తుల | 2 | 2 | 1 | 3 - - | 8 4 1 |
| కర్కాటము | 1 | 1 | — | – 1 – | 1 2 1 |
| ధనస్సు | 4 | 4 | 1 | 2 1 – | 2 2 1 |
| కుంభము | 6 | — | — | 4 2 – | 4 - - |
| వృశ్చికము | 2 | — | — | 4 - – | 2 1 - |

తులయందు స్వక్షేత్ర గ్రహములు, ఉచ్చ గ్రహములు, నీచులు క్రమముగా యోగకారకులు.

కర్కాటమందు స్వక్షేత్ర గ్రహములు, ఉచ్చ గ్రహములు, నీచులు క్రమముగా యోగకారకులు.

ధనస్సునందు ఉచ్చ గ్రహములు, స్వక్షేత్ర గ్రహములు, నీచులు క్రమముగా యోగకారకులు.

కుంభమందు ఉచ్చ, నీచ గ్రహములు సమానములు. స్వక్షేత్ర గ్రహములు తక్కువ.

వృశ్చికమందు నీచులు, స్వక్షేత్ర గ్రహములు, ఉచ్చ గ్రహములు క్రమముగా యోగింతురు.

స్వక్షేత్ర, ఉచ్చగ్రహముల ప్రభావము మహా రాజయోగ ప్రాప్తికి ఎక్కువగా కన్పించుచున్నది.

పంచమహా పురుషయోగ జాతకుల క్రమము :—

| | మాలవ్య | రుచక | శశ | హంస | భద్ర | రెండు యోగములు | మూడు యోగముల |
|---|---|---|---|---|---|---|---|
| తుల | 4 | 5 | 4 | 3 | — | 3 | 1 |
| కర్కాటము | 2 | 2 | 2 | 2 | — | 2 | — |
| ధనస్సు | — | — | — | 3 | 1 | — | — |
| కుంభము | — | — | 1 | — | — | — | — |
| వృశ్చికము | — | — | 1 | — | — | — | — |

హంస, శశ, రుచక, మాలవ్య యోగములు క్రమముగా మహారాజయోగ ప్రాప్తి నొసగుచున్నవి.

దశమభావ సంబంధ గ్రహములు :

| | కుజ | బుధ | శని | గురు | రవి | శుక్ర | చంద్ర | కుజ+గురు |
|---|---|---|---|---|---|---|---|---|
| తుల | 7 | 6 | 7 | — | — | — | — | — |
| కర్కాటము | 5 | — | — | 1 | — | — | — | 2 |
| ధనస్సు | 3 | — | — | — | 3 | — | — | — |
| కుంభము | 1 | — | 5 | — | 2 | 4 | — | — |
| వృశ్చికము | 3 | — | 4 | 1 | 2 | — | 3 | — |
| | 19 | 6 | 16 | 2 | 7 | 4 | 3 | 2 |

కుజ, శనుల దశమ భావ సంబంధము క్రమముగా యోగ దాయకమైనది.

3, 6 లకు కుజ సంబంధము :
1. తుల 12
2. కర్కాటము 5
3. ధనస్సు 11
4. కుంభము 5
5. వృశ్చికము 3

3, 6 10 లకు కుజ సంబంధము మహారాజయోగ ప్రాప్తికి హేతువగుట విశదము.

తులకు స్వక్షేత్ర గ్రహములు, రుచక, మాలవ్య, శశ యోగములు, 3, 6, 10 లకు గల కుజ సంబంధము ముఖ్యముగా కన్పించుచున్నవి.

కర్కాటము—స్వక్షేత్ర గ్రహములు, మాలవ్య, రుచక, శశ హంసయోగములు, 3, 6, 10 లకు గల కుజ సంబంధము ప్రధానము.

ధనస్సు—ఉచ్చ గ్రహములు, హంసయోగము, రవి, కుజాల దశమభావ సంబంధము, 3, 6, 10 లకు గల కుజ సంబంధము ప్రధానము.

కుంభము—ఉచ్చ, నీచ గ్రహములు సమాన బలము గలవి. శశయోగము, దశమ భావ శని, శుక్ర సంబంధము, 3, 6 10 లకు కుజ సంబంధము ముఖ్యమైనవి.

వృశ్చికము—నీచ, స్వక్షేత్ర గ్రహములు, శశయోగము, దశమ భావ శని, కుజ, చంద్రుల సంబంధము, 3, 6, 10 లకు కుజ సంబంధము ప్రాధాన్యత గలవిగా నున్నవి.

ఇతర రాసులకు గూడ 3, 6 10 లకు కుజ సంబంధము ప్రాధాన్యముగా కన్పించుచున్నది. మేషమునకు శశయోగము, మకరమునకు రుచకయోగము, మీనమునకు భద్రయోగము ప్రాధాన్యత వహించినవి. ధనస్సునకు గురుస్థాన స్థితి, శని ఉపచయ స్థితి శుభప్రదములైనవి.

పైన వివరింపబడిన పరిశోధనా ఫలములు పాఠకుల కుపకరింపగలవని నమ్ముచున్నాను.

ఈ లగ్నముల నవాంశ, దశాంశ, త్రిశాంశ స్థితులు పరిశీలించిన అనేక శాస్త్ర రహస్యముల నెరుగవచ్చును.

# చెడగొట్టు వాన

శ్రీ మహమ్మద్ అలీ

వేరాటలు గొట్టి యేతములు బోసి పొలాలు హలాల దున్ని ఆ
రాటము మీర రైతులు విరామ మెఱుంగక చెమ్మ టోడ్చి పెన్
పాటులు చెంది పైరు కనుపాపల మాదిరి కాచుచుండ ఆ
ర్భాటము చేతువే కనులు మండినవా చెడగొట్టు మేఘమా!

ఒక్కటి కాదు నాల్గు నెల లొక్కటిగా తనడొక్క వీపుకున్
జిక్కగ ఆలు పిల్లలు కృశించగ బక్కలు బక్కచిక్క తా
రెక్కలనుగ్గు చేసికొనె, రేపాకనాడు గతించి నంతనే
బుక్కకు వచ్చు పంట పయిపోతువె ఊరక రాలు రప్పలన్.

ఇపుడే కాచెను మండుటెండ ఇపుడే ఈ రీతి మబ్బెక్కి ప
ట్టపగల్ దట్టుగ పోతరించి కడుదట్టంబై నభమ్మంత నిం
డి పయోదమ్ములు పళ్ళు నూరియట క్రీడించెన్ దిగంతమ్ములన్
అపుడే గుండెలు కూరిపోవహాలికుండల్లే విలోకించగన్.

కలియో గంజియొ త్రాగి కష్టపడ ఈ కాలానకు న్నాల్గుగిం
జలు రావా తినడాని కింటికని ఆశాపూరితుండై కృషీ
వలు డాశించు నటంచు నీ వెరిగియున్ వర్షింతువే రాలు ర
ప్పలు ఘోరంబుగ జాలిమాలిన శిలాభావంపు చైత్రాబ్దమా!

పేరున కెంచగా ఘనుడవే ఘనకార్యము చేయకిట్లు ని
ష్కారణ మోర్వలేక పరసంపద నాశముచేయు కార్యమే
తీరున గొప్పదౌను, తెక తేరకు కావర మెక్కి నిక్కి ఈ
తీరున గొప్పవార లొక తృష్ణకు లోబడి చేయుచుందురున్.

జాలిమనస్సు వాడవని చల్లని చూపుల మూర్తివంచు వే
నోళుల సన్నుతింతురు నినున్, దయపీడి పరాయిపంట ర
త్నాలను గంగసాల్ సలుపుతావన నీ యెద చెమ్మలేని చ
ట్రాలను పోలియుండు ననటానికి నోరెటురాదు చెప్పుమా!

మిడికి పరాయి పంటపయి మంటికి నెక్కి నిమేషకాలమున్
గడగడ లాచరించి త్రుటికాలము తాళక జాలిమాలి యె
క్కడ వడగండ్లొ రాల్చి కడగండ్లకు దారులుతీతు వీవు నీ
దుడుకుతనమ్ము నీరయి యధోగతి పాలయిపోదె మేఘమా!

కొందఱు బంతిగట్టి తమ గోదలదల్చుచు కళ్ళమందు ఆ
నందముగా కుటుంబ సహితంబుగ నుండిరి, పైరు కోయుచున్
కొందఱు మళ్ల నుండి రొక కొందఱు ధాన్యము బండ్ల కెత్తి పో
వందల పోయుచుండి రిటువంటి నిమేషము నీకు దక్కునా!

పూనికతో కృషికావళి
తా నిహరించెను పొలాలతలములవద్దన్
ఈ నడిరాతిరి కోపము
పూనితివో వారిగుండె పొగియుం దెగయున్.



# కవిత్వానికి అలంకారమూ ఛందస్సూ ఉండి తీరాలా?

శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

చిరకాలంగా కవిత్వానికి అలంకార సంపదను సమకూర్చి పెట్టుతున్నారు కవులు. ఆ అలంకారములను గుర్తించి మెచ్చుకుంటున్నారు చదువరులు. ఛందస్సులాగే అలంకారము కవిత్వానికి ఉండి తీరాలనే నమ్మకము చాలా చాలా మందికి ఉన్నది. ఇంకా మాట్లాడితే "కవిత్వానికి ఛందస్సు లేకపోతే మానె, దాన్ని గద్య కవిత్వ మంటాము, కాని అలంకారము లేకపోతే ఎలాగా ?" అనే వారు చాలా మంది ఉంటారు. ఆలంకారికులు— ముమ్మటాచార్యులు ఒకరని జ్ఞాపకము— అలంకారములేనిదే కవిత్వమే లేదని వాదించిన వారూ ఉన్నారు.

'అలంకారము కవిత్వానికి అందము సమకూరుస్తుంది' అని వాదిస్తే అది పూర్తి సత్యము కాదు. అది బంధమూ సంకెలా కూడా కాగల'దని చేరిస్తేనే పూర్తి సత్య మవుతుంది. 'అలంకారము' అంటేనే "అది పై నించి తెచ్చి పెట్టినట్టిది" అని స్ఫురిస్తుంది. మరి బాగూ భ్రష్టూ రెండూ కాక బాగొకటే ఎలాగ ఉండగలదూ ? ఈ ఊహ కొత్తదేమీ కాదు. ఉపమాలంకారము వంటి సరళాతి సరళాలంకారము పట్లనే 'నీచోపమ' ప్రవేశించ గలదని ఆలంకారికులు గుర్తించి చెప్పినారు. అయితే అన్ని అలంకారాలకూ ఉచ్చ—, నీచ—,ములను వివరించినారు కారు; 'గ్రంథ విస్తరభీతి'తోనని నే నంటాను.

అయితే ఇక్కడ నా పని అలంకార శాస్త్ర విమర్శన కాదు. ఆ శాస్త్రము వదలిపెట్టిన పై వస్తువును ఇంచుకంత స్పృశిస్తూ అది అలంకారముల గౌరవానికి కాక వాటి అపకీర్తికే దోహదమైనదని సూచించడమే. అదిన్నీ ఎందుకనీ ? అలంకారాల గలగలలూ, బరువూ, కవిత్వపు నిసర్గ సౌందర్యానికి అక్కరలేని ఆటంకాలని సూచించడానికి. రవీంద్రుడన్నాడు ఒక చోట. "నా గీతము అలంకారాలన్నిటినీ తీసి పెట్టేసింది, వాటి గలగలలు నీ గుసగుసల్ని వినవడ నియ్యవు" అని. ఈ నిజము పరిశీలించండంటున్నాను.

మన సంప్రదాయములో 'వాద బలము' 'వాది బలము' అని రెండు పురాతన గజకచ్ఛపాలున్నాయి. ఆ రెండింటిలో ఏది మిన్న ? అన్న ప్రశ్నకు తర తరాలలో వచ్చిన మేధావులు ఆచరణ పూర్వకంగా అటూ ఇటూ సమాధానా లిచ్చారు. అయితే జరిగిన వైషమ్య మేమిటంటే, వర్తమాన మవుతున్న వాదానికి అనుకూలంగా నిలిచి సాక్ష్యాన్ని విశ్లేషించి, దాన్ని ఊపి, పుట్టుకీట్లు కదల్చి ఆ వాదాన్ని మార్చిన మేధావుల దారిలో ప్రతీ ఒక్కరూ పడి పిడి వాదము చేయడము. వీరు సాక్ష్యాన్ని బట్టి తమ తీర్మానాలు ఏర్పరుచుకోరు. తీర్మానము ముందు చేసేసుకుంటారూ తరవాత తమకు అడ్డువచ్చిన సాక్ష్యాన్ని కాదనడమో, మడత పెట్టడమో ప్రారంభిస్తారు. "అలంకారము లేని కవిత్వమే ఉండదు" అని వాదించిన ఆలంకారికులు ఆ బృందములోని వారంటాను నేను. అలంకారము లేని నిసర్గ రస శోభితమైన రచనను పట్టి, కిందా మీదా పెట్టి, "అదిగో ఆ మూల నుంచి అలంకారము తొంగి చూస్తూనే ఉంది" అంటూ రాద్ధాంతము చేస్తారు వారు. వాద ప్రతి వాదాలు సాక్ష్యము మీద ఆధార పడాలి కాని ఏదో విధంగా ప్రతికూల సాక్ష్యానికి కాళ్ళు కొట్టేద్దామన్న యత్నము మీద నాధారపడరాదు. ఉభయ భారతీదేవి ఆచార్య శంకరులను ఎన్నాళ్ళు తప్పించుకో గలిగిందీ ?

నే నిప్పుడు చెప్పబోయేది, "కవిత్వానికి అలంకార రచన అత్యవసరము కానే కాదు" అని. ఛందస్సు అత్యవసరము కాదు, అలాగే అలంకారమూను. "ఛందస్సూ అలంకారమూ ఉన్న రచనలు భ్రష్టములా" అని అడుగుతారేమో ? నేనా మాట అనలేదు, అనబోను. "ఛందస్సూ అలంకారమూ లేక పోయిన మాత్రాన రసౌభ్యుచిత రచన కవిత్వము కాదనడము కురుచి అని అంటున్నాను. అవి కవిత్వానికి ఉండి తీరాలనడము సంకుచిత రుచిని తెలుపుతుంది కాని సత్యాన్ని తెలపదంటున్నాను. ఈ వచన పద్యం చదవండి :

## పీటకి నకళ్లు

దీపంలాంటి గ్రామంలో
దేదీప్య మానంగా వెలుగుతున్న కిరణాలు
వాళ్ళ రైతులు
భూమ్యాకాశాలు ఆ లోక రమ్యాలు
ఎప్పటి నుంచో ఉదయించుతున్న చంద్రుడు
పిండి ఆరబోసినట్టు వెన్నెల
ఆ పొట్ల తీగె మీద, ఆ అరటియాకు మీద
ఆ గ్రామీణ బాలిక లేత చెక్కిళ్ల మీద
పంచినా పంచ బడని వెన్నెల్ను
పంచబోకు పట్నీ కరెంటు కాంతిలో కలుపబోకు
నాగరికుడా ! ప్రత్తిని పిండి-బండికెత్తావు
ప్రత్తి మొక్క నీ వెంట రాదు సుమా
వద్దు ! వద్దు ! ! ఆ రాట్నం, ఆ కదురు,
ఆ ముసలమ్మను కదిలించబోకు
ఆ పల్లె నేటిది కాదు.
పిట్టకు గూడు, చెట్టుకు నీరు
గూటి నుండి పిట్టను తోలకు
పల్లె నుండి రైతును పిలువకు
గూట పిట్ట పాడుగుతుంది
మేడకు అది బెదురుతుంది
కాటుక పిట్టలు త్రాగే తేనెలు
నీ గానుగలో దొరకవు
గోధుమ కంకులు రాలే నేలలు
నీ హద్దుల్లో ఒదుగవు
ఆ రద్దీ ఆబాదర ఒందీ
ఏదో కక్కుర్తికి చేసిన పెండ్లికి
కట్టిన తోరణ పాకుల్లా మందిని
గ్రుచ్చినావు నగరంలో ఒకే దారంతో
వానుకి భూమిని మోస్తున్నది
జాతిని పల్లెలు మోస్తున్నవి,
పల్లె దొసగు పల్లే తీర్చును
పిల్లని ఏడ్పును తల్లే మాన్పును
అతని ఏడ్పు ఢిల్లీ తీర్చుకు
అయ్యో నడాన నవ్వై పోవును
దేశంలో నాలుగు మూలల
పూచిన పువ్వుల్లా పల్లెలు
పల్లెల్లో పెరిగిన మొక్కకు
నగరంలో పాదులు పెట్టకు
అదిగో వస్తున్నది సభ్యత్వపుముంపు
ఆ రైతు ఈ నాగరి ఏమై పోవును
నాగార్జున సాగరాన
కొండ మీది మ్యూజియంలో
పీటకి నకళ్ళు తీసి ఉంచుము.

దీనిలో అలంకారాలు లేవని అనబోవడము లేదు నేను. అలంకారాలు తీసి అవతల పెట్టినా, నరాలను ఝల్లు మనిపిస్తోందంటాను. కవిగారు ( ) అలంకారము వాడకుండా వ్రాసేయత్నం చేస్తే అనిబద్ధకవనానికి ఇది ఇంకా చక్కని ఉదాహరణ అయి ఉండును. కవిత్వానికి చైతన్యము రసము. చైతన్యము మన చైతన్యాన్ని ఝల్లు మనిపిస్తుంది, దానికి ఫలితము ఆర్ద్రతా ఆనందమూను. ఛందస్సూ అలంకారమూ రసౌభ్యుచిత రచనకు విజాతీయములు, అదనపు చేర్పులు.

నన్నయగారి ఉదంకుని నాగస్తవమూ, కద్రువ ప్రార్థనా, దేవయాని వేడికోలూ వంటి చోట్ల అలంకారాలుండవు. పెద్దనగారి అగ్నిస్తవము, చెలికత్తెల ఊరడింపులలో అలంకారాలుండవు. తిక్కనగారు రసౌభ్యుచిత బంధాలలో అలంకారాలు వాడరు. భావము తీవ్రమైనచోట అలంకారము పూర్తిగా పల్చబడి పోతుంది. నాచన సోమనాథుని 'ఊర్వశీ నరక సంవాదము'లో అలంకారము సామెతగా కుంచించుకుంది. శ్రీనాథుని దమయంతీ నలసంవాదము, పెద్దన వరూథినీ ప్రవర సంవాదమూ, ఎన్నైనా ఉదాహరణ లివ్వవచ్చును, నిరలంకార నిసర్గ కవిత్వ శోభకు. మరి అలంకారముండి తీరాలనడము ఏమన్న మాట ? ఇవన్నీ ఛందో రచనలు కావా అంటారేమో, ముందుగా అలంకారము కవిత్వానికి తప్పనిసరి కాదు అని నిరూపించడమే నా ఆశయము, ఛందస్సుకు రెండో భాగంలో వస్తాను.

ఆధునికుల రచనలలో గురజాడ కథా గేయాలూ, బసవరాజు గోపికా విరహమూ (ఒంటిగా ఉయ్యాల), కవు కొండల

# అలంకారమూ ఛందస్సూ ఉండి తీరాలా?

'రాళ్ల పడవ', శివ శంకరుల విభ్రమము, వీరశైవుడు, స్పర్శ; వేదుల ఆశా గానమూ, కృష్ణశాస్త్రి 'దారులన్నియు మాపె' 'అవధరింతువు' 'వేయ బోవని తలుపు' నిరలంకార రచనలే. ఎంకి పాటలలో 'యెనక జల్మము' 'ఇంతేనటే సంద్రము' 'ఆట పాటలలోన' 'ఆరిపేయవే'.... చాలాచాలా ఉన్నాయి నిరలంకార రచనలు, రసమయ రచనలు. రవీంద్రుని రచనలు చాలా మట్టుకు నిరలంకార—, అనిబద్ధ—, రచనలే (ఇంగ్లీషు వచ్చి ప్రపంచ ప్రసిద్ధి గన్న రచనలు గీతములు కావుగదా !) వర్డ్స్‌వర్తు ఖండకావ్యాలు, ',We are seven, Alice Fell, Lucy Gray'' వంటివి నిరలంకార రచనలే. రామలింగారెడ్డిగారు కవిత్వ తత్త్వ విచారములో అలంకారాలు భావావేశానికి —నదీ ప్రవాహానికి బండలు లాగ— ఎలాగ అడ్డు అవుతున్నాయో నిరూపించారు, ఆ దృష్టితో ఒక మారు పరిశీలించడంటున్నాను.

కవిత్వానికి ప్రయోజనము, చదువరికి అనుభవమూ తద్వారా ఆనందమూ కలగడము. అలంకారపు గురి మనస్సుకి, హృదయానికి కాదు. పోతన గారి సరోవర వర్ణన వినండి : ''వైకుంఠ పురంబునుం బోలి శంఖ చక్ర కమలాలంకృతంబై, భాగ్యవంతుని భాగధేయంబునుంబోలి గురుమకర కులీర మీన మిధునం బై'' ఇక్కడ పోలిక మాటలకే, మాటల అర్థానికి కాదు. పెద్దనగారి ''మరున కొసంగ కాలము. . . .'' కూడా చంద్రోదయ సౌందర్యాన్ని మన కనుభవము చెయ్యడానికి కాదు, మరి తన కల్పనాశక్తిని ప్రదర్శించడానికే. కాళిదాస కవి 'దీపశిఖ' కూడా పోలికలోని చమత్కారాన్ని చూపిస్తుంది గాని సన్నివేశ సౌందర్యాన్ని కాదంటున్నాను. పోలికలోని కృతకత్వము దాన్ని తిరగవేస్తే తెలుస్తుందంటాను. పోలికని తీసుకురాకుండా చదువరికి వర్ణ్య వస్తు సౌందర్యాన్ని అందించక, కవి పోలికని తెచ్చి అతికి, తన భారాన్ని తగ్గించుకుంటున్నాడు. ప్రబంధ సుందరి అంగాంగ వర్ణనలూ, తలిశెట్టి రామారావు గారి 'ప్రబంధ సుందరి' చిత్రమునూ జ్ఞాపకము చేసుకోండి. అయితే ''ఉపమానాన్ని దాని వికారము దగ్గరకు లాగుతారెందుకూ ?'' అని మీరడగ వచ్చును. ''ఉపమానములో వికారము ఎంతో కొంత ఉంటుంది'' అని నిరూపించడానికి. కొంచెపు వికారము మట్టుకు ఎందుకూ ? అని. ఈ ఉదాహరణము చిత్తగించండి. పుట్టు గుడ్డి తాతయ్యని సలహా అడిగేరట : 'తాతయ్యా పాపడికి పాలు ఇవ్వవచ్చునా ?' అని. 'పాలు ఎలా గుంటాయి ?' 'గోడలా గుంటాయి,' 'గోడ ఎలా గుంటుందీ ?' 'కొంగలా గుంటుంది' 'కొంగ ఎలాగుంటుందీ?' 'ఇలాగ ఉంటుంది' అని మోచేతిని వేళ్లని కొంగ ఆకారంలో వంచి తాతయ్య చేతికి అందించారట. ''అబ్బో, వద్దు, గొంతుకలో గుచ్చుకుంటుందన్నాడట తాత. ఈ కథకు నీతి ఉన్నది. ''పోలికలో ఒక గుణమే ద్యోతకమవుతుంది. వినేవాడి శక్తి లోపాన్నిబట్టి ఆ గుణము కాక ఇంకొక గుణము ముందుకు తోసుకొచ్చి కనిపించవచ్చును.'' అని నేనంటున్నానుగదా, వినేవాడి శక్తి లోపమే కాదూ, చెప్పేవాడి అజాగ్రత్తవల్ల కూడా ఫూతము సందర్భాన్ని తప్పవచ్చును, అని. ఇంతమాత్రమే కాదు, మొత్తపు సౌందర్యమును స్ఫురింప జేయవాలసి ఉండగా, ఒకచోటి ఏకదేశ, సౌందర్యానికి పోలిక ఇస్తూపోతే మొత్తపు వర్ణన స్ఫోటకపు మచ్చల ముఖంగా తయారౌతుంది. ఒక్క పోలికే ఇచ్చినా, ఉపమానము ఏకదేశమే అయి, ఉపమేయముయొక్క నిర్దేశిత సౌందర్యాన్ని అనుభవము చెయ్యలేధంటున్నాను. మొత్తపు సౌందర్యాన్ని స్ఫురింపజేయవలసి ఉండగా, ఏకదేశ సౌందర్యాన్ని భూత అద్దము క్రింద పెట్టినట్లు చూపడము బిరుదైన పని కాదంటున్నాను. ''పద్మముఖి, పద్మహస్త, పాదపద్మములు వంటివి సర్వజనాంగీ కృతములై రాణించలేదా'' అంటే, చిర ప్రయోగములలో ఒక సుగుణమును చూపడానికి నిలిచి, ఈ మాటలు తమ నైసర్గికార్థమును నష్టపోయి మైళ్ల రాళ్లవలెనే నిలిచిన వంటాను. సౌందర్యాన్ని ఒక మట్టాన్ని ఎత్తి అందించగల శక్తి వీటికి భూత పూర్వము, ఈనాడు లేదంటున్నాను. ఈమాటలకే కాదుఇలాటి వాటికన్నిటికీ-Honeyed spring, dearest dear వంటి వాటికి వలెనే ఉప యోగానుకూల్యత అనే ఒకనాటి బలమే, కాలక్రమాన్న నెత్తురూ, నరమూ ఎండినందువల్ల నేటి అస్థిసంజరత్వముగా నిలిచిందంటాను. 'బాధాసర్ప దష్టులార', 'ఆలింగ నాసవము' అన్నవి పనికట్టుకుని దూరంగా తోసి ఊరిద్దామన్న యత్నాలు. 'గదిలో చినుకుల వలె చీకట్లు' 'నిశ్శబ్దం కారుతోంది.' పెంకి కల్పనలు. 'జీవిత వనాంతర సీమల నశ్రువాహినీ సైకతమందు, హృత్సుమ విషాద దళమ్ముల జిమ్మి పోతివి' 'జీవనగంగా హరిత తటంబున చింతా వట తరు మూలమునన్ ఏలయధోముఖివై'' వంటివి కాలక్షేపపు కల్పనలు. ''నీవెక్క దలచుకున్న రైలు, ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు. నీ అదర్శాలన్నీ కలల ప్రేకులోనే పారెయ్యాలి. ఈప్సితాలన్నీ ఎక్సెసంటాడు టీ.టీ.సీ.'' వంటివి వైచిత్రి సాధించేటివి. వీటివల్ల రసపిపాసి దాహము తీరదు. రసమయ రచనే మానవ హృదయాల్ని చల్లబరుస్తుందీ, ఝల్లుమనిపిస్తుందీ, మధురిస్తుంది.

అలంకారము కవిగారి కల్పన. వ్యర్ణ్య వస్తువు యొక్క నిసర్గ శోభకాదు. మన అలంకారములు మరొక దేశమూ—, రాష్ట్రమూ—, మండలమూ—, వారికి రుచించక పోవచ్చును. అలాగే కవిత్వములోని అలంకారాలూను. నిసర్గ సరస శోభగల

అలంకారాలూను. నిసర్గరస శోభగల కవిత్వము భాషాంతరీక రించినా శోభ కోల్పోవదు. వైచిత్రి, అలంకారము, శ్లేష, ఉన్న కవిత్వము యొక్క చమత్కారము ప్రాంతీయమే కాగలదు, విశ్వ జనీనము కాలేదు.

ఛందస్సు సంగతి ఇంతే. వచనములో లేక పద్యములో మాత్రము ఉన్నది ఏమిటి? నడక. కవిత్వానికి ఆ నడక— లేదా, ఏదో నియమబద్ధమైన నడక ఉండి తీరాలా? ఎందుకనీ? పూర్వులు అవలంబించారు గనకనా? ఇదేమిటో వాదమూ? అసలు పద్యము ఎలాగ ఏర్పడింది? అని కొంచెం తర్కిద్దాము. కవులందరూ వాల్మీకిలాగ ''మానిషాద'' అంటూ శోకాన్ని శ్లోకంగా చెప్పేయలేదు సరిగదా వాల్మీకే తన రచనంతటినీ ''మానిషాద'' చెప్పిన ఆ వేగంతో చెప్పలేదు. మాటలకు ఒక వరసను గుర్తించి, అవరసతో తమ భావాల్ని చెప్పారు కవులు· ఆ వరసకి ఉన్న నడక లక్షణమైన ఆకర్షణ సమకూర్చింది పద్యానికి. దీనికి ఒక దశలోరాగము తోడైంది. మూడు విశేషా లలోనూ ఏ విశేషము రాణించినా లాగేస్తుంది వినే వారిని. మరి ప్రతీ రచనకీ ఇవన్నీ ఉండి తీరాలనడమేమి నాదమూ?

ఏ వాఙ్మయములోనైనా పాటముందు, పద్యము తరు వాత, ఆతరవాత వచనము. పాటలోని అడుగులు అన్నీ సమాన పొడవుగలవి. మూడేసి అక్షరాలూ, నాలుగేసి, ఐదేసీ, రెండు నాలుగూ, మూడు నాలుగూ, ఎనిమిది, అక్షరాలతో పాటలలోని ఆవృతాలు సాగిపోతాయి. ఇది చాలా సరళమైన ఏర్పాటు, పేర్లు మాత్రం త్రిశ్ర, చతురశ్ర, ఖండ, రూపక, మిశ్ర, ఆది, అంటూ గాంభీర్యం సూచిస్తున్నప్పటికీ, లయ కోసము చేసుకున్నారు తొలి శతాబ్దాల వారు ఈ ఏర్పాటుని.

మన వాఙ్మయంలో పద్యం ఏ రీతిగా ప్రవేశించిందో చక్కగా తెలీదు. జాతులు అనే ఛందో రచనలు లయమీద నాధారపడినవే. తరువోజ, ద్విపద, సీసము, అయిదేసి లఘువుల ఆవృతాలతో సాగుతాయి. దేశి ఛందములు సమలయమీద సాగే టివేగాని గణాధారములు కావు.

ఉత్పలమాల, చంపకమాల, శార్దులము, మత్తేభమూ అన్న వృత్తాల్ని చూదాము. గణములకు సాధారణముగా మూడేసి అక్ష రాలుండడమూ, ఆ మూడు అక్షరాలకు కలిపి నాలుగేసి లఘువు లుండడమూ చూస్తే ఈ గణ రచనలుకూడా చతురశ్రగతి రచనలేనేమో అనిపిస్తుంది. విశ్లేషిస్తే తేలేది అదే! ''శ్రీమధు, రాధ, రీవినవె, శేషగి, రీశుడ, నేను, మల్లికా'' అన్న ఉత్పలమాల పాదమూ, కాబట్టి చంపకమాల పాదమూ, చతురశ్రగతి రచనే. కంద పద్యము ''కూరిమి, గలదిన, ములలో, నేరము లేతో, చవెపుడు, నిక్కము, మరియూ,'' అంటూ చతురశ్ర గతితోనే సాగుతుంది. శార్దూల విక్రీడితమూ మత్తేభమూ'' బర్వా, త్తంసవి, లాసి, కున్తలభ, రం'' అంటూ యతివరకూ చతు రశ్రగతీ చివ్వర ఒక గురువుతో సాగుతాయి. యతి అన్నది కాల విరామం కనక పాదం అక్కడ రెండు లఘువుల కాలం ఊపిరి తీసుకున్నదనుకుంటే అంతవరకూ నడిచే గతి చతురశ్ర గతియే అవుతుంది. ''మాధుర్య మగ్నానసం'' అన్న పశ్చోద్భాగము రెండు అయిదు లఘువుల ఆవృతాల తరువాత ఒక గురువుతో పూర్తి అవుతుంది. ఇక్కడ మూడు లఘువుల కాలము విరా మము అని అనుకుంటే మత్తేభ శార్దూలాలు అయిదు ఆవృతాలు చతురశ్ర గతిలోనూ మూడు ఆవృతాలు ఖండ గతిలోనూ ఉన్న వరసల జోడింపులాగ కానవస్తుంది. మొత్తము ఎనిమిది ఆవృతాల కాలము అన్నమాట. కంద పద్యముకూడ ఎనిమిది ఆవృతాల జంటయే. ద్విపద రెండు పాదాలూ మొత్తం ఎనిమిది ఆవృతాలే. కవిరాజవిరాజితము ఎనిమిది నాలుగు లఘువుల ఆవృతాలు గలది. గీత పద్యము తకిట, కిటతకిట కిటతకిట తకిట తకిట అంటూ రెండు పాదాంతోనూ అటవెలది ''తకిట తకిట తకిట కిటతకిట కిటతకిట, తకిట తకిట తకిట తకిట తకిట'' అనిన్నీ వదేసి ఆవృతాలలో సాగుతాయి. కనుక పద్యాలుకూడా ఆవృతాల సరములేనంటున్నాను. గణ విభజన వల్ల నడకలో వైవిధ్యము ఉన్నట్లు గోచరము కావడమే కాని మొత్తంమీద లయలో పెద్ద వైవిధ్యమేదీ లేదంటున్నాను. ఈ సత్యాన్ని మన యక్షగాన రచయితలు గుర్తించే ఉండినారూ, ఇది కొత్త నింత ఏమీ కాదంటూన్నాను. యక్షగానాల్లో కందా ర్ధదరువు, ఉత్పలార్ధ—, చంపకార్ధ—, శార్దూలా, మత్తేభా, ఆర్ధ—, గీతార్ధ—, ఆట వెలద్యర్ధ—, ములు రచించడమునకు ఆధారము ఈ పద్యాలన్నిటా పాటలలో ఉపయోగ పడుతుండిన ఆవృతాలు అస్థిపంజరాలులాగ ఆ దరువుల తొలి నడకని నిల బెట్టుతూండడమేనంటున్నాను. పద్యాల రకాలు ఎన్నో ఉన్న ప్పటికీ మానవ స్వభావ అనుకూలమైన చతురశ్ర, ఖండ, త్రిశ గతుల ఆవృతాలు ఉండుట వల్లనే పైన విశ్లేషించిన పద్యాలకు విశేషోపయోగము కనబడుతోందంటున్నాను.

రగడలు అనేక గతులని ఛందో గ్రంథాలలో సవరించ బడి ఉంటాయి. హయగతి రగడ, వృషభగతి రగడ ద్విరదగతి రగడ అంటూ, ఇవన్నీ గణ ఛందస్సునుబట్టి చూస్తే బహు క్లిష్టములు, వైవిధ్యము చాలా ఉంటుంది వాటిలో. ఈ రగడ లకే ఆవృత విశ్లేషము చేస్తే కడవంత గుమ్మడికాయా కత్తి పీటకు లోకువ' అన్నట్లు వాటి ఛందస్సు చక్కగా తెగివిడి పోతుంది. జానపద గేయముల ఛందస్సును వరించేవట్ల వ్యాకర ణాలంకార విద్వాంసులు అప్ప కవి వంటివారు పడే తంటాలు మనకి అపరిచితములు కావు. ఆ చిక్కులు ఎందుకు వచ్చాయో

ఆలోచిస్తే, మాత్రాఛ్ఛందస్సులు పద్యాలుగా మారినప్పుడు అన్నిరకాలుగా ఎలాగు మారతాయో సులువుగా అన్వయమై పోతుంది. మాత్రా ఛందస్సులోని నాలుగు లఘువుల ఆవృతము పద్య ఛందస్సులో, భగణము, జగణము, సగణము, నలము అన్న నాలుగింటిలో ఏదైనా కాగలదు. అక్కడిది ఒకటి ఇక్కడ నాలుగై కంద పద్యపు ఛందస్సును పద్య ఛాందసులు వర్ణించిన వైవిధ్యమును పరిశీలిస్తే చతురశ్ర గతిలో నడిచే గతినే, అక్షరాల మార్పుని లెక్క తీసుకుంటే ఎంత చిత్రముగా వర్ణించవచ్చునో తెలుస్తుంది. అంత దూరము పోనేల? ఉత్పలమాలలోని తొలి అక్షరము గురువైతే "భరన భభరవ" ఆ అక్షరమే రెండు లఘువులైతే "నజ భజ జజర", ఎందుకీ తేడాకు భేషజము చెప్పండి? ఈ మహా పద్యాల రచనకు పొరపాటు జరిగితే బెడిసి కొట్టించే శక్తులున్నాయని కల్పనలు చేసి పద్యాలతో ఆడుకునే మహాశక్తిని తామే గుత్తగొనడానికా? ఇంకెందుకేనేనా?

ఏతావాతా తేలేదిది : పద్య ఛందస్సు కైలాస పర్వతమునుంచి దిగివచ్చిన పూత గంగా ప్రవాహమేమీకాదు. నర మానవుడు పాడిన పాటల తీరును చూచి వాటిలో ఒక వరుసను పట్టి నరమానవులు ఏర్పరచినట్టిదే. ఈ పద్యాలను అనుసరించిన వారు పద కవుల్ని హేళనచేసేవారుట, ఇంతోటి మహాశక్తి వారికి లేకపోయిందని! తిక్కనగారంతటి 'కవిబ్రహ్మ' గారికి కూడా నిర్వచన రచన గొప్పదనిపించింది తొలినాటి రాజసపు రోజులలో.

సంస్కృతములోని వృత్తాల్ని ఎరువుతెచ్చుకుంటూ, తెలుగువారు సంస్కృతములో ఉన్న విరామాన్ని తీసేసి లేని అక్షరయతి, ప్రాసలను ప్రవేశపెట్టారు. అంటే వృత్త రచన 'మే డ్ డిఫికల్ట్' అన్నమాట. వీటన్నిటికీ విడుపరాని పావిత్ర్యము నంటగట్టడమెందుకో?

తెలుగులో మనమెరిగినవే ప్రబంధాలూ పద్య కావ్యాలూ ఎన్నో ఉన్నాయి. ప్రధానమైన రసానుభవమును గాలికి వదలి, అష్టాదశవర్ణనలతో, అలంకారపు గలగలతో ఏదో పుస్తకము వ్రాయాడానికని— కూచిమంచి తిమ్మనకవి రసికజన మనోభిరామము వంటి — ఏదో కథతో ప్రబంధాలు వ్రాశారు అనేకులు. వాటిని మనము వినము సభలలోగాని, విమర్శలలో గాని. పద్యమాత్ర రచనలే అవి. మరి అన్ని చప్పని కావ్యముల ఆవిర్భావానికి పద్యమే కవిత్వమనే అపోహయేగదా కారణము? మనమూ అపోహను ఇంకా పొడిగించడమేల? ఆశు కవిత్వము, బంధ కవిత్వము, గర్భ కవిత్వము, శత ఘంటకవనము అనే రచనలన్నిటికీ పద్యమే కదా కవనము' అన్న బిరుదును తగిలించినది? పద్య మాత్రము కవిత్వము కాగలదా? "ఆంధ్రపత్రిక ఇక్కడ అమ్మబడును;" "అన్ని రకముల మందులు అమ్మబడును" "స్పైర్కు నువ్వుల చాయపప్పు నూనె" చిలకమర్తి లక్ష్మీనరసింహ మూర్తి" "వావిలాల వాసుదేవశాస్త్రి" ఇవి కవిత్వాలా? కాదు. పద్యాలలో ఆయుర్వేదము, అలంకారశాస్త్రము, వేదాంతము, వ్యాకరణము, పద నిఘంటువులు, రచిస్తే అవి కావ్యాలా? పంచరత్నాలూ ఇత్యాదులన్నీ కవిత్వాలా? వీటి కవిత్వపు చలామణి మన రుచ్చిన్నికిందకి దిగలాగింది. ఇంకా లాగుతున్నది. మరి పద్యము మీద ఎందుకని మోజు?

# అనిబద్ధ కవిత్వము : ప్రశ్నోత్తరాలు

1. "అనిబద్ధ కవిత్వము అంటే ఎలాటి కవిత్వమండీ?"

"నియమాలచేత బద్ధమైన కవిత్వము నిబద్ధ కవిత్వము, ఏ నియమాల చేతనూ బద్ధము కాని కవిత్వము అనిబద్ధ కవిత్వము".

* * * *

2. "నియమాలంటే ఏవని మీ ఉద్దేశము ?'?

"ఛందో—, వ్యాకరణ—, అలంకార—, కవి సమయ—, నియమాలు. యతి ప్రాసలు ఛందో నియమాలే."

* * * *

3. "ఏ నియమమూ లేని విశృంఖలా వ్యాపారము సమాజానికే అపాయకారిగదా, మరి సారస్వతానికి గుణము కాగలదంటారా ?"

"శృంఖలలు సారస్వతానికి ఉపకారులు కాగలవని మీరంటారా ? సమాజములో ప్రతీవారూ స్వంత లాభం కొంత మానుకు, పొరుగువాడికి తోడ్పడాలి. ఎవరి లాభం వారు చూసుకుంటూ పోవడము విశృంఖలా వృత్తి. అది సమాజానికి అపాయకారి. సారస్వతము విరామ సమయాన్ని ఆనందదాయకము చేసే యత్నము కదా ? మరి అది ఇలాగ ఉండాలి, అలాగ ఉండాలి అని నియమించడమేల ? సమాజానికి అపాయకారిగా పారదారికా శృంగారాన్ని అగ్గించే రచనలైతే గర్హించవలసినదే తిట్టు పత్రికలూ, బూతు పత్రికలూ వంటి వాటిని. నిరపాయకర రచనలకు నియమా లెందుకు ? మీరు విశృంఖలా వ్యాపారము అన్నది ఇతరులకు బాధ కలిగించే పనుల పట్లనే కాని తక్కిన వాటికి చెల్లదుకదా ?"

* * * *

4. ''అయితే అందరూ కవిత్వము వ్రాసేస్తారు. మంచి చెడ్డా, పేడా బెల్లమూ ఏకమైపోతాయి.''

''వ్యాకరణయుక్తంగా వ్రాయనక్కరలేదూ, వ్యవహార భాషలో వ్రాయవచ్చును అని రామమూర్తి పంతులుగారు ఘోషించినప్పుడూ ఇలాంటి 'అపాయాన్నే' సూచించారు కొందరు, అడ్డమైనవాళ్ళూ వ్రాయడము ప్రారంభిస్తారు, అంతా కలగాపులగము అయిపోతుందని. అయితే వ్రాసేవాళ్ళు అనంత మయిపోలేదు, పత్రికలు కంగాళీ అయిపోనూ లేదు. ఈనాడు వచన గేయాలనే పేరుతో రచనలు పత్రికలలోనూ, సంపుటాలలోనూ చాలా వస్తున్నాయి. అయితే బాగున్నవి ఏ కొద్దో, వేళ్లమీద లెక్కపెట్టవచ్చును. కనక నియమాల్ని సడలించినంతమాత్రాన 'కవిత్వము' పెచ్చు పెరిగిపోదు. అచ్చయిన కవిత్వమంతా నిలిచి అలరించగలదా ? కాక, పద్యాలు మాత్రము అడ్డమైనవాళ్లంతా వ్రాయలేదా ? నిలిచినవెన్ని, అన్నీ నిలిచాయా ?''

* * * *

5. ''యతిప్రాసలతో, పద్య ఛందస్సులో, పూర్వ కవులు వేలకొద్దీ పద్యాలలో కావ్యాలు రచించలేదా ? అలాగ వ్రాయడముచేతగాక ఛందస్సు పోవాలీ, అలంకారము అక్కర్లేదూ, అని ఆధునికులు దేవులాడుతున్నారు, అన్న విమర్శ వస్తే మీరేమంటారూ ?''

''వారి నమ్మకము చొప్పున పూర్వులు వారికి ఇష్టమైనట్లు వ్రాశారు. మా నమ్మకము చొప్పున మేము మా యిష్టము వచ్చినట్లు వ్రాస్తాము, తగ వెందుకూ ? అంటారు ఆధునికులు. మేము వారిలాగే ఎందుకు వ్రాయాలీ ? వ్యాసాలూ, చిన్న కథలూ, నాటికలూ, నాటకాలూ వారు వ్రాయలేదే, మరి మేమూ వ్రాయకూడ దంటారా ? ....' ఇక వారు చేసిన కసరత్తులు మేము చేయలేదని మామీద కోప మెందుకూ ? వారి కెదురుగా విమర్శించే రసికులు లేరు. ఏ పల్లెలోనో కూర్చుని తమ నేర్పుని కుప్పలు పెట్టారు వారు మా పరిస్థితులు వేరు—తెల్లవారేసరికి వేలకొద్దీ పాఠకుల ముందు పడతాయి మా రచనలు దేవుడి ముందు పాడుకునే గాయకుల్లాగు. వారు వారి భావనా బలాన్నే ప్రదర్శించారు గాని గురి చూచి రచించలేదు. మాకు అలా కుదరదు. మాకున్న వడపోతలు వారికి లేవు. మా పరిస్థితులు వేరు. మేము వారిలాగే ఎందుకు రాయాలీ ? మా యిష్టము వచ్చినట్టు రాస్తాము. బాగుందీ, బాగులేదు అని అనండి. వారిలాగు రాయలేదు, వీరిలాగు రాయలేదు అని పోలికలేల ? యతిప్రాసలు పూర్వులు తమ నెత్తిమీద పెట్టుకున్న బరువులు. ప్రస్థరలకు కాబోలు నాలుగు యతులు. ఎన్ని ఎక్కువుంటే అంత గొప్ప ? మాకు వారి నియమాలు అక్కరలేదు. 'గడియకు నూరు పద్దెములు గంటములేక రచించే డాబులు మాకు వద్దు. మేము గంటములతో వ్రాయము, కాగితాలమీద పేనాలతో వ్రాస్తాము. గంటంతో తాటాకుమీద వ్రాస్తేనే కవిత్వమా ? యతి ప్రాసలూ అంతే. మా దృష్టిలో ఆ శబ్దాలంకారాలు ఉండి తీరాలని నియమ మేమిటీ ? పూర్వులు పావకోళ్లమీద నడిచారు. గణ ఛందస్సుతో పద్యాలు రాశారు. మేము పావకోళ్ల మీదే నడిచి వారిలాగే పద్యాలు రాయాలా ? ఎందుకనీ ? మేము వ్రాసే తీరుని భూతకాలం నిర్ణయించాలా ? మేము పూర్వులు చేసే పనులనీ చేసి చూపించాలా ? అలాగ అనే రసికుల మెప్పు మాకు అక్కరలేదు. మీరు అటుతిరిగి కూర్చుని అవి చదువుకొండి, అంటారు నవీనులు.''

6 ''ఈనాడు కుప్పలు తెప్పలుగా పుస్తకాలలోనూ, పత్రికల్లోనూ, సంపుటాలలోనూ, వచన పద్యాలో, గేయాలో కావ్యాలో; ఏవో వస్తున్నాయి—అవేనా మీ అనిబద్ధ కవిత్వాలంటే ?''

''అవి అనిబద్ధ రచనలు అన్నది నిజము మాట. కవిత్వమా ? కాదా ? అన్నది వేరే మాట. కవిత్వమో కాదో రసికులు, విమర్శకులు నిర్ణయించండి. అనుభవాల్ని రేకెత్తించే పాత అనుభవాన్నే కొత్తగా స్ఫురింపజేసే, కొత్త అనుభవాన్నిచ్చే రచనల్ని కవిత్వ మంటాను నేను. అనిబద్ధంగా రాస్తే అనిబద్ధమే, దానిలో కవిత్వ ముంటేనే అది అనిబద్ధ కవిత్వమౌతుంది. చేతికి వచ్చినట్లు వ్రాస్తే అది కవిత్వ మెలాగౌతుందీ ?''

7 'కవిత్వము అనిబద్ధమే అయిఉండాలా ? నిబద్ధమైతే అది కవిత్వము కాకపోతుందా ?'

'కవిత్వము నిబద్ధమైనా అనిబద్ధమైనా కవిత్వమే. ఎంతవరకూ నిబద్ధమో అంతవరకూ ఆ కవిత్వము నైసర్గిక సౌందర్యాన్ని జార విడిచిందన్నమాటా కృతక సౌందర్యాన్ని కప్పుకున్నదన్నమాటానూ. పద్యాన్ని పాడితే వచ్చే సౌందర్యమే కవితానిధి కాదని గ్రహించలేనివా రెందరో ! మరి నడక(అంటే ఛందస్సు) వల్లా, (కవిగారు అతిశయోక్తి చేసో ఉత్ప్రేక్షించో కట్టిన నగని తీసుకొచ్చి అమరిస్తే) కవిగారి భావనవల్లా వర్ణ్య వస్తువుని ఆవరించిన ఆకర్షణ కృతకమని గుర్తించేవా రెంతమంది ఉండగలరూ ? కనక సాలంకార కవనమూ, ఛందోబద్ధమైన రచనా కవిత్వముగా చలామణి అయిపోతాయి. అవి నిబద్ధములని రసికులు ఎంత త్వరగా గ్రహిస్తే అంత మేలు.''

# అనిబద్ధ కవిత్వము: ప్రశ్నోత్తరాలు

8. ''ఛందస్సూ, అలంకారమూ కవిత్వానికి అందము తీసుకు రావంటారా ?''

''మీరంటూన్న 'అందము' కృతకము, సహజము కాదంటున్నాను. రసఘట్టాలలో అలంకారాలు ప్రయోగిస్తే రసాభాసము అవుతుందని అందరికీ తెలుసు. రామలింగా రెడ్డిగారి బోధ అంతా అదే. మరి, శోకము శ్లోకమైనది గదా అని ఆ శ్లోకపు వరుసను పట్టి కావ్యాలకు కావ్యాలు రచిస్తే, వాటి శరీరమంతా భావావేశంతో దీపిస్తుందా ? సుందర వస్తువుని విశ్లేషించి, ఆ ఇటుకలతో సౌందర్యము నిర్మించ డము సాధ్యమా ? చైతన్య వంతుడైన కవి తన సౌందర్య చైతన్యానికి అనుకూలమైన వరసలో రచించివాలిగాని ఈ వరసలో రచించాలని ఉద్యమించడము రచనని నిబద్ధము చెయ్యడము కాదా ? మరి, వాల్మీకి శోకము పుట్టుకే ఆ వర సలో బైటపడింది కదా మరి ఆనందమూ, భక్తీ, జుగుప్స వంటివి ఆ వరసలోనే సహజంగా వస్తాయా ? సామెతలు గమనించండి. వాటిలో యతీ ప్రాసా ఇన్నో అక్షరము రావా లని నియమమున్నదా ? నానుడులలో యతులు ఉండనే ఉండవు కొన్నిచోట్ల. నాట్య, అర్థగౌరవమూ అనుభవ సాంద్రతా కాక యతి ప్రాసలా వాటిని నింబెట్టుతూన్నదీ ? ఛందస్సుని ట్రేడ్ మార్కుగా ఉపయోగించే కర్మం కవి కేల ? తన ఆనందాన్నీ, ఉత్సాహాన్నీ, ఇతరుల కిద్దామని కవి రచన కుపక్రమించగానే ఈ కట్లలోనే ఇవ్వాలన్న నియమ మెందుకూ ? ఆ నియమము కవిత్వానికి మొదటి ఆటంకము కాదూ ?''

9. ''అయితే దేశదేశాల కవులు కవిత్వాన్ని ఛందో బద్ధంగానే రచించా రెందుకూ ?''

''సంప్రదాయాన్ని అతిక్రమించడము ఇష్టములేక. ఈ ప్రశ్నని వెల్లకింబెట్టి చూపిస్తాయి మరో రెండు ప్రశ్నలు, వాటిని వేస్తాను. (1) మన తొలి కవులు ఏ ఏడో ఎనిమిదో శతాబ్దాలలోనో రచన ప్రారంభించారు గదా, స్వంత రచన ప్రారంభించారు గదా, స్వంత రచన చెయ్యక, భాషాంతరీ కరణాలే చేశారేమీ ? (2) ప్రతిపద్య రకానికీ దానికే విశిష్ట మైన నడక ఉన్నది కదా, చదవసగానే ఆబాల గోపాలము ఆ నడకని ముంచేసే రాగముతో పద్యాన్ని కప్పి 'చదువు'తా రేమీ? ఇలాటి ప్రశ్నలు ఎన్నైనా వస్తాయి.... సంప్రదాయం ఏనుగు కాళ్లతో సాగిపోతుంది... దానిని ప్రశ్న వెయ్యడము మాట నటుంచి కొంచెము మార్చనెంచిన వారు కూడా సంప్ర దాయానుసారుల ''ముదివిటులు, విధవలంజలు, పద కవితలు'' అన్న తిట్లకు గురియైనారు. పద కవిత్వానికి లోటేమిటీ, యతి ప్రాసలుగార్చున్నారు, నాట్యానికి ఆధారమైన సమలయ ఉన్నది ! నియమాలు కష్టంగా లేవని గదా పదకవిత్వాన్ని కనీసము చేశారు ? వచనము అసలే లేకుండా పద్యాలతోనే వ్రాయడము ఒక గొప్పదనము అయి పోయింది. గడియకు నూరు పద్యములు గంటము లేక రచించే నేర్పుని టప్పాలు కొట్టడానికి కవులు పద్యాలు రచిస్తే వాటిలో లేని సంగీత నాట్య గుణ సంపన్నతని కనిపెట్టుకుంటూ జిలుగు విమర్శలు చేస్తున్నారు పండితులు.''

10. ''ఛందస్సులో సంగీత నాట్యగుణ సంపన్నత లేదంటారా ?''

''సంగీతము స్వరాలకు సంబంధించినది. భాషలో స్వరాలుండవు. మీరు పాడితే తప్ప వచనము కూడా— మీకు ఇష్టమైతే— పాడుకుంటే స్వరాలు వస్తాయి. కనక, పద్యం లోని స్వరాలు తెచ్చి పెట్టుకున్నట్టివి. ఇంగ్లీషు పద్యాలు సభా వేదికల నుండి పాడరు. మీరు తెలుగుపద్యాన్ని పాడుతున్నారు. అది మీ ఇష్టము. పద్యంలో రాగం లేదు, కవికి రాగము రాన క్కరలేదు. పద్యాన్ని పాడేస్తే దానిలో సంగీతమున్నదనుకుంటే ఎవరేం చెయ్యగలరు ? పద్యానికీ గద్యానికీ తేడా గణముల వరుస. పొడుగు అడుగు పొట్టి అడుగూ వరసగా వేసుకుంటూ సాగుతుంది పద్యము. ఇది కాలవిభాగమే కాని నాద విభాగము కాదు. ఇక యతిప్రాసలు మళ్లీ వస్తూండడమువల్ల పునరుచ్చా రణవల్ల కలిగే సంతుష్టి ఉంటుంది కాని సంగీతము ఏమీ ప్రవేశించదు కవనంలో. చిన్న పిల్లలు 'పేదరాసి పెద్దమ్మా, పెద్దమ్మ కొడకా' అన్న కథలో మళ్లీమళ్లీ వచ్చే మాటల్ని ఆసక్తితో వింటారూ, జానపదులు 'తందాన రాజనందానా' 'హరిహరీ నారాయణాది నారాయణా కరుణించి మమ్మేలు కమలలోచనుడా' అన్న పల్లవిని ఎన్నిమార్లు వచ్చినా సహి స్తారు. రసికులలో ఈ తత్వము అనుప్రాసాసక్తిగా పరిణ మించిందనుకుంటాను. ''అడిగెదనని కడువడి జను నడిగిన దను మగుడ నుడువడని నడయుడుగున్'' లోని 'డ'కారమూ, ''కరి దిగుచు మకరి సరసికి, కరి దరికిని మకరి దిగుచు గరకరి బెరయన్'' లోని 'ర' కారమూ. ''ఏలా లతాజాల డోలాసమా లోల బాలామణీ గాన భాసురములు'' లోని లకారమూ మళ్లీ మళ్లీ వచ్చే గుణము వల్లనే సంతుష్టిపరుస్తాయి గాని వాటి నాదము వల్ల కానేకాదు. అను ప్రాసములో ఉన్నట్టిది నాదమూ సంగీతమూ కాదు, మరి పునరావృత్తి మాత్రమే.

ఇక నాట్యము సంగతి. లయ, సృష్టిలోనే ఉన్నది. సూర్య చంద్రుల ఉదయాస్తమయాలలో, ఋతువుల వరు సలో జీవిత పుటల వాట్లలో, నాట్యములో కూడా ఉంది. పద్యములోనూ ఉంది. మరి ''పద్యములో నాట్యగుణ సంపద ఉన్నది, ప్రకృతి గుణ సంపద ఉన్నది, జీవిత గుణ సంపద ఉన్నది'' అనడము ఎలాంటిదీ ? పద్యములోని పాదములు నాలుగూ ఒక లాగే ఉండి వరసగా వస్తూ ఉండడము పునరావృత్తి. పాదములోని గణములు గురు లఘువులను పేర్చుటలో— ఛిద్రములైన ఆవృతములు. ఆవృతముల సమలయ విరి చారూ, ఒక ఆవృతము అయిపోగానే తరవాతి దానితో టాక్కి పెట్టారు గుర్వక్షరములతో. ఈ మార్పువల్ల ఉత్పలమాల

చంపకమాల అనే చతురశ్రగతి ఆ వృత్తాల మాలలు ఆ చతురశ్రగతి విరిగి, సమ పూసల దండలుగా కాక పొడుగూ పొట్టీ పూసల దండలుగా తీరినవి. వీటిలో అంతర్వాహినిగా నడిచే చతురశ్రగతి పద్యార్థదరువులలో తప్ప సభాపతనాలలో— రాగము ప్రవేశించుట వల్ల— స్ఫురించడమే లేదు. మరి నాట్య గుణ సంపదను మెచ్చుకునే వారు దేనిని చూసి మురిసి పోతూన్నట్టు ?"

11. "ఆంగ్ల కవులూ విమర్శకులూ వ్రాసిన వ్యాసాలలో 'The poet sings' అంటూ, 'The Music of a Verse' అంటూ ఉన్న మాటలు ఉత్తుత్తివేనా ?"

"లయకూ, తూగుడుకూ, అక్షరాను ప్రాసము నకూ వారు Music అనే మాట వ్యవహరించారు. కాని పద్యాన్ని పాడరు వారు. మనము పద్యము చదవడము పేరుతో కూన రాగాలు తీసేస్తాము. వారి వెర్రివారిదీ, మన వెర్రిమనదీనూ. రెండూ వెర్రులు మాత్రమే."

12. "అదుగో, ఆ లయ, తూగుడూ, అనుప్రాసమూ ఉంటే ఆ రచన అవి లేనప్పటి కంటె బాగుండదదూ ?"

"ఏనిమిదో ప్రశ్నలో చెప్పేను. ఆ అందమన్నది కృతక మని. నిసర్గమైన భావము ఛందస్సులో పోతపోస్తే కొత్త—, కృతకపు—, ఆటంకమేనా కలుగుతుందీ, ఆ బద్ధపు మెఱుగురానేనా వస్తుంది. ఈ ఛందస్సు కుళ్లాయీ, అలంకారపు దుస్తులు లేకపోతేనేమీ ? అని. అలవాటయింది కనకనా ?"

13. 'అంటే నిసర్గమైన భావము అలాగే ఇచ్చేయాలంటారా ?'

'అలాగే ఇచ్చేస్తే అది ప్రకృతే అవుతుంది, కళ అవదు. ఏ రీతిగా ఇస్తే చదువరికి ఆ భావము అందుతుందో చూసుకుని అలాగ ఇవ్వాలి. ఈ ఛందస్సులో ఇవ్వాలి. అనడమూ 'ఈ అందము ఆ అందము లాగ ఉన్నదని చెప్పాలనడమూ ఆటంకాలంటాను."

14. "అలాంటి అనిబద్ధకవిత్వము ఎవరేనా రచిస్తున్నారా ?"

"రవీంద్రుడు చాలాచాలా రచించాడు. వాటిలో, స్ఫురించిన అందాన్ని అనుభవించక, ఈ రచనలో ఏమిటుందీ అని పండిత మనస్కులు అలంకారాల కోసము వెతికేరు. కొందరు రవీంద్రుని రచనలు నచ్చలేదన్నారు.

రవీంద్రుని రచనలు ప్రపంచానికి అనిబద్ధంగా, ఇంగ్లీషులో అందేయి. కొందరు బంగాళీ భాషలో ఆ రచనలు గీతాలే అని జ్ఞాపకము చేస్తున్నారు. మనకూ, ప్రపంచానికీ అందిన రూపాన్ని గురించే నేను చెప్పేది. ఆ రూపాన్ని రవీంద్రుడే తీర్చాడు— చాలా మట్టుకు. మన మెరగని బంగాళీ రూపము గొడవ మనకేల.

తెలుగులో దేవరకొండ బాలగంగాధర తిలక్ వ్రాస్తున్నది చాలా మట్టుకు అనిబద్ధము."

15. "చాలా మట్టుకు అని కొంత ముభావికము చేస్తున్నారేం ?"

"మనవి చేస్తున్నా. మాటకి ఆయన 'నేను కాని నేను'లో వ్రాశారు 'నా గది అవతల ఎవరో నవ్వుని నొక్కిపట్టిన ధ్వని నీళ్లను కలచినట్లు' అని. నీళ్లని కలచిన ధ్వని, నొక్కి పట్టడము లాంటిది ఎలా గౌతుందో నాకు తెలియలేదు. ఆయన అనుభవంలో నీళ్లను కలచిన ధ్వని ఆయన ఊహించిన లేక అనుభవించిన నొక్కిపట్టిన నవ్వుని పోలి ఉండవచ్చు. తమ వైయక్తిక అనుభవాన్ని అందరిదీనీ అన్నట్లు వాడేరు ఆయన. ఈ పోలిక అనిబద్ధము కాదంటాన. అలాటిదే 'రోదసిలో చీకటిలో అంతర్జ్వాల సంగీతం తాలూకు శ్రుతి చుట్టుకొన్నట్టు' కూడాను. వారే 'విరహోత్కంఠితలో' 'నవ్వడైతే చాలు ప్రభూ, రివ్వున స్మరశరం హృదయాన్ని దూసుక్కపోతోంది' అన్నారు. 'స్మరశరం' అంటే నిశ్చితమైన అర్థం లేదు. ఇక్కడ సంప్రదాయం పల్చన చేసింది రచనని. "త్వరమాణమైన నా తనువు స్వీయ యౌవన భారాన తడబడి పోతున్న' దన్నారు. 'స్వీయ' సంప్రదాయ రచన పట్టుకొచ్చి పడవేసిన పర్వతము. 'అసక్య దతిశయోక్తి శీలమైన నాతనూ కావ్యాన్ని' అన్నది వైచిత్రి కోసము యత్నించి వేసిన వల. "ఏ కాంత కుంత నిహతమ్ము రస్సైక మద్భావనా శకుంతమ్ము" పురాణ కల్పనా శాఖ విరిగి పడ్డట్టుంది."

16. "ఈ అనిబద్ధకవనాలు నిలుస్తాయా చిరకాలం?",

"ఎందుకు నిలవవూ ? పద్యాలు కట్టుబడిలో ఉంటాయి గనక జ్ఞాపకముంచుకోవడము కొంచెము కష్టము. అయితేనేం ? మునపటి రోజుల తాలూకు పుస్తకాలు కాదుగా ఈ నాడూ ? అచ్చుపడి అంతటా లభిస్తాయి. ఇంగ్లీషు కవిత్వము మనకు అంతగా జ్ఞాపకము లేక పోయినా కావాలన్నప్పుడు తీసి చూసుకుంటాము. కదా ?"

17. "ఇంగ్లీషువారూ, ఫ్రెంచివారూ ఈ అనిబద్ధ కవనాన్ని ఆదరిస్తారా ?"

"వారు ఆదరించాలని రాయడము లేదు మన కవులు. కాని నా విశ్వాసము ఈ కవనము విశ్వ సాహిత్యంలోనికి వెన్నెల లాగ వ్యాపిస్తుందని. ఇది దేశ కాలానబద్ధం, సంప్రదాయానబద్ధం. ఒక జాతికి ప్రత్యేకమైన నమ్మకాలూ, ఉత్ప్రేక్షలూ, ఈ కవిత్వంలో ఉండవు. తెలుగుకవి ప్రపంచాన్ని వినమంటూ కోయిల గొంతు విప్పుతున్నాడు అనిబద్ధ కవిత్వములో. ఎవరి కోసము వింటుందీ ప్రపంచము ?"

# తేజోరేఖలు

## శ్రీ సంజీవదేవ్

ఒకోసారి కొన్ని నిరీక్షణలు పూర్తిగా వాస్తవ రూపం తాలుస్తవి. ఆరోజు (17—11—62) ఆల్డస్ హక్స్లీ నుంచి తప్పకుండా ఉత్తరం వస్తుందని నేను గట్టిగా నిరీక్షించాను. అందుకని ఆయనకు నా ఉత్తరంతోపాటు పంపే నిమిత్తం సూక్ష్మ రూపాలలో (2అం. 1 అం.) కొన్ని ప్రకృతి దృశ్యాలను నీటి రంగులలో చిత్రించాను. ఆశ్చర్యం! నేను వాటిని ముగించానో లేదో హక్స్లీ నుంచి ఉత్తరం రానే వచ్చింది! ఇటువంటి నిరీక్షణలను సాధారణంగా దివ్య నిరీక్షణలు అంటారు. ఎక్కువమంది జీవితాలలో ఇటువంటి నిరీక్షణలు చాలా తక్కువగా ఉంటవి. తక్కువమంది జీవితాలలో ఎక్కువగా ఉంటవి.

*　　*　　*　　*

కల్పనలేని ప్రతిమలు కేవలం లక్కబొమ్మలు మాత్రమే అవుతవి. కల్పన భౌతిక రూపంలో గడ్డకట్టినపుడు అది ప్రతిమగా మారుతుంది; ప్రతిమ నైరూప్యంలోకి కరగిపోయినప్పుడు అది కల్పనగా మారుతుంది. ప్రతిమ రూపొందకముందు అది ఒక కల్పనే. రూపొందిన తరువాత కూడ మళ్లీ అది ఒక కల్పనే అవుతుంది. ప్రతిమ జన్మించకముందున్న కల్పన ఆ ప్రతిమను సృజించిన వ్యక్తిలో ఉంటుంది. అది జన్మించిన తరువాత ఉండే కల్పన దాన్ని చూచి ఆనందించే వ్యక్తిలో ఉంటుంది. స్రష్టలో కల్పన ప్రతిమగా రూపాంతరం చెందితే ఆ ప్రతిమ తిరిగి సహృదయునిలో కల్పనగా రూపాంతరం చెందుతుంది!

*　　*　　*　　*

జీవించటం అంటే ప్రేమించటమే. తాను జీవించటం మాత్రమే జీవించటం కాదు, ఇతర్లను జీవించచేసినపుడే నిజంగా తాను జీవించటం అవుతుంది. అప్పుడే జీవించటం అంటే ప్రేమించటం అవుతుంది. ప్రేమగల జీవితం జీవితంమీది ప్రేమకంటే గొప్పది. జీవితం వ్యావహారికమైంది. జీవితప్రమిద మీద ప్రేమజ్వాల వెలుగుతుంది ప్రోజ్వల రూపంలో.

*　　*　　*　　*

గద్యం అనేది ఆలోచన, పద్యం అనేది అనుభూతి. సంగీతం అనేది సంవేదన. మౌనం అనేది తన్మయత. గద్యం అభివ్యక్తపరచలేనిదాన్ని పద్యం, పద్యం అభివ్యక్తపరచలేని దాన్ని సంగీతం, సంగీతం అభివ్యక్తపరచలేనిదాన్ని మౌనం అభివ్యక్తపరుస్తవి. గద్యం భోగట్టా నిస్తుంది. పద్యం ప్రేరణనిస్తుంది. సంగీతం ఇస్తుంది రసానందాన్ని, మౌనం ప్రసాదిస్తుంది సారవశ్యాన్ని. అర్థాలుగల శబ్దాలు గద్యను నిర్మిస్తవి. సగం అర్థాలుగల శబ్దాలు పద్యాన్నీ, అర్థాలులేని శబ్దాలు సంగీతాన్నీ, శబ్దాలులేని నిశ్శబ్దం మౌనాన్నీ సృష్టిస్తవి. గద్యం అనేది భూమి, పద్యం అనేది మేఘం, సంగీతం అనేది ఇంద్రధనస్సు, మౌనం అనేది ఆకాశం. ఈ నాలుగూ సమాన ప్రాముఖ్యత కలవే.

*　　*　　*　　*

ఉండటం అంటే లేకపోవటం కూడా. కాంతి ఉండటం అంటే చీకటి లేకపోవటం అవుతుంది. జ్ఞానం ఉన్నదీ అంటే అజ్ఞానం లేదనే. సంపద ఉండటం అంటే దారిద్ర్యం లేకపోవటమే.

ఇదేవిధంగా లేదు అనేది ఉండటమే అవుతుంది. శాస్త్రీయత లేదు అంటే అశాస్త్రీయత ఉండటమే. వర్షాలు లేకపోవటం అంటే వరుపు ఉండటం అనే. బలం లేదంటే దౌర్బల్యం ఉన్నదనే.

ఉండటం అంటే ఉండటమే. శాంతి ఉన్నదంటే సౌఖ్యం ఉన్నదనే. రసానుభూతి ఉండటం అంటే సహృదయత ఉండటమే. నిర్భయత ఉన్నదంటే స్వేచ్ఛ ఉన్నదనే.

లేకపోవటం అంటే లేకపోవటమే. ఆలోచన లేదు అంటే మేధ లేదనే. మేఘం లేదు అంటే వర్షం లేదనే. అహం లేదు అంటే స్వార్థం లేదనే.

ఉండటం లేకపోవటం కలిసి సహజీవనం వేయగలవు. తత్త్వం తెలిసినవానికి కవిత్వం తెలియక పోవచ్చు. ఖగోళం

తెలిసినవానికి గందరగోళం తెలియకపోవచ్చు. విద్య వచ్చిన వానికి వైద్యం రాకపోవచ్చు. కనుక ఒక దాని జ్ఞానం, మరొక దాని అజ్ఞానం ఒకే వ్యక్తిలో సహజీవించగలవు.

*　　*　　*　　*

తెరచాప పడవను నడుపుతుంది నీటిమీద. పడవ కూడ తెరచాపను నడుపుతుంది, కానట్లయితే తెరచాప పడవను కదిలించలేదు. కొన్ని నిమిషాల క్రితం తెరచాప వంతెన దగ్గర ఉన్నది కాని ఇప్పుడది వంతెన దాటి కొంత దూరాన ఉన్నది. పడవ కదలకపోతె తెరచాప అంత దూరానికి ఏవిధంగా చేరేది? తెరచాప పడవను కదిలించకపోయినా కూడ పడవ అక్కడికి చేరి ఉండేది కాదు! తెరచాప తనంత తాను ఒక చోటి నుంచి మరో చోటికి పడవ సహాయం లేకుండా నడవలేదు. అయినప్పటికీ తెరచాప పడవను నడుపుతుంది!

*　　*　　*　　*

బుద్ధి జీవులు కాయకష్టానికి భయపడి దాన్నుంచి దూరంగా తొలగిఉంటారని వాడుక. కాని ఈ భావన సత్య దూరమైంది. బుద్ధి జీవి—నవలాకారుడు, కవి, న్యాసకర్త మొదలైనవారు—తన చేతితో కష్టం చేయకుండా కేవలం ఆలోచనతో మాత్రమే తన కృతిని ఎప్పుడూ నిర్మించలేడు. బుద్ధిజీవి కలంతో కాని, టైపు యంత్రంతో కాని తన చేతిని ఉపయోగించి పనిచేస్తేనే తన రచనా నిర్మాణం జరిగేది. ఇక చిత్రకారుడు తన మనోకల్పనకు భౌతిక రూపం ఇవ్వటానికి ఎంతో శారీరక శ్రమ పడాలి. ఇక యీ కాయకష్టం మూర్తి శిల్పిలో ఎంతో ఎక్కువ మోతాదులో పనిచేస్తుంది, అతని అనుభూతుల్ని ఆకారాల్లోకి మార్చటానికి.

బుద్ధి జీవితం అనేది కేవలం బుద్ధితో మాత్రమే సాగదు కాయకష్టం లేకుండా. అది దంతపు సౌధాలకు చాలా దూరం. సూక్ష్మాతి సూక్ష్మమైన భావం కఠినాతి కఠిన మైన శ్రమ ద్వారా కాని భౌతిక రూపాన్ని పొందదు.

జీవితం బుద్ధి జనితమైన సూక్ష్మత్వానికి తోడు స్థూలమైన కాయకష్టాన్ని కలిగుంటేనే కాని సజీవంగా మన లేదు. మానవుడు తన శ్రమ ద్వారానే వ్యక్తమవుతాడు. తన చేయి పనిచేయటం మానుకొన్న క్షణాన మానవుడు తన అస్తిత్వాన్నే కోల్పోతాడు.

*　　*　　*　　*

మానవుడిలో ఉన్న మానస శక్తుల్లో స్మృతీ, విస్మృతీ అనేవి చాలా ప్రభావం కలవి. కొందరిలో విస్మృతి కంటే స్మృతి చాలా బలీయంగా ఉంటే మరి కొందరిలో ఇందుకు వ్యతిరేకంగా ఉంటుంది.

సుఖమైన విషయాలను జ్ఞాపకం చేసుకోటంలో ఆనందం ఉంటుంది., సుఖం కాని వాటిని జ్ఞాపకం చేసుకో టంలో బాధ ఉంటుంది. అదేవిధంగా సుఖమైన వాటిని మరచిపోవటం బాధ, సుఖంకాని వాటిని జ్ఞాపకం చేసుకోటం బాధ.

ఆపత్తుల విపత్తుల సందర్భంలో స్మృతి కంటే విస్మృతే ఎంతో మేలు కలుగజేస్తుంది. మనకు ప్రియమైన స్నేహి తులు చనిపోయిన ఘడియల్లో మన దుఃఖానికి అంతూ పంతూ ఉండదు. కాని రోజులు గడిచినకొద్దీ విస్మృతి తన పనిని సాగించటంతో మన దుఃఖంలోని తీవ్రత సలచబడ ప్రారంభిస్తుంది. కాలానికీ విస్మృతికీ చాల దగ్గర సంబంధం కనుక మానసికమైన గాయాలకు కాలం అనేది ఒక మహౌ షధి. కాలమే మాన్పుతుంది బాధను అంటే, విస్మృతే ఆ పని చేస్తుంది అని అర్థం.

సుఖమైనదాని విస్మృతిని మానవుడు భరించగలడు కాని సుఖంకాని దాని స్మృతిని మాత్రం భరించలేడు. ఈ రెండో దానితో విస్మృతికి చెందిన ఇంద్రజాలం మాత్రమే మానవుణ్ణి సుఖపెట్టగలదు.

*　　*　　*　　*

యిరోపా, అమెరికా దేశాల్లో ప్రజలు తెల్లగా ఉంటారు. అందుకని ఆ దేశాలను తెల్ల దేశా లంటారు. కాని యీ తెల్ల దేశాల్లోని బొగ్గు నల్లగా ఉంటుంది, కాకి నల్లగా ఉంటుంది. చీకటి నల్లగా ఉంటుంది! ఉష్ణ దేశాల్లోని ప్రజలు నల్ల గానూ గోధుమరంగుగానూ ఉంటారు. ఈ దేశాలను నల్ల దేశా లంటారు. కాని ఈ నల్లదేశాల్లోని పాలు తెల్లగా ఉంటవి, మంచు తెల్లగా ఉంటుంది. వెలుగు తెల్లగా ఉంటుంది!

మనిషి పూర్తిగా బహిర్ముఖుడు కాదు, పూర్తిగా అంత ర్ముఖుడూ కాదు. మరి ఏ ముఖుడూ అంటే ఉభయముఖుడు అనాలి; ఇదీ ఆధునిక మనో వైజ్ఞానిక సిద్ధాంతం. కనుక మనిషి మానవ మనిషి, మహా మానవ మనిషి కూడ; శరీరపు మనిషి, అశరీరపు మనిషి కూడ. పార్థివపు మనిషి, అపార్థివపు మనిషి కూడ; ఇంద్రియానుభూతీ, అతీంద్రియానుభూతీ కూడ కలవాడు. అతని దృష్టిలో జడం అంతా చేతనమే, మానవుడు దేవుడే, భూమి స్వర్గమే, చీకటి అంతా వెలుగే, శూన్యం అంతా పూర్ణమే!

*　　*　　*　　*

అసమర్థులు భయపడాలసిన అవసరం లేనిదానికి కూడ భయపడతారు. కాని అందుకు వ్యతిరేకంగా, సమర్థులు

భయపడాలసినదానికి కూడ భయపడరు. దుర్బలులు కారణం లేనిదానికి కూడ ఆందోళనచెందుతారు. సబలులు ఆందోళన చెందాలసినదానికికూడ ఆందోళన చెందరు. ధీరులు జీవన జ్యోతిని చూచే చోట భీరులు మృత్యుచ్ఛాయలను చూస్తారు. అతి స్వల్పమైన ఆపద కొందరిని వణకింపచేస్తే అతి తీవ్రమైన ఆపదకూడ కొందరిని కదలించలేదు. ధీరులుగా, సబలులుగా, అజేయులుగా ఉండటం, అంటే నిత్యోల్లాసులుగా, నిత్య జాగరూకులుగా, నిత్యోత్సాహులుగా, నిత్య విముక్తులుగా ఉండటమే అవుతుంది. స్మరణాతీత కాలంనుంచీ ప్రపంచంలోని మతాలన్నిటికీ చరమలక్ష్యమైన జీవన్ముక్తి అనేది ఇదే!

* * * *

వృక్షజాతి మానవజాతికి మంచి తోడు యీభూవిమీద, ఉభయులూ తాము జీవించటానికి ఒకరిమీద ఒకరు ఆధారపడి ఉంటారు. చెట్టు వదలిన ప్రాణవాయువును మానవుడు పీలుస్తూంటే, మానవుడు వదలిన బొగ్గుపులుసు గాలిని చెట్టు పీలుస్తుంది.

మండు టెండలు అంతరించి తొలకరి జల్లులు కాలిన నేలను తడపడంతో, ఎండిపోయిన గోధుమ వర్ణపు మోడు దుబ్బులనుండి చీల్చుకొని పైకివచ్చే పచ్చని మొసులుగుండా ప్రాణం ప్రత్యక్షమవుతుంది.

జంతువువలె అడ్డంగా కాక మానవునివలె నిలువుగా పెరుగుతుంది చెట్టు. అందుకని జంతువుతో కంటే మానవునితో ఎక్కువ సారూప్యాన్ని కలిగి ఉంటుంది చెట్టు.

బోదే కొమ్మా రెమ్మా, ఆకూ మొగ్గా పువ్వూ రంగులోనూ, రూపంలోనూ, పరిమళంలోనూ ఎంతో ఎంతో మనోహరంగా ఉంటవి, మౌనవీణనుంచి వెలువడే మధురరాగం వలె!

ఆకులున్న చెట్టుకంటే, ఆకులు రాలిన అస్థిపంజరపు చెట్టు ఇంకా ఎక్కువ మనోహరంగా గోచరిస్తుంది. చచ్చిన చెట్టుకూడ బ్రతికిన చెట్టంత సుందరంగా, ఒకోసారీ ఇంకా ఎక్కువ సుందరంగా, గోచరిస్తుంది. వృక్షజీవితం ప్రాణమయ కోశానికి చెందింది కనుక వృక్షం అంటే ప్రాణం స్వయంగా మూర్తీభవించినట్లే!

* * * *

ఏకాంతాన్ని కవులూ, చిత్రకారులూ, గాయకులూ, తాత్వికులూ, జ్ఞానులూ, విద్వాంసులూ, ఇంకా జనాంతంతో విసిగిపోయిన ఇతర్లూ ప్రేమిస్తారు. కాని, జనాంతంలోని అల్లకల్లోలాల్నుంచి తప్పించుకునే నిమిత్తం ఏకాంతాన్ని శరణుజొచ్చిన వారికి మాత్రం ఏకాంతం ఎంతో విసుగుగా ఉండి వారు తిరిగి త్వరలో జనాంతంలోకి పోవాలని తహతహలాడతారు. కారణం, ఏకాంతంలోని మౌనమైన మధుర మోహనగానం వారు వినలేరు. వారు ఏకాంతానికి వెళ్ళడం ఏకాంతాన్ని ప్రేమించికాదు. జనాంతంలోని వివిధ బాధలనుంచి తప్పించుక తిరగాలని మాత్రమే. అందుకని ఏకాంతం అటువంటి వారిని ఆనందపరచజాలదు. ఒకదాని మీద ద్వేషం ఉన్నదంటే రెండో దానిమీద ప్రేమ ఉన్నదని అర్థంకాదు.

జనాంతానికి ఎవరు భయపడరో, ఎవరి హృదయాలు గంభీరతకూ, ప్రశాంతతకూ, అనంతత్వానికీ, శాశ్వతత్వానికీ సంలగ్నమై ఉంటవో, వారు మాత్రమే ఏకాంతానిలోని మౌనగానాన్ని వినగలరు. అటువంటి వారికి ఏకాంతం అనేది శరణాలయం కాదు. సుందరం వైపుకూ, గంభీరం వైపుకూ, కరుణామయం వైపుకూ, ఆనందమయం వైపుకూ యాత్రను సాగించడంలో మనకు మహత్తర ప్రేరణ నిచ్చే నిరంతర సహచరే ఏకాంతం. ఏకాంతంలోని గానం జనాంతాన్నికూడ ప్రతిధ్వనింప చేస్తుంది!

* * * *

ఇంద్రియ గ్రాహ్యత తరచుగా, ఎల్లప్పుడు కాకపోయినా, మనను మోసగిస్తూంటుంది. మన బుద్ధి గ్రహించేది ఒక సత్యమైతే మన ఇంద్రియాలు గ్రహించేది మరొక సత్యం. ఈ రెండు సత్యాలూ యదార్థాలూగానే కనుపిస్తవి. కాని, ఇంద్రియాలు గ్రహించే సత్యం దేశంలోనీ, కాలంలోనీ మార్పులననుసరించి మారుతూంటుంది. అయితే బుద్ధి గ్రహించే సత్యం మాత్రం ఇటువంటి మార్పులననుసరించి మారుతూండదు. ఈ రెండవదికూడ శాశ్వతంగా మార్పులకు లొంగదని చెప్పటానికి వీలుండదు.

రైలుబండి వేగంగా పరుగెత్తుతూంటే బయటి చెట్లు వ్యతిరేకదిశలో పరుగెత్తుతూన్నట్లు రైలులోంచి మన కన్ను చూస్తుంది. కాని వెంటనే మన బుద్ధి గ్రహిస్తుంది పరిగెత్తేది చెట్లు కావు, రైలు మాత్రమే అని. దగ్గరలో ఉన్న చెట్టుకంటే దూరంలో ఉన్న కొండ చిన్నదిగా కనుపిస్తుంది మన కంటికి. కాని మన బుద్ధికి తెలుసు చెట్టుకంటే కొండ ఎప్పుడూ చిన్నదిగా ఉండదని. ఈ విధంగా మన ఇంద్రియాలు మనను మోసం చేస్తుంటవి ఎక్కువగా!

అయితే, ఎప్పుడైనా బుద్ధికూడా అంత విశ్వసనీయంగా ఉండకపోవటం జరుగుతూంటుంది. ఈ విధంగా చూస్తే యీ విశ్వసృష్టిలో ఏదీ నిరపేక్షికం (Absolute) కాదేమో, అంతా సాపేక్షికమేమో (Relative) అనిపిస్తుంది. బుద్ధి అతీంద్రియమైందనీ, అనుభవం ఇంద్రియగ్రాహ్యమైందనీ తలంచబడుతూంది. కాని యదార్థంగా పరిశీలిస్తే ఇంద్రియ గ్రాహ్యత

ఎక్కువ మోసకారి, అతీంద్రియత తక్కువ మోసకారి అని మాత్రమే తేలుతుంది. వీటి రెంటిమధ్య ఉన్న ప్రభేదం అంత మాత్రమే. కారణం, రెండూకూడ సాపేక్షిక వాదానికి లోబడే ఉంటవి. హేతువు బుద్ధికి చెంది ఉంటే, అనుభూతి ఇంద్రియాలకు చెంది ఉంటుంది. ఒకోసారి అనుభూతికంటే హేతువే ఇంకా ఎక్కువ మోసకారిగా ప్రత్యక్షం కావచ్చుకూడ. సత్యాన్ని హేతువాదంతో సమీపించటం మాత్రమే అంతిమ సాధన కాదు. కారణం అసలు సత్యం అనేదే సాపేక్షికం. ఒకవేళ నిరపేక్షిక సత్యం అనేది ఒకటుంటే అది హేతువుకూ తర్కానికీ ఆవలగానే ఉంటుంది. అది హేతువుకంటే అనుభూతికే ఎక్కువ సమీపం. అది ఆలోచనామయం కంటే అనుభూతిమయమే అధికం!

* * * *

ఆత్మ ప్రకటనకు మాతృభాష సర్వోత్తమ మాధ్యమం అనటంలో సందేహంలేదు. కాని మాతృభాషలో అభివ్యక్తపరిస్తే కొన్ని అతి సామాన్యమైన అప్రాముఖ్య విషయాలు ఏమాత్రం మనోహరంగా కాని, మహత్తరంగా కాని వినిపించవు. కాని వాటినే పరభాషలో అభివ్యక్తపరిస్తే ఏదో ఆకర్షణీయంగా, ఆధిక్యంగా వినిపిస్తవి, ఎంతో విలువగా!

అతి సామాన్య భావావళికూడ పరభాషలోని పదావళిలో రూపం దాల్చినపుడు ఎంతో అసామాన్యంగా ప్రత్యక్షమవుతుంది. మన స్వంతం కాని భాష ఎప్పుడూ ఏదో ఒక రహస్యమయ ఆకర్షణ కలిగివుంటుంది. ఆరహస్యమయతే సామాన్య భావాలను కూడ అసామాన్యమైన ఇంద్రజాలంతో నింపుతుంది. ఎంత మామూలు విషయమైనా పరభాషలో చదువుతూన్నప్పుడు వింటూన్నప్పుడు ఎంతో అలౌకికంగా తడుతుంది, ఆ భాషలోని కనపడీ కనపడని మేలి ముసుగుగుండా!

* * * *

మేఘాలు, తుఫాను, ఉరుములు, వర్షం, ఇంద్రధనువు, మెరుపులు, ఇవన్నీ భయాన్ని ఆనందాన్నీకూడ కలిగిస్తాయి. మేఘాలు, వర్షం, ఇంద్రధనువు ఆనందాన్నిస్తే తుఫాను, ఉరుములు, మెరుపులు భయాన్ని కలిగిస్తవి. కాని, ప్రకృతిలో యీ రెండు దశలూకూడ సౌందర్యానికి విభిన్న స్వరూపాలే— కోమలం, కఠోరం, మధురం, మహత్తరం.

తుఫానుతో నిండిన కారుమేఘాల కరాళ రాత్రిలో ప్రళయాన్ని మరిపించే ఆ మెరుపుల తళ తళలను చూడ్డం ఆ ఉరుముల ఫెళ ఫెళలను వినడం, సామాన్యుల హృదయాలలో భీతిని రేకెత్తిస్తవి. కాని నిష్పురస చేతననూ, కోమల సౌందర్యపు మామూలుదనాన్ని అతిక్రమించి అసామాన్యమైనదానిలో, గంభీరమైన దానిలో ఆనందం అన్వేషించేవారు ఇటువంటి ప్రళయతాండవాన్నీ, విలయ విశేషాన్నీ తన్మయ హృదయంతో ఆనందించగ రు. భయాత్మక సంవేదన రసాత్మక ఆనందంలోకి రూపాంతరం చెందుతుంది వారిలో.

ప్రకృతిలోనూ, జీవితంలోనూ వ్యక్తమయే అసాధారణమైనట్టీ, గంభీరమైనట్టీ, భయానకమైనట్టీ సౌందర్య స్వరూపాలను ఆనందించడం అనేది మానవుణ్ణి భయంనుంచి విముక్త పరుస్తుంది. భయం అనేది మానవుడి బలమైన శత్రు కోటిలో ప్రధానమైనది. ఆనంద శాంతి సౌఖ్యాలను ఆవిరిగా మార్చివేస్తుంది భయం!



# షేక్స్పియర్ ఉత్సవాలు

## శ్రీ చంద్రశేఖర కృష్ణమూర్తి

ఒక వస్తువులో తనకు కనబడ్డ అందాన్ని, ఆ అందంలో దొరికిన మాధుర్యాన్ని, ఆ మాధుర్యాన్ని సేవించగా కల్గిన మత్తుని, ఆ మత్తులో తాను అనుభవించిన హాయిని నిర్వచించ ప్రయత్నించడం ఎంత అవివేకమో, నిర్వచించమని కోరటం కూడా అంత అసమంజసమేమో నని అనిపిస్తుంది. మత్తు పూర్తిగా ఎక్కితే మాటలు తడబడతాయి. మాటలు సరిగావస్తే మత్తు పూర్తిగా ఎక్కలేదనే అర్థం—అయితే మాధుర్యాన్ని End Point వరకు చవిచూడ లేదన్న మాటే.

ఆంగ్ల సాహిత్యంలో అధ్యయనం చేస్తున్న విద్యార్థికి యీ సంవత్సరంలో ఇంగ్లాండు దేశంలో ఉండటం కన్న మహాభాగ్య మింకొకటి లేదనటంలో సందేహం లేదు. షేక్స్పియరు ఉత్సవాలకు మించిన సాహిత్య సంబంధాలు మరేమీ ఉండవు. అందులోనూ ఇటువంటి జన్మదిన ఉత్సవాలు వందసంవత్సరాలకు ఒకసారి వస్తాయి. భారీ ఎత్తులో జరుగుతున్న ఈ ఉత్సవాల గురించి వ్రాసి పాఠకులకు ఇక్కడి పరిస్థితులు సరసంగా తెలియజెయ్యటం అసాధ్యం. లండనులో షేక్స్పియరు ఉత్సవాల గురించి వ్రాయమని సాహిత్య పిపాసిని కోరటం మైకం etc............



విలియం షేక్స్పియర్
చాండోస్ పోర్ట్రైయిట్ (1564–1616)

లండనులో షేక్స్పియర్ ఉత్సవాల గురించి వ్రాయమని సాహిత్య పిపాసిని కోరటం మైకం తప్పిన వ్యక్తిని, అందులో అతనికి కన్పడ్డ మాధుర్యం గురించి పండిత గోష్ఠిలో, ఉపన్యసించమని కోరిన— మాటలు తడబడక తప్పదు.



ప్రముఖనటుడు డేవిడ్ గారిక్
(1717–1779)

ఈ ఉత్సవాలు ఏ రూపంలో జరుగుతున్నాయో ముందు చూద్దాం : ఇవి,

1, నాటకాలు, 2. ప్రదర్శనము, 3., సాహిత్యగోష్ఠులు, 4. పుస్తకాలు.

సుమారు పదిహేను నాటకశాలల్లో వివిధ కంపెనీ వారు షేక్స్పియర్ నాటకాలు ప్రదర్శిస్తున్నారు. వీటన్నింటి లోనూ ముఖ్యమైనది National Theatre వారి Othello. ఇది Old Vic లో ప్రదర్శిస్తున్నారు. ఇందులో ప్రఖ్యాత నటుడు Sir Laurence Oliver ముఖ్యపాత్ర ధరించేడు. నాటకం ప్రదర్శించిన వైనం వ్రాయాలంటే వేరేగా ఒక వ్యాసం వ్రాయాల్సి ఉంటుంది. క్లుప్తంగా Sir Laurance నటన అద్భుతం. నీగ్రోజాతీయుడిగా అన్ని విధాలా ఒప్పించేడు. కేవలం నల్లరంగు పూసుకోటంతో నీగ్రోగా Othello పాత్రధారి కనపడడు. మాట, చూపు, నడక. నడక తీరు ఆఫ్రికా జాతీయు డెవరన్నా మన దేశంలో క్రికెట్టు ఆడుతూ ఉండగా చూస్తే తెలియవచ్చు. నడుము భాగంలో చిన్న వంపు, నడుము, కీలు వదులుగా ఉండి కాస్త లావు పాటి పిల్లి నడుస్తూ ఉంటే వెనకాల నుండి ఎట్లా కని పిస్తుందో అమాదిరి నడక. అంతేకాదు ఉచ్చారణ—అన్ని విధాల నీగ్రోతనం చూపించి అతి సహజంగా నటించాడు. ముఖ్యమైన మరొకటి వాటిలో Mecbeth. ఇది Mermaid Theatre లోనూ Covent Garden Theatre లో Midsummer Nights Dream నృత్య నాటికగానూ ప్రదర్శించబడుతున్నాయి. వీటి గురించి వీలైతే తర్వాత వ్రాస్తా.

సుమారు ఎనిమిది ప్రదర్శనలు ఇక్కడ జరుగు తున్నాయి. ఇందులో ముఖ్యమైనవి మూడు. National Portrait Galleryలోనూ, British Museumలోనూ, Art Council లోను ఇవి జరుగుతున్నాయి. National Portrait Gallery లో వారి వద్ద గల షేక్స్పియరుకు సంబంధించిన వివిధ వస్తువులూ ఒక గదిలో చక్కగా పేర్చారు. ఇందులో ముఖ్యమైనది షేక్స్పియరు తైలవర్ణ చిత్రం — దీనిని Chandos Painting అంటారు. అంటే Duke of Chandos కు చెందినదని అర్థం. దీనిని వ్రాసిన చిత్రకారుడు ఎవరో ఇద మిత్థమని నిర్ణయం కాలేదు. ఈ చిత్రం కొంతకాలం 18 వ శతాబ్దంలో గొప్ప నటిగా ప్రఖ్యాతిగాంచిన Mrs Barry స్వాధీనంలో ఉండెనట. ఇదికాక ఈ కవియొక్క తైలవర్ణ చిత్రాలు అనేకం ఉన్నాయి. గాని వీటిలో విషయం ఏమిటంటే ఏ రెండు చిత్రాలు ఒకదాన్ని ఒకటి పోలి ఉండవు. అన్నీ షేక్స్పియరు చిత్రాలే. షేక్స్ పియరు శిల్పాలు కూడా ఉన్నాయి. వీటికి వర్ణచిత్రాలకు చాల తేడా కనపడ్తుంది. చిత్రాలలోని దర్పా, గాంభీర్యం వీటిలో గోచరిస్తుంది. ఇవి ముఖ్యంగా 18 వ శతాబ్దంలోనూ, తర్వాతనూ చేయబడ్డవి. అంటే షేక్స్పియరు యొక్క రూపు రేఖా విశేషాలు తన పేరు ప్రఖ్యాతులతోపాటూ మారుతూ వచ్చాయన్నమాట. చిత్రాలలో షేక్స్పియరు ఒక కవిలాగా ఉన్నాడు. శిల్పాల నాటికి ప్రపంచ ప్రఖ్యాతిగన్న మహాకవిగా కనపడతాడు. షేక్స్పియరును తల్చుకున్నప్పుడల్లా తప్పనిసరిగా జ్ఞాపకం వచ్చే Garrick యొక్క చిత్రాలు కూడా ఇందులో ఉంటాయి. ఈ మహానటుడు పేరిట ఒక సొసైటీ ఉంది. గారిక్ థియేటరని ఒక నాటకశాల కూడ లండన్ నగరంలో ఉంది. ఎంతటి మహా రచయిత అయినా తన రచనలను అర్థంచేసుకొని ఇతరులకు అర్థమయ్యే శైలిలో చెప్పే వ్యక్తి దొరికే వరకూ అతని రచనలు సార్థకం కావు. షేక్స్పియరు ఘనతకు మొదట్నుండి నటులే కారకులని మనం గుర్తించ

తప్పదు. ప్రతి శతాబ్దిలోనూ యీ దేశంలో ఈయన నాటకాలను అతి సమర్ధతతో ప్రదర్శించి ప్రశంసలు పొందగల నటులు అనేకులున్నా ఒక్కొక్కరి పేరు చిరస్థాయిగా ఉండిపోతుంది. అటువంటి పేరే Garrick. ఈయన డాక్టరు జాన్సనుకు సమకాలికుడని ఆయన స్థాపించిన Clubకు గోల్డ్ స్మిత్, సర్ జాషువారేనాల్డ్స్, బర్కులతోపాటు తొలి సభ్యులలో ఒకడని పాఠకులకు విదితమే. ఈ ప్రదర్శనంలో Garrick చిత్రాల్లో ఒకటి తను షేక్స్పియరు విగ్రహాన్ని ఆనుకొని ఉన్నట్టు ఉంది—ఒక విధంగా ప్రక్కగా కౌగలించుకొని ఉన్నదనే చెప్పాలి. ఇది చూస్తూఉంటే ఇద్దరు మిత్రులు చెయ్యి చెయ్యి పట్టుకొని భవిష్యత్తులోకి సూటిగా చూస్తూ వర్తమానాన్ని పాదాక్రాంతం చేసిన వీర పురుషులు లాగా కన్పడుతుంది. గారిక్ Richard IIIగా నటించి 'టెంటు' సీనులో స్వప్న సన్నివేశంలో ఒక ప్రత్యేక శోభ తెప్పించాడని పేరుపొందాడు. Mecbeth గా అసమాన కీర్తి ఆర్జించాడు. ఆనాటి నటీమణులలోనే కాక ఈనాటికి ఎన్నదగిన చిన్న పట్టికలో ప్రథమ శ్రేణి తార Mrs. Siddon. ఈమె Garrickతో నటించేది. వీ రిద్దరూ కలిసి నటించిన నాటకానికి అపజయ మనేది ఎన్నడూ లేదు. ఈమె సుమారు ముప్పై సంవత్సరములు లండను నాటకరంగంలో అసమాన మేటి నటిగ ఏకచ్ఛత్రాధిపత్యం వహించింది. ఈమె చిత్రం కూడా ప్రదర్శనలో ఉంది.

మరొక చిత్రంలో Garrick తన భార్యతో సహా Shakespeare Temple మెట్లమీద నిలబడినట్లున్నది. ఈ మహానటుడికి షేక్స్పియర్ మీద మోహం చెప్పతరం కాదు. ఆయన జ్ఞాపకార్థం థేమ్సు నది ఒడ్డున Twicklurnam అనే చోట ఒక బ్రహ్మాండమైన చంద్రకాంత శిలామందిరం కట్టించి అందులో షేక్స్పియరు విగ్రహాన్ని ప్రతిష్ట చేసాడు. 1769 లో Stratford లో జరిగిన షేక్స్పియరు జూబిలీ ఉత్సవాలతో ఈయన భక్తి అంచులు తప్పిందనే చెప్పాలి. గారిక్ ఆధ్వర్యం క్రింద జరిగిన ఆనాటి ఉత్సవాలు నేటికీ విశేష కథలుగా చెప్పుకుంటారు. నాటితో షేక్స్పియరు ఒక మహాకవి లిమిటు (Limit) దాటి Garrickకు మల్లే దేశమంతటికీ ఆరాధ్యదైవ మయ్యాడు. భారీ ఎత్తున జరిగిన సన్నాహాలు వర్షం రావటంతో రభసపాలయ్యేయి. అయినా దాని ఘనత తగ్గలేదు. బాణాసంచాతో సహా ఊరేగింపులతో మూడు రోజుల ఉత్సవాలు బ్రహ్మాండంగా జరిగాయి. ఆర్థికంగా Garrickకు చాల దెబ్బ తగిలింది. ఇంచుమించుగా ఈ ఉత్సవాలకు అయిన ఖర్చు అంతా తానే



ప్రసిద్ధనటీమణి సారా సిడ్డన్
(1755–1831)

భరించాడు. కాని పెట్టిన ఖర్చు తిరిగి త్వరలోనే లండను నగరవాసులనుండి రాబట్టుకున్నాడు. Stratfordలో జరిగిన ఉత్సవాలు లండనులో Drury Lane థియేటరులో 153 పర్యాయాలు ప్రదర్శించి విపరీతమైన పైకం ఆర్జించాడు. షేక్స్పియరు వ్రాసిన నాటకాలు కూడా ఒక్క ఉమ్మడిని ఇన్ని పర్యాయాలు వరుసగా అప్పటికి ఎన్నడూ ప్రదర్శించబడలేదట.

ఇంక ఆర్ట్స్ Council వారి ప్రదర్శనం చూద్దాం. షేక్స్పియరు నాటకాలలోని ముఖ్య సన్నివేశాలను చిత్రాలుగా అనేక చిత్రకారులు వ్రాసేరు. ఆ రోజుల్లో చిత్రకారులు ప్రదర్శనం చూచి వస్తువు జ్ఞాపకం ఉంచుకొని తమ స్టూడియోలలో చిత్రాలు వ్రాసేవా రన్నమాట. ప్రదర్శనతో సంబంధంలేకుండా కొందరు నాటకాలను చదివి కొన్ని సన్నివేశాలకు ఒక రూపం యిచ్చేవారు. ఇటువంటి వాటిలో ముఖ్యంగా చెప్పదగ్గవి William Blake వ్రాసిన చిత్రాలు. ఇందులో ముఖ్యంగా Queen Katherine's Dream. ఇది Henry the eighth నాటకంలో ఒక సన్నివేశం. జాఫోనీ వంటి చిత్రకారులు ప్రదర్శంన జరుగుతూ

ఉండగా చిత్రాలు వేసేవారట. ఇవిగాక అనేక చిత్రాలు యూరప్ దేశంలోని వివిధ ప్రాంతాల కళాకారులు వ్రాసినవి ఈ ప్రదర్శనంలో ఉన్నాయి. Lady Macbeth వేషంలో Mrs Siddon చిత్రం చాల ఆకర్షణీయంగా ఉంది. ఈ ప్రదర్శనంలో ఉన్న ప్రత్యేకత ఏమిటంటే ఇక్కడ ఉన్నంతసేపూ షేక్స్పియరు నాటకాలు చదువుతున్నట్లో, రంగస్థలంమీద చూస్తున్నట్లో అనుభవిస్తాం.

బ్రిటిషు మ్యూజియంవారి ప్రదర్శనం ఈ రెండింటి కన్న భారీ ఎత్తులో ఉంది. చిత్రాలతోపాటు ఎలిజబెత్తు రాణి నాటి సాంఘిక వాతావరణాన్ని అతి చమత్కారంగా పునః సృష్టించి ప్రదర్శించారు. షేక్స్పియరుతోబాటు అతని సమకాలికు లందరి చిత్రాలు సంపాదించి ప్రదర్శించారు. Chirstopher Marlowe కూడా 1564 లో జన్మించటంవల్ల బ్రిటిష్ మ్యూజియంవారు దీనిలో మార్లో ప్రదర్శనం కూడా జత పర్చారు. ఆనాటి రచయితలందర్లోకీ చిత్రంలేని రచయిత మార్లో ఒక్కడే. అంచేత అతను ఆకార వివరాలు మనకు తెలియవు.

షేక్స్పియరు దస్తూరి ఎట్లా ఉంటుందో చెప్పటానికి వీలులేకుండా పోలేదు. ఆయన వ్రాసిన నాటకాల వ్రాత ప్రతులు దక్కకపోయినా వివిధ పరిస్థితులలో ఆయన చేసిన సంతకాలు లేకపోలేదు. అటువంటివి మొత్తం అయిదు (5) ఉన్నాయట. వాట్లో ఒకటి యీ ప్రదర్శనంలో ఉంచేరు. దానినిబట్టి ఆయన దస్తూరి చాల దర్జాగా ఉంటుందని చెప్పవచ్చు.

ఇక్కడ ప్రదర్శించిన చిత్రాలలో కూడ William Blake వ్రాసిన డ్రాయింగు లున్నాయి. ఇందులో ముఖ్యమైనది Richard III and the Ghosts. ఇక్కడ మరో విశేషం ఏమిటంటే షేక్స్పియరు నాటకాలలో ఈ దేశంలో ఇంతవరకు జరిగిన నాటక, సినిమా ప్రదర్శనలలో ముఖ్య భూమికల చిత్రాలు కూడ ప్రదర్శించారు. దొరికినకాడికి ప్రపంచంలోని వివిధ భాషలలోనికి జరిగిన తర్జుమాల కూడ స్వీకరించారు. భారతదేశంలో ఇంచుమించుగా అన్ని భాషల్లో ఈయన నాటకాలు తర్జుమా అయ్యాయి. కాని, ఒక్క వంగభాష తర్జుమా మాత్రమే ప్రదర్శనలో నాకు కనబడింది.

Garrick, Siddonలు లండను నగరాన్నే కాక యావత్తు ఇంగ్లాండు దేశాన్ని ఉర్రూత లూగిస్తున్న రోజుల్లో, భారతదేశం కొత్తగా వెళ్లిన ఆంగ్లేయులు షేక్స్పియరు



షేక్స్పియర్ నాటకాల తొలిసంపుటం (1623) కవరుపేజీమీదవున్న మహాకవి బొమ్మ

నాటకాలను ప్రదర్శించి ఉండకపోరు. గాని అవి భారతీయ భాషల్లోకి తర్జుమా కావటం గాని లేక ఆంగ్ల భాషలోనే భారతీయులు నటించటం కాని గత శతాబ్దపు ఆఖరు రోజుల్లో వరకు జరిగిఉండకపోవచ్చు. ఆనాడు బొంబాయి నగరంలో Hamlet నాటకం భారతీయులే, భారతీయ దుస్తులలో వేసిన ఒక ఘట్టం ఫొటో కూడ ప్రదర్శనంలో ఉంది. Hamlet పంచ కట్టుకొని మీసాలు లావుగా ఉండి చివర్లు సూదిగా మీదకు త్రిప్పి నాటు వస్తాదులాగా ఉన్నాడు.

ఈ ప్రదర్శనంలో మరో విశేష మేమిటంటే షేక్స్పియరు నాటకాలు ఎన్నెన్ని ప్రచురణలు ఉన్నాయో అన్నీ సంపాదించి ప్రదర్శించేరు. ఆ కాలం నుండి నేటి వరకు వ్రాయబడ్డ వ్యాఖ్యానాలు ప్రదర్శించారు. వీలైనకాడికి వివిధ శతాబ్దాలలో జరిగిన ముఖ్యనాటక ప్రదర్శనాలకు విమర్శనుల చేసిన పత్రికల ప్రతులు కూడా ఉన్నాయి. క్లుప్తంగా చెప్పాలంటే ఇక్కడ ప్రదర్శనానికి వెళ్లటం—ఒకే జీవిత కాలంలో 16, 17, 18, 19, 20 వ శతాబ్దాలలో ప్రయాణం చేసినట్లా ఉంటుంది. ఈ నాలుగు వందల ఏళ్లుగా ప్రజలు వివిధకాలాల్లో అనుభవించిన ఆనందం మూడు గంటలలో ఆనందించవచ్చు.

ఇక సాహిత్యగోష్ఠులు :

వీటి గురించి ప్రత్యేకించి వ్రాయటం కష్టం. ప్రతి సాహితీ సమితి ఒక ఉపన్యాసం ఏర్పాటు చేస్తుంది ప్రతిదినం. ఎక్కడో ఒక చోట షేక్స్పియరునుగూర్చి ఉపన్యాసం ఉండక తప్పదు. ఈ ఉపన్యాసాలు సాధారణంగా సాయంకాలాల్లో ఉంటాయి. అల్లా కాకుండా పగలు 12—2 గంటలలోగా కూడా కొందరు ఉపన్యాసాలు ఏర్పాటుచేశారు.

ఇంక పుస్తకాలు : ఈ ఉత్సవాల సందర్భంలో వెలువడినన్ని పుస్తకాలు మరి ఏ యితర రచయితపట్లా ఎన్నడూ వెలువడలేదని చెప్పకతప్పదు. పాత పుస్తకాలకు కొత్త విషయాలు చేర్చి పునర్ముద్రించారు. కొత్త ఉపోద్ఘాతాలతో కొత్త కొత్త చిత్రాలతో, అందమైన ఆకర్షణీయమైన డిజైనులతో ఎన్నో రకాల పుస్తకాలు వచ్చాయి. ఈ సందర్భంలో వచ్చిన పుస్తకాలన్నీ కొనాలంటే నేను తయారుచేసిన పట్టిక ప్రకారం రూ. 2000 —కావాలి. షేక్స్పియరు జన్మదినోత్సవం పుస్తక వ్యాపారానికి విపరీతమైన లాభాలను చేకూరుస్తున్నదనడంలో ఏమాత్రం సందేహంలేదు. ఈ వ్రాసిన పుస్తకాలు వింతగా కనబడతాయి. షేక్స్పియరు ఎవరు ? అని ఒకాయన వ్రాస్తే అతను తన పద్యాలను అంకితం చేసిన మిత్రుడెవరు ? అని మరొకరు. షేక్స్పియరు నాటి ఇంగ్లాండు మీద ఒకరు వ్రాస్తే, షేక్స్పియరు దైనందిన జీవితం అని మరొకరు. వీటిలో మూడొంతులు ముప్పాతిక వారివారి ఊహలే.

షేక్స్పియరు కేవలం వైజ్ఞానిక రంగాలలో కాకుండా వాణిజ్యరంగాలలో కూడా రాణిస్తున్నాడు. బజారులో ప్రతి ఒక్క వస్తువుమీద షేక్స్పియరు ముద్ర తప్పనిసరిగ కన్పిస్తుంది. షేక్స్పియరు కలాలు : షేక్స్పియరు సిరాలు, షేక్స్పియరు పేరిట లేని వస్తువులే లేవు.

షేక్స్పియరు ఉత్సవాలు ఆయన జన్మస్థలమయిన stratford లో చాల వైభవంగా జరుగుతున్నాయట. వెళ్లాలని ఎంత ఉబలాటంగా ఉన్నా వెళ్లేందుకు ధైర్యం చాలటం లేదు. ఉన్న హొటళ్లు అన్నీ ఆరునెలలు ముందుగానే ఆరునెలల వరకు Book అయి పొయ్యాయట. అదిగాక అడుగడుగునా ఏదో పేరుచెప్పి యాత్రికులనుండి సొమ్ము లాగుతున్నారని చాల రిపోర్టులు కూడ వస్తున్నాయి. మన పుణ్యక్షేత్రాలలోని పంథాలను మనం నిందించవలసిన అగత్యంలేదు.



# కృత్యాద్యవస్థ

శ్రీ అంబటిపూడి పురుషోత్తం

నా మనమ్మున పొంగు ఎనలేని భావములు
జలధి వీచికా జాలమ్ములవలె చెలియలి కట్టతాకి
శకలమై, వికలమై, రూపవిహీనమై పోవు.

నా మనోవీథి నుద్భవించు భావ సౌరభములు
విశ్వహృది నానందడోలాందోళనము చేయ;
తాదాత్మ్యమును పొంద; యోగసమాధి మునుగ కాంక్షించు.

కాని వాయు శ్లథిత పల్లవములవోలె త్రెళ్లిపడి
మింటికెగసి, దారితెన్ను లేక ఎచటనో పతనమై
ధూళికలసి, సౌందర్యాకృతిని బాసి, నిరాకృతినిబొంది
నాతోడి బంధమును త్రెంచుకొని పోవు—

ఒకచో నాహృది నవోదిత కోమల పద్మాకరమ్ము
వేయి భృంగములు మృదులమంజులగానమ్ము సేయు.
కాని నా ఎదలోని పద్మములు తరుణభాస్కర దీప్తి
సోకకుండెడి యామినీ సుమగణమ్ము—

నామది ఒక విద్యుద్ఘటమ్ము; అందలిభావసంపద
శక్తి సంకులమ్ము; నిరంతర ప్రయాణము చేయ
నిచ్చగించు; ప్రతి అణువు నకు దైవత్వమా పాదింప ఆరాటపడు;

కాని నిబిడనిగూఢ కర్కశత్వమేదో నామది నిరోధించి
నన్నజ్ఞాన బంధురుని చేయు—

శివపార్వతుల-తొలిచూపులో ఒరసిన
మన్మథభావములు-వందలు వేలు గా
నాహృదిని వేణుగానమ్ము సేయు

కాని. త్రినేత్రుని నుండి వెడలిన
అగ్నిజ్వాలికలకు. ఆహుతియైపోవు.

---

BI-TFN-7 TEL



అలసట పోయి
హుషారు కలగాలంటే...

మీరూ అంగీకరిస్తారు

# టాటా-ఫిన్లే
# టీ

సాటిలేని టీ!

టాటా-ఫిన్లే టీ కంటె తృప్తికరమైనదేముంది! ఇందుకు కారణాలు:—

## తాజా టీ

తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

## పరిమళమైన టీ

అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

## ఉత్తమ టీ

టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** టీ త్రాగండి; ఆనందము అందుకోండి!



ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్—సుందరమైన టిన్
లలిత్-బంగారు రంగు ప్యాకెట్
మిలాప్—వెండి రంగు ప్యాకెట్
బహదూర్-నారింజ రంగు ప్యాకెట్
షాన్—పీలి రంగు ప్యాకెట్



# నన్నెచోడుని కవిత్వము

శ్రీ నిడుదవోలు వేంకటరావు

నేటికే బదియా రేండ్ల నుండి నన్నెచోడుని కుమారసంభవ మును గూర్చి అతని కాలమును గూర్చి యాంధ్రసాహితీ ప్రపంచమున చర్చలు సాగుచున్నవి. ఇక పాఠభేద విమర్శ నము నాటియుండి యున్నదే—చాలకాలము వరకు కాల నిర్ణ యమును గూర్చి వాద ప్రతివాదములు జరిగినవి. ఈ తరు వాత కావ్య విమర్శన ప్రారంభమైనది—వ్యాసములు గ్రంథ ములు వెలువడినవి, కాని కావ్యతత్త్వము కవితా తత్త్వము సమగ్రముగా విశదీకరించు ప్రామాణిక గ్రంథ మింతవ కును వెలువడలేదు. దీనికి కారణము. మన దృష్టి యంతయు గ్రంథముయొక్క సాహితి విశేషముమీదనే గాని, యా కావ్య రచనకు మూలాధారమైన, శైవమత దృక్పథము మీద లేదు. కుమారసంభవము మహాకావ్యము కూలంకషముగ నీ దృష్టితో పరిశీలించిన, కాల నిర్ణయాది విషయములే గాక, కావ్య తత్త్వము ప్రస్ఫుటమగును. ఈనాడు కుమారసంభవముపై కొన్ని గ్రంథములు బయలువెడలినవి. కాని, వాని దృష్టి గ్రంథముయొక్క బహిరంగ పరీక్షయందే—గ్రంథస్థ విషయ ములకు ప్రాధాన్యము లేదు—వానియందైన చారిత్రక సాహిత్య విపర్యాసములు మత విషయిక విరుద్ధాంశములు పెక్కు కన్పట్టుచున్నవి. అట్టి గ్రంథములలో నొకటి యగు "నన్నెచోడుని కవిత్వము" అను గ్రంథమును విమర్శించుటయే యీ వ్యాసోద్దేశము. గ్రంథకర్త శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రి.

ఈ గ్రంథమున నన్నెచోడ కవికాల నిర్ణయమును మడికి సింగన కాల నిర్ణయము ననుసరించి చేయబడినది. ఈ సంద ర్భమున గ్రంథకర్త సందిగ్ధముగ నున్న నన్నెచోడకవి కాలమ్ము నకు, మడికి సింగన కాల మొక హద్దుగా నిర్ణయించు కొన్నాడు. ఆ మడికి సింగన కాలమునైన సరిగా గ్రహింపక నెంత ప్రమాదిక రచనను గాంచినాడో యీ క్రింది వివర మును బట్టి తెలియనగును—ఈ క్రింది దంతయు గ్రంథము నుండి యుదాహరింపబడినది.

"నన్నెచోడుని కాల నిర్ణయము" శీర్షిక

"ఇంతవరకు చేసిన చర్చచేత తేలిన సారాంశము—నన్నెచోడుడు

1. శాసనాధారములచేత దొరకడు. శాసనములే విధిలేక గ్రహించినను, నన్నయకు పూర్వుడు కాడు. అనంతరుడు—

2. షష్ఠ్యంత రచనచేత తిక్కన కేతనల కనంతరుడు.

3. సప్త సంతానములు పేర్కొనుటచే మంచన కనంతరుడు.

4. అష్టాదశ వర్ణనలను చెప్పుటచేత పాల్కురికి సోమ నాథ విద్యానాథ చక్రవర్తులకు సమీప వర్తియో ? అనంతరుడో.

5. కృతి ప్రారంభ కర్తవ్యములు ఈతనియందు సంపూర్ణ స్వరూపమును పొందినందున కూడ పాల్కురికి సోమ నాథునికి ఎఱ్ఱాప్రెగ్గడకు నడిమివాడు—

6. చిత్ర కవిత్వమును ప్రబంధమున ప్రవేశపెట్టినందు చేత గూడ యీ కాలమునకు ముందు పోడు. తర్వాతివాడే యగును.

నన్నెచోడుని కాలమును ఇంతకు తర్వాత కొనిపో దగునా రాదా యను ప్రశ్నకు సమాధానము కుదరకున్నది. క్రీ. శ. 1340 లేక 1323 లేక 1300 ఈమధ్య కుదు రునా లేక 1350 కి తర్వాత కుదురునా అను ప్రశ్నకు ఈవలి హద్దు నొకవిధముగా కుదుర్చుకొనవచ్చును. తిక్కన సోమ యాజి కుమారుని దౌహిత్రుడైన మడికి సింగన తన సకల నీతి సమ్మతమున నన్నెచోడుని కుమారసంభవము నుండి పద్య ముల నుదాహరించి యున్నాడు. సకల నీతి సమ్మత రచనా

కాలము నిర్ణయించితిమేని అంతకు కొంత పూర్వ మనుట తేలును—మానవల్లి రామకృష్ణ కవిగారు సకల నీతి సమ్మతముయొక్క పీఠికలో నిట్లు వ్రాసినారు.

(ఆంధ్రపత్రిక ముద్రణము—1923).

1 " మడికి సింగన యుండిన కాలము, పద్మపురాణ రచనాకాలము. పద్మపురాణ రచనా కాలము తెలిసినందున జిక్కులులేక విస్పష్ట మగుచున్నది.

ఆకర యుగానల మృగాంకశక వత్సరము
లై పరగు శార్వరిని బుణ్య
ప్రాకటిత మార్గశిర పంచమిని బొల్చునుడు
పాలసుత వాసరమునందున్
శ్రీకరముగా మడికి సింగన దెనుంగు న ర
చించెదగు బద్మను పురాణం
బా కమలమిత్ర శశిరాంశువుగఁ గంద సచి
వాగ్రణికి మంగళ మహాశ్రీ

అనగా శాలివాహనశక వర్షములు 1342 లకు సరియైన క్రీ. శ. 1420 సంవత్సరమునఁ బద్మపురాణము రచింపఁబడియె" కొన్ని వ్రాత ప్రతులలో నీ పద్యము లేనందున నిది అనంతర లేఖక రచితమని కొందఱు తలంచుచున్నారు. ఒక కాగితపు ప్రతిలో తప్ప మ రెందును గానరాదు. మడికి సింగన తొయ్యేటి అనపోత భూపాలునకు ఆశ్రితుడు—అనపోత భూపాలుడు కాపయ నాయకునికి పినతండ్రి కుమారుడు. ఇతనిది క్రీ. శ. 1347 నాటిది ద్రాక్షారామమున శాసనము గలదు (S. I. I. IV 1294) కావున మడికి సింగనయు అప్పటివాడు కావలయును. 'నన్నెచోడుడు తత్పూర్వుడు." (పుటలు 81, 82)

పైని యుదాహరింపబడిన గ్రంథ భాగమున మొదట నున్న యాఱు అంశములను విడిచి—మనకు ప్రస్తుతమైన మడికి సింగన కాలమును గూర్చి—చర్చింతును. మానవల్లివారు పద్మపురాణ రచనా కాలము క్రీ. శ. 1420. అదియే మడికి సింగన కాలము అని నిర్ణయింపగా గ్రంథకర్త—మడికి సింగన కాలము క్రీ. శ. 1347 అని నిర్ణయించెను.

ఈ సందర్భమున గ్రంథకర్త మడికి సింగన గ్రంథముల నైన సరిగా చూడక నెట్టి ప్రమాదము పాలయ్యెనో చూడుడు. మొదట—"తిక్కన సోమయాజి కుమారుని దౌహిత్రుడైన మడికి సింగన" అను వాక్యము దీసికొందము—దీనినిబట్టి సింగన తిక్కన సోమయాజి మనుమరాలి కొడుకు అని గదా యర్థము—అప్పుడు గ్రంథకర్త ననుసరించి వంశక్రమ మిట్లుండవలెను.

తిక్కన సోమయాజి
|
కుమారుడు (కొమ్మమ)
|
కొమార్తె (చిట్టాంబిక)
|
కుమారుడు—దౌహిత్రుడు—మడికి సింగన

అనగా తిక్కన సోమయాజి మనుమరాలి కొడుకు, కుమారుని దౌహిత్రుడు—మడికి సింగన కావలెను—కాని సింగన జ్ఞాన వాసిష్ఠ రామాయణమున,2 తా నిచ్చిన వంశక్రమము చూచినచో పై వ్రాత యెంత యప్రామాణికమో తెలియగలదు. అందు నిచ్చిన వంశక్రమము—22 నుండి 36 వఱకు 14 పద్యములలో నిట్లున్నది.

భారద్వాజ గోత్రము.
బ్రహ్మన
గుండన—కొమ్మాంబ

1. అల్లాడ మంత్రి—భార్య చిట్టాంబిక—
గంగన (ఈమె తిక్కనసోమయాజి పుత్రుడు కొమ్మన కూతురు.

2. అయ్యనమంత్రి—సింగాంబ — ఈతడు కొమ్మన దౌహిత్రుడు.

3. సింగన ఈతడు సకల నీతి సమ్మత కృతికర్త. | అనంతుడు | ఓబయ | నారయ

పై వంశ వృక్షమున—తిక్కన కుమారుని దుహితను—(కొమార్తెను) పెండ్లియాడినవాడు— 1 అల్లాడ మంత్రి యనియు నాతని కొమారుడు. 2. అయ్యలు మంత్రి అయియున్నారు. కాగా తిక్కన కుమారుని దౌహిత్రు డయ్యలు మంత్రిగాని సింగనకాదు. కాని మన గ్రంథకర్త 3. అయ్యలు మంత్రి మాటయే విస్మరించి మడికి సింగనయే తిక్కన కుమారుని దౌహిత్రుడని వ్రాసియున్నాడు. పై వంశ క్రమమును బట్టి—మడికి సింగన తిక్కన కుమారుని దౌహిత్రుడు గాక —దౌహిత్రుని కుమారు డగుచున్నాడు. అనగా, మడికి సింగన

1. " " ఇవి కవిగారి వాక్యములు—

2. ఇది వేదము వెంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్‌వారు ప్రకటించినదే—ముద్రణము 1935.

తిక్కన కుమారుడగు కొమ్మన కుమార్తె మనుమడుగాని, గ్రంథకర్త తలచినట్లు కొడుకుగాదు—ఈ విషయము నిర్ధారించుటకు సింగన వాసిష్ఠ రామాయణమునుండి వలసిన పద్యముల భాగములు నుదహరించుచున్నాను—

1. జలజాక్షునాభి—బ్రహ్మ—భారద్వాజుడు—బ్రహ్మన క్రమముగా గలిగిరి.

2. బ్రహ్మనకు—గుండనార్యుడు పుట్టెను.

3. క. అంబుజ భవనిభుఁ డాప
స్తంబాగ్రణియైన గుండ సచివునకును గొ
మ్మాంబకుఁ బుట్టెను బుత్త్రుయు
గం బొగి నల్లాడ విభుఁడు గంగన యనగన్ (26)

అందు— (27)

క. అల్లాడ మంత్రి రిపుచయ
మల్లాడఁ బ్రతాప లీల నధికుండై సం
ఫుల్లసిత కీర్తిమల్లీ
వల్లీ వేల్లిత దిగంత వారణుఁడయ్యెన్ (28)

గీ. అతడు తిక్కన సోమయాజుల పుత్రుడై
కొమరారు గుంటూరి కొమ్మ విభుని
పుత్ర చిట్టాంబిక బుధలోక కల్పక
వల్లి వివాహమై వైభవమున—
భూసారమగు కోట భూమిఁ గృష్ణానది
దక్షిణ తటమున ధన్యలీల
నలరు రావెల యను నగ్రహారము తన
కేక భోగ్యమ్ముగా నేలుచుండి

గీ. యంథుఁ గోవెల గట్టి గోవిందు వెన్న
గోపీనాథుని బ్రతిష్ఠ గోరి చేసి
నఖిల విభవంబులందున నతిశయిల్లె
మనుజ మందారు డల్లాడ మంత్రివిభుడు (29)

క. అయ్యువతీ రమణులకును
నయ్యల మంత్రీంద్రుఁడు దితుఁడై ధారుణిలో
నెయ్యెడ నర్థార్థులు మా
యయ్యా యనుచు బొగడ నెగడె నౌదార్యమునన్ (30)

దీనినిబట్టి అల్లాడ మంత్రికి—చిట్టాంబికకు బుట్టిన వాడు అయ్యలు మంత్రి కాని సింగన కాడు.

ఇచట ముద్రితప్రతి 6 వ పుటలో—

సీ. అతడు తిక్కన సోమయాజుల పౌత్రుఁడై
కొమరారు గుంటూరి కొమ్మ విభుని."

అని మూలమున ముద్రితమై—పుట యడుగున—పా. పుత్త్రుడై అని కలదు—పుత్త్రుడని పాఠాంతరము క్రింద చూపఁబడినది. కాని పుత్త్రు డనునదే సరియైన పాఠము. తిక్కనకు కొమ్మన పుత్త్రుడే గాని పౌత్రుడు గాడు—సింగన తండ్రి తరమును గ్రంథకర్త మఱచుటచేత, సింగన కాల మొక తరము వెనుకకు తరలినది.

## 2

ఇక "మడికి సింగన తొయ్యేటి అనపోత భూపాలుని కాశ్రితుఁడు" అను వాక్యము విచారింతము. ఇదియును పై వంశక్రమమును పరిశీలింపక వ్రాసినదే—తొయ్యేటి అనపోత భూపాలుని యొద్ద నున్నది—మడికి సింగన తండ్రియైన—అయ్యలు మంత్రిగాని, మడికి సింగన యెంతమాత్రమును గాడు—చూడుడీ క్రింది పద్యము—

పైని నేనుదాహరించిన అయ్యువతీరమణులకును—(అనగా అల్లాడ మంత్రి చిట్టాంబికలకు) అయ్యలు మంత్రి యుదయించెనను పద్యమునకు క్రింద నీ పద్యము గలదు.

చ. తిరుగని మందారాచలము త్రిమ్మటఁ బొందని భాను డుగ్గుచే
గరగని కాముఁడమ్మ మొనగ్రాఁ గని వారధి యన్య కాంతది
క్కరుగని నిర్జరేంద్రుఁ డెడరైనను బొంకని ధర్మసూతి న్యా
బరఁగె ధరిత్రి నర్థి జన భానుజుఁ డయ్యలుమంత్రి పెంపునన్ 32.

సీ. అత్రేయ గోత్ర పవిత్ర పేరయ మంత్రి
పుత్రి సింగాంబిక పుణ్యసాధ్వి
వెలయ వివాహమై వేంగి దేశంబులో
నేపారు రాజమహేంద్రపురికి
నధిపతి తొయ్యేటి యనపోత భూపాలు
మంత్రియై ప్రాజ్య సంపదలఁ బొదవి
యొప్పార గౌతమి యుత్తర తట మున
మహనీయమగు పెద్ద మనికి యందు

గీ. స్థిరత రారామతతులు సుక్షేత్రములును
బెక్కు లార్జించి సితకీర్తిఁ బెంపు మిగిలి
యఖిల జగదన్నదాత నా నవని బరఁగె
మనుజ గుణధుర్యుఁ డయ్యలమంత్రి వరుడు.

చ. ఒనరఁగ దద్వధూవరుల హెూబిల దేవుల గొల్చిఁ దద్వరం

బున నొగి సింగనార్యుని నమోఘ గుణాఢ్యు ననంత సీమహీ
జననుతు నోబయాంకు బుధ సన్నుతి పాత్రుని నార యాహ్వయున్
గని నరసింహనామముల గారవ మారఁగఁ బెట్టి రందఱున్

క. వారలలో నగ్రజుఁడను
వారిజ దళనయన చరణ వారిజరేఖా
సారమతి నుతుల వాక్య
శ్రీ రచనా చతురమతిని సింగాహ్వయుఁడన్.

పై పద్యములనుబట్టి స్పష్టముగా, తొయ్యేటి అనపోత భూపాలుని మంత్రి సింగన తండ్రి అయ్యలుమంత్రి యనియు, నాతడు 'పెద్ద మడికి' తన నివాసముగా చేసికొనుట చేతను సింగన ³మడికి సింగన యని వ్యవహృతు డయ్యెననియు విశదమగుచున్నది. దీనివలన—సింగన, అనపోత భూపాలుని కాలమువాడు కాకపోగా—అనగా క్రీ. శ. 1347 వాడు కాకపోగా ఆ వెనుక నొక తరమువాడు—అనగా క్రీ. శ. 1377 ప్రాంతము వాడగుచున్నాడు.

ఒకప్పుడైన సింగన, తండ్రి తరువాత, తొయ్యేటి అనపోత భూపాలుని యాస్థానమున నున్న వాడను నూహకైన నాధారము లేకుండ, తానే, పై పద్యముల వెనుక నిట్లు చెప్పుకొన్నాడు.

క. కూనయముప్ప నృపాలక
సూను శ్రీ తెనుగు నృపతి సుదతీ మల్లాం
బా నందనుడగు ముప్పయ
భూనాథుని సుకవివరుడ బుధసన్నుతుడన్ (36)

ముప్పరాజు గోదావరీ మండలమున సబ్బిసాయిర మండలము అను సబ్బినాటిని పరిపాలించుచుండెనని పద్మపురాణోత్తర ఖండమునుండి యీ క్రింది వాక్యముల వలన దెలియుచున్నది.

ముప్ప భూపతి "ముత్త భూపాలుండు దనకు సహాయుండుగా గౌతమీ దక్షిణంబునం బరమ పావనంబగు సబ్బినాటి రాష్ట్రంబున—³'రామగిరి పట్టణంబు నిజరాజధానిగా రాజ్యంబు సేయుచు"—ప్రథమాశ్వాసము 21 వచనము. ఈ ముప్ప భూపతి మంత్రి కందనామాత్యుడు. అతనికే పద్మపురాణము కృతి—

పై సందర్భమును పరిశీలింపగా, యయ్యలు మంత్రికి ప్రభువగు అనపోత భూపాలునికి, మడికి సింగనకు నేమాత్రము సంబంధము లేదనుట నిశ్చితము—ఆతడు తండ్రి యనంతరము మడికియందే నివసించి, ముప్ప భూపాలుని కవిగా ప్రసిద్ధికెక్కెను.

సింగన కాలమును గూర్చిన పై యంశములన్నియు సమాలోచించియే, యాతని కాలము క్రీ. శ. 1430 వఱకునై యుండునని, ⁴పద్మపురాణ రచనా కాలము క్రీ. శ. 1420 అగుట సరియే యని వాఙ్మయ చరిత్రకారు లంగీకరించిరి. ప్రస్తుత గ్రంథకర్త సింగన కాల నిర్ణయము తారుమారు చేసినపుడు—నన్నెచోడడు క్రీ. శ. 1430 కి ముందువాడగుననియే చెప్పనగును గాని క్రీ. శ. 1347 కి ముందు వాడని యెట్లు చెప్పగలరు ?

ఒక కవికాల నిర్ణయము కొఱకు మఱియొక కవికాల నిర్ణయము హద్దుగా గొని, ఆ హద్దుగా గొన్న కవి కాలము సరిగా గ్రహింపనిచో నెట్టి ప్రమాదము గల్గునో చూపుటకు పై భాగ మొక యుదాహరణ కాగలదు.

## 3

నన్నెచోడుని కాల నిర్ణయము" అను ప్రకరణమున 17. పుట లున్నవి. అందు ప్రథమ ద్వితీయ పుటలలో భాగములు ముం దుదాహృతమైనవి. ఇక తక్కిన పుటలలోనైన శీర్షిక కనుగుణముగా, నిదమిద్ధముగ నొక 'నిర్ణయ పద్ధతి' లేదు. అన్నియు సందేహములతో నిండియున్నవి. అసలు నన్నెచోడని కాలమే నిర్వివాదముగా నేర్పడలేదు— అయిన నీ వరకు వ్రాసిన వారొక సక్రమ పద్ధతి ననుసరించి కాలనిర్ణయమును గూర్చి తమ యభిప్రాయములు దెలుపగా ప్రస్తుత గ్రంథకర్త ఏ క్రమమును లేక, నిదివరకు సందిగ్ధముగానున్న దాని నయోమయముగా నొనర్చియున్నాడు. గ్రంథమునందే ఒకచోట నిచ్చినదానికి వేరొకచోట నిచ్చిన దానికి విరుద్ధముగా నున్నది. ఈ కాల నిర్ణయపు తీరెట్లు నడచినదో నుదాహరణ పూర్వకముగా జూపుచున్నాను.

ఇంతకు పూర్వము కొందరు విమర్శకులు, సాహిత్య చరిత్రకారులు నన్నెచోడకవి, నన్నయ తిక్కనలకు నడిమి వాడనియు,

---

3. కీ. శే. గురుజాడ శ్రీరామమూర్తిగారు, తమ కవి జీవితములో సింగనను గూర్చి వ్రాసినపుడు 'రామగిరి' సింగన యని వ్రాసిరి.

4. "సకల నీతి సమ్మతమున పద్మ పురాణము నుండికూడ పద్యములు గ్రహింపబడినవి. పద్మ పురాణానంతరమే రచితమై యుండును" అని యీ విషయము గ్రంథకర్తయే యంగీకరించి యున్నాడు. (పుట—82)

తిక్కనకు తర్వాతివాడనియు నొక నిర్ణయమునకు రాగా, ప్రస్తుత గ్రంథకర్త, తానేమో సూక్ష్మ పరిశోధనచేసి, నన్నెచోడకవి కాలనిర్ణయము చేసినట్లుగా నిట్లు వ్రాసియున్నాడు.

పుట. 16. "కవిత్రయమునకు తర్వాతి వాడా లేక కవి ద్వయమునకు తర్వాతివాడా యను శంక కలుగక మానదు."

228. "కవిత్రయానంతరుడు కాడుగాని కవిద్వయా నంతరుండై ఇతిహాస పురాణ కవిత్వ కాలమునకును ప్రబంధ కవిత కాలమునకు సంబంధి కాలమునుండి ప్రబంధ రచనకు దారి తీసినాడు— రెండు మార్గములకు వంతెనవంటి వాడు" ఇతనికి తర్వాతివాడే యైనను, భారత కవుల ధోరణిలోబడి పూర్వ మార్గమునను సరించి ఎఱ్ఱాప్రెగ్గడ ప్రమాణ పదవినందినాడు. తిక్కన ఎఱ్ఱనల నడిమివాడే యైనను నూతన పథాను వర్తియై భిన్న కావ్య ధోరణిం ద్రొక్కి ఈతడు ప్రబంధ మార్గమున తేజరిల్లినాడు—"

ఈ సందర్భమున నన్నెచోడకవి భిన్న కావ్య ధోరణి విం ద్రొక్కుట "యేమో కాని, విమర్శనకర్త మాత్రము విప రీత ధోరణిం ద్రొక్కి తన చారిత్రిక సాహిత్యానభిజ్ఞత వెల్ల డించినాడనుట విస్పష్టము—

కవిత్రయమనగా, నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు. మనకు కవిత్రయ సంప్రదాయమేగాని, 'కవిద్వయ' సంప్రదాయమున్నదా? ఇది ఒక నూతన సృష్టి— పై భాగమునను సరించి నన్నయ తిక్కనలకు, ఎఱ్ఱనకు, మధ్య చాలా కాలముగాక పోయినను కొంత కాలమైనను గడచి యుండవలెనుగదా. అట్టి వ్యవధి యున్నదా? నేటి వాఙ్మయ చరిత్రలననుసరించి. తిక్కన క్రీ.శ. 1210—1300 మధ్య వాడనియు—ఎఱ్ఱన—క్రీ.శ. 1280—1340 ప్రాంతము వాడనియు సప్రమాణముగా నిరూపితమైనది. అట్టియెడల తిక్కన ఎఱ్ఱనల నడుమ కాల వ్యవధియుండుననుట గంధర్వ నగరము వంటిది. ఇంతకన్న విడ్డూరమైనది— మఱి యొకటి తిక్కన యెఱ్ఱనల మధ్య కాలము సంధికాలమట! తిక్కన కాలము ఇతిహాస పురాణ కవిత్వ కాలమట. ఎఱ్ఱన కాలము ప్రబంధ కవిత కాలమట! ఇది యేవాఙ్మయ సాహిత్య చరిత్ర కారులు కాదుగదా ఆంధ్ర వాఙ్మయ చరిత్రమందేపాటి పరి జ్ఞానము గలవారైనను అంగీకరింపరు—అసలు 6 తిక్కనల యెఱ్ర నల నడుమ కాల వ్యవధియే లేనప్పుడు ప్రబంధ రచనకు నన్నె చోడుడు దారి తీయుటేమి?— వంతెన కట్టుటయేమి, అది సంధికాలము అగుట యేమి? ఇది కేవలము కల్పితము— ఇందేమఱి రెండు వాక్యములు— ఇతనికి తర్వాతివాడే యైనను ......ఎఱ్ఱాప్రెగ్గడ—"తిక్కన ఎఱ్రనల నడిమివాడే' యైన" అనునవియు నిరాధారములు నిష్ప్రమాణములై యున్నవి.

ఇదివరలో చారిత్రిక ప్రసిద్ధములైన— సాహిత్య చరిత్రల కెక్కిన విషయములను వీరెట్లు తార్మారు గావించిరో చూడుడు—

పుట 27. "భారత రచనా కాలమునకు మనుమసిద్ధి లేడు— ముత్తుకూరి కడ క్రీ.శ.1261 లో పాండ్యులతోడ రంగమున హతుడయ్యెను." ఇది ఎంతమాత్రము సరికాదు. మనుమసిద్ధి క్రీ.శ. 1291 వరకు జీవించియున్నట్లు శాసన నిదర్శనమున్నది. (8ii VI 240)

Manumaganda gopalas reign ended and he was suceeded by his grand son Manmasiddi III.

Manmasiddhi Vjayagandagopala died. He was also a great patron of Telugu literature The famous Telugu poet Tikkana somayaji who translated 15 parvas of the Mahabharata was patronised by him. He wrote Nirvachanothara ramayanam and dedicated it to Manumasiddhi.

Andhra chronology—P. 73. sir V. Ramesam. (1946)

పుట 31. "కేతన గ్రంథము 7నిర్వచ నోత్తర రామా యణ భారతముల నడిమి కాలమున మనుమసిద్ధి సజీవుడై ఉండగా అనగా క్రీ.శ. 1261 ముందే రచితము అని. నిర్వచనో త్తర రామాయణము కన్న అంకిత షష్ఠ్యంతాదుల చేతను చారి త్రక విషయముల చేతను దశ కుమారము తర్వాతిది. ఈ రెం డును కాకతి గణపతి దండ యాత్రకు ముందువి. గణపతి రాకకు కారణము రాజకీయ కల్లోలములే. గణపతి క్రీ.శ. 1246 ప్రాంతమున కంచివరకు వచ్చెనని చెప్పుటకు కొన్ని నిదర్శ నములున్నవి. అందుచేతనే రెండు గ్రంథములును అంతకు పూర్వమే రచితములై ఉండవలెనుగదా! మనుమసిద్ధి మరణానం తరము ఆంధ్ర భారత రచన ప్రారంభమై యుండును"—

ఇందు మూడు విషయములు ప్రతిపాదితమైనవి. మూడు నసంబద్ధములే— పరస్పర విరుద్ధములు.

---

5. గ్రంథకర్త ననుసరించి యెఱ్ఱన కాలము క్రీ. శ. 1330—1340 మాత్రమే చూడుడు పుట 78.

6. పరిశోధన — ఫిబ్రవరి — మార్చి 1956లో— ఎఱ్ఱన హరివంశ రచనా కాలము—అను వ్యాసమున నీ విష యము— సప్రమాణముగా చర్చించివారి కాల నిర్ణయములు చేయబడియున్నవి— (చూ. పుటలు 1—17)

7. 'ఇది తిక్కన ఉత్తర రామాయణమని ఉండవలెనని క్రిందటి నెల భారతిలో ప్రతిపాదించితిని'.

# నన్నెచోడుని కవిత్వము

1. కేతన దశకుమార చరిత్ర—క్రీ. శ. 1261కి ముందే రచితము.

2. అధితిక్కన నిర్వచనోత్తర రామాయణము తరువాతిది.

3. ఈ రెండును— క్రీ.శ. 1246కు ముందే రచితములు—

పైవానిని బట్టి దశకుమార చరిత్రమునకు ముందే నిర్వచనోత్తర రామాయణము రచితమయ్యెననిగదా తేలుచున్నది. కాని కేతన దశకుమార చరిత్రలో నిర్వచనోత్తర రామాయణప్రస్తావనయే లేదే! — ఇక నిర్వచనోత్తర రామాయణము వంటి కృతి సంకితముగాగొన్నచో కేతన దానిని గూర్చి చెప్పియే యుండునుగదా — అట్టిదేదియు నాతడు స్పష్టపరుపలేదు' "కృతులు రచింపగ సుకవుల కృతు లొప్పగగొనగ," అనియు—లలిత నానా కావ్యములు సెప్పును భయ భాషలయందు అనియు సామాన్యముగా జెప్పినాడేగాని, ప్రత్యేకించి యొక్కదానినైన పేర్కొనలేదు. వాస్తవముగా నిర్వచనోత్తర రామాయణము దశకుమార చరిత్రముందటిది ఎంత మాత్రమును గాదు. నిర్వచనోత్తర రామాయణమునందలి చారిత్ర కాంశములనుబట్టి— ఆ కృతిరచనము క్రీ.శ. 1268 ప్రాంతమని చారిత్రకులు నిర్ణయించి యున్నారు.8 దీనినిబట్టి మొదటి రెండును నప్రాస్తములైనవి. ఏలననగా గ్రంథకర్తయే షష్ఠ్యంతాది చారిత్రక విషయములచేతను దశకుమార చరిత్ర తర్వాతిది యని వ్రాసెను. అప్పుడు దశకుమార చరిత్ర రచన కాలము, గ్రంథకర్త ననుసరించి— క్రీ.శ.1268 తర్వాత కావలయును గదా..

మొదటి రెండింటిని మించినది మూడవది. ఈ రెండును, క్రీ.శ. 1246కు ముందే రచితములట. ఈ రెండు ననగా నిర్వచనోత్తర రామాయణ దశకుమార చరిత్రలు రెండును— మనుమసిద్ధి కాలముననే రచితములై ఉండవలెననుటకు—"మనుసిద్ధి సజీవుడై యుండగా" అను గ్రంథకర్త మాటయే మనకు ప్రమాణము. ఆ కాలమున మనుమసిద్ధి సజీవుడై ఉండుటయేగాక రాజ్యమును పరిపాలించుచున్నాడు—

కాని క్రీ.శ. 1246లో మనుమసిద్ధి రాజ్యము పరిపాలించుచున్నాడా అను విషయము గ్రంథకర్త విచారించలేదు. క్రీ.శ. 1246లో మనుమసిద్ధి రాజ్య పాలకుడుగాడు. ఆతని తండ్రి తిక్కరాజు పరిపాలించుచున్నాడు. మనుమసిద్ధి— తండ్రి మరణానంతరము క్రీ.శ. 1250లో సింహాసన మెక్కెను. ఇది శాసన ప్రమాణముచే నిర్ధారితమైనది. (437, 1911. B r V. 520, 595 – Andhra Chronology P. 71), మొత్తము మీద నీ రెండు గ్రంథముల రచనా కాలమేదో స్పష్టముగ నిరూపితముకాలేదు.

దేశ చరిత్రకు వాఙ్మయ చరిత్రకు నవినా భావ సంబంధము. గ్రంథకర్త ఈ పట్టున తెలుగు చోళుల చరిత్ర ముఖముగా మనుమసిద్ధి చరిత్ర సరిగా పరిశీలింపక పోవుటవలన అతడు క్రీ.శ. 1261లోనే మరిణించెనను, నూహ నాధారముచేసికొని రచన సాగించుటచే, నిట్టి విపర్యాసములు దొరలినవి.

ఈ దశకుమార చరిత్ర రచనా సందర్భముననే గ్రంథకర్త వ్రాసిన మరియొక పట్టు నుదాహరించినచో నాతడొక పట్టున వ్రాసిన దానిని మరియొక పట్టున, విరుద్ధముగా నున్నదని,, చూచికొనలేదని స్పష్టమగుచున్నది.

పుట 22, 23

"తిక్కనకు" భారత రచననాటికి షష్ఠ్యంతములు స్ఫురించినవి.........ఒక్క యారాధన విశేషంబగుటజేసి ఐదు షష్ఠ్యంత కంద పద్యములతో ప్రారంభించి..... మరల నీ భారతమును ప్రబంధ మండలి పేర్కొనెను.......

ఈయనకు సమకాలికుడైన కేతనయు షష్ఠ్యంత రచన గావించియున్నాడు. సరిగానే యున్నది. సమకాలికులొకరిని చూచి యొకరు నేర్చుకొందురుగదా. కేతన దశకుమార చరిత్రము తిక్కనకే యంకితము— ఈయన యంకిత షష్ఠ్యంత పద్యములు పదునొకొండు వ్రాసినాడు. తిక్కన యైదు పద్యములు పదునొకండుగా పెరిగినవనుట సమంజసముగానే గన్పట్టునుగదా"

దీనినిబట్టి ఐదు షష్ఠ్యంత కందపద్యములున్న తిక్కన భారతమే— మొదట రచింపబడినదనియు, నా వెనుక కేతన దానిని పదునొకండుగా రచించెననియు స్పష్టముగదా!— ఇది యెంత యూపాతరమణీయమగు వ్రాతయో చూడుడు.

దశకుమార నిర్వచనోత్తర రామాయణములు భారత రచనకు ముందు ననగా క్రీ.శ. 1261కి ముందుగా రచితములైవి యని యొకమారును, నా వెనుక క్రీ.శ. 1246 ముందుగా రచితములైవియని మరియొక మారును గ్రంథకర్తయే వ్రాసినట్లు పైని ఉదాహృంత భాగమున చూపితిని— ఇటి వి గ్రంథమున త్రవ్వి తండములు.

## 4

ఈ గ్రంథమున గ్రంథకర్త పరిశీలన చేయకుండగనే ప్రతిపాదించిన విషయములు చూడుడు—

---

8. శ్రీ మల్లూరి వెంకటరామయ్యగారి తెలుగు చోళుల చరిత్ర— ఇది యాంగ్లేయ భాషలో నున్నది. "History of Telugu Cholas" అని దానిపేరు.

పుట 120. "శ్రీనాథుండుగాని, తర్వాతివారు గాని కృత్యాదియందు తాము ఇట్లు అష్టాదశ వర్ణనలు గూర్చి ప్రబంధములు వ్రాయుచున్నామని చెప్పుకొనలేదు."

కాని అట్లు చెప్పుకొన్నవా రున్నారు.

చూ. సింహాసన ద్వాత్రింశిక—కొఱవి గోపరాజకవి—ఈతడు శ్రీనాథుని సమకాలికుడు.

క. పురమధు జల లీలాంబుధి
పరిణయనయ విప్రలంభ పతి గుణ సుత భా
స్కర చంద్రోదయ రణగతి
గిరివన ద్యూతర్తు రతులఁ గృతిఁ జెప్పఁదగున్. 32 ప.
అవతారిక—37 ప.

క. కావున బదునెనిమిదియగు
నీ వర్ణన లచట నచట నించుక బెరయం
గావించెద. 38 ప.

ప్రౌఢకవి మల్లన—రుక్మాంగద చరిత్రము—ఈతడు—క్రీ. శ. 1500 లకు ముందువాడు.

క. వనజల కేళీ శశిరవి
తన యోదయపాన యాన దౌత్యాబ్ధి వివా
హ నృపతి విరహ ఋతుమం
త్రనగాహవ నగర వర్ణనలఁ దగు కృతులన్.
అవతారిక—18 ప.

ఈ పద్యము నన్నెచోడని పద్యము ననుసరించినదే.

"క. వనజల కేళీ రవి శశి
తనయోదయ ...... "

పై యిరువురు కవులును—నన్నెచోడని వలె, అష్టాదశ వర్ణనల గూర్చియే గాక, కవితా విషయమును గూర్చి యవతారికలో చెప్పియే యున్నారు—నన్నెచోడని కృతి కన్య రుక్మాంగద చరిత్రమున వారస్త్రీ యైనది. (చూ. వారస్త్రీ వలె జూడ నొప్పవలదా వర్ణింపఁగావ్యం బిలన్ 23 ప) ఇదియు నన్నిచోడని యనుసరణమే. (మదనాగంబును బోలె గ్రాలవలదా మాటెందు లేకున్నతిన్—40 ప.)

పుట 134. "కథావశమున పీరన్న పుర వర్ణనతో ప్రబంధమును మొదలుపెట్టినాడు. అంతకుముం దెవరును పుర వర్ణనతో ప్రబంధము ప్రారంభింపలేదు"—ఇచట పీరన్న యనగా తిక్కన పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు యుత్తర రామాయణమున కథను పురవర్ణనతో ప్రారంభించినాడు.

క. అమ్మనుజ నృపతి కభ్యుద
యమ్ముగ నేఁ జెప్పఁ బూనినట్టి కథకు నా
ద్యమ్మయి యయోధ్య యను నా
మమ్మున నెగడిన పురోత్తమము వర్ణింతున్. 44 ప.

ఈ వర్ణన 19 పద్యములలో నున్నది.

ఇది ప్రబంధము కాదందురేమో ?

గ్రంథకర్త సరిగ పరిశీలింపలేదేమో కాని, మంచన కేయూరబాహు చరిత్రము, అన్నయ షోడశ కుమార చరిత్ర పురవర్ణనతో ప్రారంభమగుచున్నది.

కేయూర బాహుచరిత్ర—కథా ప్రారంభము.

క. "అపరిమిత విభవమై ధా
త్రిపయిం బరగిన కళింగదేశములో నిం
ద్రు పురమును బోలి యెప్పుం
ద్రిపురీ నగరంబు సంస్తుతికిఁ బట్టగుచున్.

అని 48 నుండి 60 వఱకు 12 పద్యములలో పురవర్ణన మున్నది. అన్నయ షోడశకుమార చరిత్రమున కథా ప్రారంభమున హస్తినాపురం బెట్టిదనిన" అని హస్తినాపుర వర్ణన 15 పద్యములలో గలదు.

తిక్కన మంచన, అన్నయలు ముప్పురు పినవీరన్నకు ముందువారే గదా !

నన్నెచోడుని కవిత్వ కాల నిర్ణయాదులే గాక, శైవమును గూర్చి—అందు ముఖ్యముగా, 226 వ పుటలో గల విషయములన్నియు, విమర్శనీయములే గాక ఖండనీయములై యున్నవి—వాని నీ క్రింద వివరించుచున్నాను.

1. "ఈతనిది వీరశైవముగాదు"—

వీరశైవమునకు ప్రధానాంగములగు గురులింగ జంగమ తత్త్వములను వివరించిన నన్నెచోడుడు వీరశైవుడు గాక మఱి యేమగును ? గ్రంథమునం దంతట వీరశైవ మతానుసారముగ, శివపారమ్యము వర్ణితమైనది. "ఏమాది మూర్తి దక్షిణ వామాంగములందు బుట్టి"—(2—40) అని బ్రహ్మ విష్ణువులు చెప్పుటయు—సతీదేవి, "ఉరులింగ రూపమై హరివేధలకు దనకడ గానరాకున్న పొడవు వాని" అని ప్రకటించుటయు వీరశైవ మత ప్రతిపాదకములే గాని వేఱుగావు—ఇట్టివి వీరశైవేతర కావ్యములయం దుండ వని గ్రంథకర్త గ్రహించుగాక.

2. "లింగధారిగా కానరాడు."

లింగధారి శబ్దము వాడుకలో బ్రాహ్మణులలో ఆరాధ్యలకు మాత్రమే వర్తించును. నన్నెచోడుడు క్షత్రియుడు గాని బ్రాహ్మణుడు కాడుగదా ! ఇంతకు నీ 'లింగధారి' శబ్దము పూర్వ మున్నట్లు తోచదు. వా రందఱకు, ఆరాధ్యులని, మాహేశ్వరులని, వీరమాహేశ్వరులని పేరు. వీర మాహేశ్వరాచార సంగ్ర

హము—మొదలగువిధము లీ సంప్రదాయమునే ప్రవచించును. కాబట్టి యీమాట యపాస్తము.

3. "శివకవులలో చేరడు."

ఇది పై రెండింటికి మించినది. నన్నెచోడుడు శివకవి యని, ఆంధ్రవాఙ్మయమున—మల్లికార్జున పండిత నన్నిచోడ, పాల్కురికి సోమనాథులు—ముప్పురు కవులని 8—

ఆంధ్రసాహిత్య ప్రపంచమునం దంతటను, వ్యాప్తమై యుండగా, విశ్వవిద్యాలయములో, ఎమ్. ఏ, ఆనర్సు తరగతులు చదువు ప్రతి విద్యార్థికిని గూడ—తెలిసియుండగా—ప్రస్తుత గ్రంథకర్తకు—తెలియకపోవుట శోచనీయము. ఇంత ప్రసిద్ధ విషయమును గూర్చి వ్రాసినపుడు, గ్రంథకర్త యుపపత్తిని దేనిని చూపకుండగ, నిట్లు వ్రాయుట యెంతమాత్రము సరికాదు—

4. "బ్రహ్మ ద్వేషియుం గాడు."

గ్రంథకర్త శివకవు లందఱును బ్రహ్మద్వేషులు కావలయునని యొక యభిప్రాయము మనసునం దుంచుకొని వ్రాసినదీ వాక్యము—కాని వీరశైవమున నవైదికమగు, జంగమ లేక బసవ సంప్రదాయమును, సవైదికమగు, ఆరాధ్య లేక పండిత సంప్రదాయమును అను రెండు సంప్రదాయములు గ్రంథకర్త కెఱుకలేదు.—పండితారాధ్యుడు, బసవనితో, "భక్తిమీది వలపు బ్రహ్మంబుతో పొత్తు' బాయలేను నేను బసవలింగ— అని చెప్పుటయే వీరశైవమున సవైదికమగు సంప్రదాయము అనగా వేద విహితమైన సంప్రదాయ మున్న దని గ్రహించవలెను. వేదసమ్మత సంప్రదాయము గావున నిందు బ్రహ్మ ద్వేషమునకు సూది మొన మోపునంతటి యాస్కారము లేదు.

గ్రంథకర్త యీ సందర్భమున పండితారాధ్య చరిత్ర పీఠికలో—"సోమనాథుడు నిరూపించిన వీరశైవము" అను శీర్షిక (పుటలు 314—332) యందలి విషయములను మాత్రమే, చదివి మూలమును చూడకుండగనే వ్రాసిన వ్రాత యని స్పష్టమగుచున్నది.

5. "ఈతని గురువే బ్రాహ్మణుడు.' శైవాగమ రహస్య వేత్త కావున ఆగమమార్గ శైవ మనుట నిక్కము."

---

8. భారతి—1 సం. 1 సంచిక—శివకవులు— జనవరి 1924. నేను క్రీ. శ. 1945 లో యథావాక్కుల అన్నమయ్యను శివకవిగా నిరూపించి పై శివకవిత్రయమునకు జేర్చితిని. (భారతి—1945 రెండు వ్యాసములు.)

ఇదియు పై వాక్యము ననుసరించి వ్రాసినదే. వీర శైవులకు బ్రహ్మ ద్వేషము విహితమని—బ్రాహ్మణాధిక్యమును ప్రపంచించిన, నన్నెచోడు డట్టి వీరశైవుడు కాడనియు, మఱి యొక శైవమతమునకు సంబంధించినవాడని గ్రంథకర్త యభిప్రాయము. అందుచేత, నన్నెచోడకవి—ఆగమ శైవ సంప్రదాయమని వ్రాయబడినది. కాని, ఆగమములు—వీరశైవులకు ప్రామాణిక గ్రంథములలో నొక భాగమునకు జెందినవనియు, నవి శివతత్త్వ ప్రతిపాదకములనియు, తెలియవలెను. ఈ కారణముచేతనే వీరశైవులని, యున్నట్లుగా, వేద శైవులని, ఆగమ శైవులనియు, పురాణ శైవులనియు, ఇతిహాస శైవులనియు వేర్వేఱుగా నుండరు—నిగమాగమ, స్మృతి, పురాణేతిహాస సంపూర్ణ సంప్రదాయక విశిష్ట మతమే వీరశైవ మతము—కావున—నన్నెచోడ కవినాగమ శైవు డనుట సరికాదు.

6. "శివ కవి కాడనుటకు ప్రబల కారణము ఈతని దక్షయాగ కథ తీఱు వేఱుగా నుండుట. 'బ్రాహ్మణో న హంతవ్య' అనుదాని నుపదేశించుటకు రచితమై యుండును."

వీరశైవ గ్రంథములలో శివమహిమ ప్రతిపాదకములగు, దక్షాధ్వరధ్వంసము, త్రిపురాసుర సంహారము తప్పక వర్ణితములు కావలెను. నన్నెచోడడా సంప్రదాయము ననుసరించి యీ రెండింటిని రచించినాడు. గాని "బ్రాహ్మణో న హంతవ్య" అను దానిని ప్రతిపాదించుటకు గాదు. పండితారాధ్యుల శివతత్త్వసారమున, పాల్కురికి సోమన. పండితారాధ్య చరిత్రమున నీ దక్షాధ్వర ధ్వంస కథ వర్ణితమై యున్నది. "క్రియాదక్షో దక్ష" అని శివ మహిమమున నిది సూచితమైనది. కావున నీ దక్షాధ్వర ధ్వంసకథ వర్ణించుట తప్పక శివకవి సంప్రదాయమే కాని వేఱొండు కాదని యెఱుంగునది. ఇంకను, నీ పుటలో, నన్నెచోడడు ద్రావిడ శైవాగమ కక్ష్యకు జెందినవాడని—ద్రావిడ శైవమునకు కాశ్మీర శైవమునకు సన్నిహిత సంబంధమని—నన్నెచోడుడు శాక్తేయుడని శ్రీ విద్యోపాసన ప్రబలినవాడని—వ్రాయబడి యున్నది.

పైని విమర్శించిన వాక్యముల వలననే, నన్నెచోడ కవి ప్రతిపాదించిన శైవమత మేదో తెలియనప్పుడు గ్రంథకర్త యిట్టి వ్రాతలు వ్రాయుటలో నాశ్చర్యములేదు. మనకు తెలియని విషయములను గూర్చి వ్రాయుటకు మన కధికారము లేదు. నన్నెచోడ కవి కావ్యము—కేవలము సాహితీ దృష్టి చేతనే గాక శైవ మత దృష్టితో, బహు జాగరూకతతో పరిశీలింపదగిన లోకోత్తర కృతి—మన ప్రాచీన కృతు లన్నియు మత సాహిత్యముల యవినాభావ సంబంధము గలవి. నేడు మనకు కావలసినది సాహిత్యము గాని మతము గాదు—అందుచేతనే నిట్టి యవ్యవస్థ యేర్పడినది.

ఆ సాహిత్యమైనను గ్రంథముయొక్క భాషా రచనపై యాధారపడి యుండును. నన్నెచోడని భాషా రచన ననుసరించిన భాషా లక్షణములు, నన్నయ భట్టారక కవిత్రయాది భాషాలక్షణముల కన్న భిన్నమైనవి. కాని నన్నెచోడనితోబాటు మల్లికార్జున పండితునియందును, పాల్కురికి సోమనాథుని యందును, సామాన్యముగ నా లక్షణములు కనబడుచుండుటచే, వీరిని పృథక్కరించి శివకవులని సాహితీ విమర్శకులు వ్యవహరించిరి.

ఈ "నన్నెచోడని కవిత్వమున", భాషా సంప్రదాయములను, వీడి కావ్య పద్ధతిలో విమర్శనను సాగించుటచేత, నన్నెచోడుడు, శివకవి కాక, కవిత్రయ సంప్రదాయానుసారియైన కవి యైనాడు. ఈ భావనతో నీ గ్రంథరచన సాగుటచేత మూల ముట్టుగ నిది యప్రామాణికమై నిరర్థకమైనది.



**నాటకం:**

# మంచుతెర

## 'శ్రీ ఆదివిష్ణు'

(విశాఖపట్నం డాబా గార్డెన్స్‌లో ఒకానొక అద్దె యిల్లు. రెండు గదులు. ముందు గదిలోనే ఈ కథ జరుగుతుంది. గది అలంకరణ విషయంలో చాలా జాగ్రత్త తీసుకున్నట్లు కనిపిస్తోంది. గోడ పక్కగా కేంప్ కాట్. గది మధ్యలో రెండు కుర్చీలు. మరో గోడ ఓరగా పడక కుర్చీ. గది మూలగా టీపాయ్‌మీద గ్రామఫోన్ - దాని ప్రక్కనే రికార్డులు. గోడలకి అందమైన కేలండర్లు.

ఈ గదుల్లో చలపతిరావ్, సాంబశివరావ్ అనే యిద్దరు కుర్రాళ్ళున్నారు. ఇద్దరూ యూనివర్సిటీలో చదువుకుంటున్నారు. తెర లేచేసరికి సాంబశివరావొక్కడూ పడక కుర్చీలో నడుంవాల్చి పైకి చూస్తూ కూర్చున్నాడు. కాసేపు ఏదో ఆలోచించేడు. లేచాడు. జేబులోంచి అర్ధరూపాయి బిళ్ల తీశాడు. బొమ్మా, బొరుసూ వేశాడు.)

సాంబ : బొమ్మ పడితే లలిత నా సొత్తు (అర్ధ రూపాయి బిళ్లని ఎగరేసి చేత్తో పట్టుకుని చూశాడు. బొమ్మేపడ్డది) గుడ్ హెవెన్స్—లలితను గెలిచేశాను. కాసేపు ఆగేడు)

ఇప్పుడు బొమ్మ పడితే రాబోయే పరీక్షల్లో పాసవుతాను (ఇప్పుడు బొరుసుపడ్డది) వెరీ బేడ్! పరీక్షపోతుంది. కాబట్టి దీనివల్ల తేలిందేమిటయ్యా అంటే ప్రేమ వ్యవహారాల్లో పడ్డ గురుడు చదువులో దెబ్బతినేస్తాడని. అవుతే, అంతమాత్రంచాత ప్రేమించలేని మనిషిని నేను గౌరవించను. (డ్రెస్సింగ్ టేబిల్ దగ్గరికెళ్లి తల దువ్వుకుంటున్నాడు మధ్య మధ్య యీల వేస్తూ. వివిధ భంగిమల్లో తన అందాన్ని గమనించి ముగ్ధుడవుతున్నాడు. ఆ సమయానికి చలపతిరావ్ వచ్చాడు. అతన్ని అద్దంలోంచి చూశాడు సాంబశివరావ్. గట్టిగా యీల వేశాడు. వెనక్కు తిరక్కుండానే చలపతిరావ్ నుద్దేశించి అన్నాడు) నుంచో. నువ్వక్కడే నించో. కదలొద్దు. (చలపతిరావ్ ఆగిపోయేడు. మళ్లా ఓమాటు జుత్తు అందంగా సవరించుకున్నాడు సాంబశివరావ్. కాలరు సర్దుకున్నాడు. సడన్‌గా వెనక్కి తిరిగి—) చెప్పు. మనసులో ఏమీ దాచుకోకుండా చెప్పు. నేనెలా ఉన్నాను ? రాక్ హడ్సన్ నన్ను చూచి సిగ్గుపడాలి కదూ ? (చలపతిరావ్ ఏమీ మాటాడలేదు) మొహమాట మొద్దు. క్విక్. వన్ ...... టూ ......

చల : ఏమిటీ దిక్కుమాలిన పరీక్ష నాకు.

సాంబ : నీకు పరీక్షేమిటోయ్. నా అందానికి మార్కులు వేయమన్నాను. ఫిఫ్టీ, సిక్స్టీ ఆర్ సెంట్ పర్సెంట్. నీ యిష్టం—నీకు నచ్చిన ముక్క చెప్పేయ్.

చల : నువ్వు రోజురోజుకీ పసిపిల్లవాడివై పోతున్నావ్ సాంబశివరావ్.

సాంబ : నువ్వు రోజురోజుకీ ఎదిగిపోతున్నావ్ చలపతిరావ్ ! ఎదగడంలో హుందా ఉంటుందిట. పసిపిల్లవాడికి ఆనందం సొంతంట.

చల : (ఉస్సురంటూ వచ్చి కేంప్‌కాట్‌పైనకూర్చున్నాడు. ఓమాటు సాంబశివరావ్ వైపు చూసేడు. మెల్లిగా అన్నాడు.) నువ్వు మాటాడుతున్న దేమిటో నీకైనా అర్థమవుతుందా అసలు ?

సాంబ : నేనేం తాగలేదు. ఉంటున్నది విశాఖపట్టణమే కావచ్చు. ఈ ఊరి జాతంతా మతులు పోగొట్టుకున్నవాళ్లనంటే నిన్ను తన్నేయగలరు. (సీరియస్‌గా మారేడు) నే నడిగిన దాంటో తప్పేముం దసలు ? రాక్ హడ్సన్ నాకంటె అందగాడా అని అడిగేను. అవునంటే అవునను. లేదూ కాదను. దట్సాల్.

చల : గదిలో అద్దం ఉంది. చూసుకోరాదూ !

సాంబ : ఏం పెద్దమనిషివయ్యా. రేపో మాపో పంతులు గిరీ వెలిగించే నువ్వేనా యిలా మాట్లాడుతూంట. నీ స్టూడెంటు రాసిన పేపరు దిద్దేది నువ్వా? నీస్టూడెంటా? ఎవడు వ్రాసిన పేపరు వాడే వేల్యూ చేసుకున్నట్టయితే— యింక వేరే చెప్పక్కర్లేదు—ఘోరం.

చల : ఇప్పుడు నీ అందంతో అవసరమేమి టసలు ?

సాంబ : చాలా అవసరం. ఈ అందంతో మాజిక్ చేస్తాను— మాయ చేస్తాను.

చల : (లేచాడు. సాంబశివరావ్ భుజం తట్టాడు) అవుతే మంచి ప్లానే వేశావన్నమాట.

సాంబ : అన్నమాటేమిటి ? నాన్‌సెన్స్. ఉన్నమాటే. ప్రేమిం చేను. ఒక అతిలోకసుందరి, లక్షాధికారిణి, లలితమ్మ ఉరఫ్ లల్లీని. రోజూ బీచ్‌లో ఎదురవుతుంది. పలుక రించకపోయినా కనుపిస్తే నవ్వుతుంది. క్రీగంట నన్ను నఖశిఖపర్యంతం పరీక్షిస్తుంది. నో డవుట్—ఆపిల్ల నన్ను ప్రేమించేసిందనే చెప్పాలి.అవుతే నోరు విప్పి చెప్పడాకి సిగ్గు గనక—సస్పెన్స్. అది గూడా ఓ రకమైన అందమే మరి. అర్జెంటుగా చెప్పేయ్. 'నే నెలా ఉంటాను: ఆపిల్ల అందానికి నేను మార్కులేశాను. నా అందానికి ముందు నువ్వు మార్కులేస్తే అనక కొంచెం ధైర్యంగా ఉంటుంది నాకు.

చల : (చిరునవ్వు పెద్దదై గభాలున నవ్వేడు.)

సాంబ : వై ? ఎందుకు ? నవ్వుతా వెందుకు ?

చల : నీ పవిత్రమైన ప్రేమని చూచి.

సాంబ : ఏం? ప్రేమించడం తప్పా ? అంత నవ్వు వచ్చే విషయమా ?

చల : నువ్వు లలితని ప్రేమిస్తున్నమాట నిజమా ?

సాంబ : నీతోడు.

చల : ఎప్పుడూ చెప్పావుకాదే ?

సాంబ : ఆఁ— అవసరంలేదు గనక. ఇప్పుడు లలిత గూడా నన్ను ప్రేమిస్తుందన్న ధైర్యం కలిగింది గనక.

చల : ఇంతకీ నువ్వు ఆమెలో ఏమి చూసి ప్రేమిస్తున్నావ్ ?

సాంబ : చెప్పేదా ?

చల : ఊఁ.

సాంబ : (సిగరెట్టు తీశాడు. తనొక్కడే కాల్చుకున్నాడు) సారీ చలపతి ! దీన్లో ఉన్నవి రెండు సిగరెట్లు. అందునా గోల్డ్ ఫ్లాక్. బీచ్‌లో కాల్చవలసినవి యిప్పుడీ మహత్తరమైన విషయం చెప్పాల్సి వచ్చింది గనక ఇక్కడొకటి తగలేస్తున్నాను. రెండోది నీ కిస్తే బీచ్‌లో భజన చేయడమో 'వార్ క్వాలిటీ' కాల్చడమో జరుగుతుంది. అది నా కిష్టంలేదు. అంచేత నీకు సిగరెట్టు యివ్వలేక పోతున్నాను.

చల : దాని కింత ఉపన్యాసం అనవసరం.

సాంబ : అవుతే సరే. ఇప్పుడు నువ్వడిగిన ప్రశ్నేమిటి ? ఆ లలిత అనే ఆడకూతుర్ని ఏం చూసి ప్రేమిస్తున్నానని కదూ !

చల : (తలూపాడు).

సాంబ : నాకు సుఖం కావాలి. బ్రహ్మాండంగా బ్రతకాలి. అవునా! ఇవి ప్రతి మానవుడికీ ఉంటున్న కోరికలే. అవునా ! మరి దానికి మార్గం వెదకాలి. అవునా !

చల : (విసుగేసింది) అవును. అవును. అవును. అలా మాటల్ని తుంచకపోతే తిన్నగా మాటాడరాదూ !

సాంబ : కాస్తాగు. నన్ను చెప్పనివ్వు. ఇప్పుడు మనం యూనివర్సిటీలో చదువుతున్న విద్యార్థులం. ఇక్కడే చదువుకున్న మన అన్నయ్యలు సరైన ఉద్యోగాల్లేక హాలో లక్ష్మణా అని చేస్తోన్న ఆర్తనాదం నీ చెవిని పడే ఉంటుంది. కాబట్టి కేవలం మన చదువుల్ని నమ్ముకుని నే చెప్పిన కోరికలని సాధించాలనేది నాట్ సో యీజీ. కాబట్టి, ఇక్కడ మనం వెలిగించబోయే రెండు సంవత్సరాల్లోనే సమయం చూచి ఓ చక్కటి అవకాశాన్ని జేబులో వేసుకోడం మంచిది.

చల : నే నడిగింది లలిత విషయం.

సాంబ : నే చెప్పేది అదే. ఇప్పుడు నువ్వడిగిన ప్రశ్నేమిటి? ఆ లలిత ....

చల : అనే ఆడకూతుర్ని ఏం చూచి ప్రేమించావో చెప్పమని.

సాంబ : అవునా ?

చల : (తల పట్టుకున్నాడు) సోది.

సాంబ : అవునా ?

చల : బాబూ నేనేమీ అడగలేదు. నీ యిష్టమొచ్చిన అప్పల నరసమ్మని నీ యిష్టమొచ్చినట్టు ప్రేమించు. మధ్య నా కెందు కసలు ? (లేచి లోపలి గదిలోకి వెళ్ల బోయాడు. కానీ సాంబశివరావ్ అతన్ని పట్టుకు ఆపేడు)

సాంబ : కాస్తాగు. నే చెప్పేది విని మరీ వెళ్లు.

చల : (అతని మొహంలోకి తీక్షణంగా చూచి కూర్చున్నాడు)

సాంబ : లలితని ప్రేమించాను ! ఏం చూసి ప్రేమించాను ? పదిహేను రోజుల క్రితం రెండు రాత్రిళ్లు నన్ను నేను ప్రశ్నించుకున్నానిలా. మూడోనాటి సాయంత్రం బీచ్‌లో సమాధానం దొరికింది. ఆమె నల్లటి చక్కటి కారుని చూచి ప్రేమించాను. ఆమె వెంటనుండే అందమైన బొచ్చుకుక్కని చూచి ప్రేమించేను. ఆమె కట్టుకొచ్చే ఖరీదైన బట్టలూ, వంటినున్న విలువైన నగల్నీ చూసి ప్రేమించేను. ముద్దబంతిపువ్వులాంటి ఆమె అందాన్ని చూసి ప్రేమించిన మాటా నిజమే ననుకో. కేవలం ఆ అంద మొక్కటే నా ప్రేమకి కారణమని చెప్పను.

చల : దీన్ని నువ్వు ప్రేమంటావ్ !

సాంబ : లేకపోతే పిచ్చా? పిచ్చి చలపతీ, ప్రేమించేవాళ్లందరూ పిచ్చాళ్లనుకున్నావా ? మరి అలాంటి బంగారు పిచ్చుకల్ని ప్రేమించకపోతే జీవితమేం గానూ ? నువ్వన్న ఆఫ్టరాల్ కామన్ అప్పలనరసమ్మల్ని ప్రేమించేందుకు పైమేది ? లాభ మేమిటి ? ఆ రకమైన ప్రేమ గుడ్డిది. బ్లయిండ్ లవ్వుమీద నమ్మకంలేదు నాకు.

చల : చాలిక. నీ అమూల్యమైన ఉపన్యాసానికి కృతజ్ఞత.

సాంబ : ఒకసారి లేచి నిలబడు.

చల : ఎందుకు ?

సాంబ : ముందు లేవాలి. (అతను లేచాడు) ఇలా దగ్గరికి రా. (వచ్చాడు) నువ్వు ఎవర్నయినా ప్రేమించావా ? అసలు నీకు ప్రేమించడం తెలుసా?

చల : నేర్పుతావా ?

సాంబ : (తేలిగ్గా తీసుకున్నాడు) దీన్లో నేర్పేందు కేముందసలు ? ముందో రతనాల గనిని చూచి ప్రేమించు. ట్రై యువర్ లక్. కథ అడ్డం తిరిగేట్టుంటే నా సలహా.

చల : థేంక్స్. ఇక్కడి కొచ్చింది చదువుకునేందుకు. పరీక్షలు దగ్గరవుతున్నాయి. ఇక ఈ విషయాలు ఆపి పుస్తకాలు తీసుకో.

సాంబ : ఓయీ పుస్తకాల పురుగూ! నీ లోకం పుస్తకాలొక్కటే కాదు. నువ్వు పాసవ్వాల్సింది యీ ఎమ్మే పరీక్ష ఒకటే కాదు.

చల : ఇంక ఆట్టే మాటాడకు.

సామి : ఇంతకీ నా అందాని కెన్ని మార్కులో చెప్పావుకాదు.

చల : లలితనే అడిగేయ్ !

సాంబ : (కులాసాగా అన్నాడు) అదిప్పుడు కాదు. వెన్నెలరోజుల్లో విశాలమైనవాళ్ల డాబామీద, ఆరుబయట మల్లెల పాన్పుమీద మనసు పరవశం చెందుతుండగా అడుగుతాను. 'ప్రియమైన లలితా నా అందానికి విలువెంతా ?' అని. అప్పు డావిడ నవ్వి నా మొహాన్ని తన చేతుల్లో దాచి 'అమ్మో నా అదృష్టాన్ని మీలాటి దొంగలముందు వెల్లడించను సుమండీ' అని అరమోడ్పు కళ్లతో చెబుతుంది. అదెలాగూ తెలుసు నాకు. కానీ, నీ అభిప్రాయం కూడా కావాలిగా.

చల : (నవ్వేడు—అది కొంచెం హేళనగా కన్పించింది) నీ నమ్మకాన్ని పాడుచేయడం యిష్టంలేదు నాకు.

సాంబ : మా కాలేజీలో నా నవ్వుకి చాలా విలువ ఉండేది. కోరి మరీ నవ్వించుకునేవారు. కొందరు ఏడుస్తున్నట్టు నవ్వుతారు. నీ నవ్వూ అలాగే ఉంటుంది. సరిగా నవ్వలేవూ?

చల : (కోపం వచ్చింది. కాని, కప్పిపెట్టుకున్నాడు). నాకు చాలా తొరగా కోపం వచ్చేస్తుందని గూడా తెలుసా నీకు?

సాంబ : హాఁ. లేకపోతే ఏమిటా తలతిక్క మాటలు. నా నమ్మకాన్ని పాడుచేయడం నీ తరమా ? నా కెన్నో తియ్యటి ఆలోచన లున్నాయి, ఆశ లున్నాయి. వాటిని గట్టిగా నమ్మేస్తాను. అది నా సొంతం. వాటి నెవరూ చెరిపేయ్యలేరు. వాళ్లకా అధికారమూ లేదు.

చల : మిస్టర్ సాంబశివరావ్, నీకు ఆవేశం ఎక్కువ.

సాంబ : నీకు ఎదటివాడి మనసుని నొప్పించడం బాగా తెలుసు చలపతిరావ్ ! నా సుఖంమీద, నా భవిష్యత్తుమీద నీకంత ఈర్ష్యెందుకు ? నువ్వూ ప్రేమించు. నేను వద్దన్నానా? నీ హృదయం విశాలం చేసుకో ? నేను వద్దన్నానా ?

చల : (రుసరుసలాడుతూ లోపలి గదిలోకి వెళ్లిపోయాడు.)

సాంబ : (పైకప్పు చూస్తూ సిగరెట్టు దమ్ము పీల్చాడు. అక్కడే నించుని చలపతి నుద్దేశించి అన్నాడు) మన మధ్య చాలా అనవసరంగా వాతావరణం చెడిపోయింది. చింతిస్తున్నాను చలపతీ ! (అడగవలసింది గుర్తుకొచ్చింది) నా దగ్గర డబ్బులన్సల్లేవు. బీచ్‌కి వెడదామనుకుంటున్నానుగదా ! కనీసం అయిదు రూపాయలైనా కావాలి. ఉంటే యివ్వు. ఇక్కడే నించున్నాను. ఒకసారి బైటకురా. (తలతిప్పి గుమ్మంవైపు చూసేడు. అతను రాలేదు. క్షణం ఆగి మళ్ళా అన్నాడు.) పోనీలే అయిదు లేకపోతే నాలుగు. (మళ్లీ చూసేడు. చలపతి అప్పటికీ రాలేదు) ఆఖరిమాట మూడు రూపాయలు. దీనికి ఒక్క నయాపైసా గూడా చస్తే తగ్గేదిలేదు.

తొరగారా ! (గట్టిగా అరిచేడు) రావయ్యా దేవుడా ?
(చలపతి వచ్చాడు. అతని చేతిలో రెండు రూపాయల కాగితముంది. దాన్ని టేబిల్‌మీద ఉంచి వెళ్లిపోయాడు. రూపాయల కాగితాన్ని తీసుకున్నాడు సాంబశివరావ్. చొక్కా మడతల్లో దాచి క్రాపు సరిచేసుకున్నాడు. ఆ సమయానికి వెంకటరత్నం బైట గుమ్మం దగ్గరికొచ్చి నించున్నాడు. కానీఅతన్ని గమనించలేదు సాంబశివరావ్.)

సాంబ : (లోపలున్న చలపతి నుద్దేశించి) ఇలా డిస్కౌంట్ చేస్తావని తెలుస్తే ముందే పది అడిగి ఉండేవాడిని· ఏనీహౌ ‘థేంక్స్. వస్తా. ఇవ్వాళ లలితతో మాటాడేస్తాను. శుభవార్త రాత్రికి చెబుతాను. వచ్చేప్పుడు హొటల్లో భోంచేసి వస్తాను గనుక నా గురించి యెదురుచూడకు. సరేనా. (వెంకటరత్నాన్ని చూసి మాటలాపేడు. వెంకటరత్నం పలుకరింపుగా నవ్వేడు. తర్వాత లోపలి కొచ్చేడు.)

వెంక : ఏమిటో చదివేస్తున్నా రల్లే ఉంది.

సాంబ : మే మిద్దరం పోట్లాడుకున్నాంలెండి. మీ రెంత సేపయిందీ వచ్చి ?

వెంక : ఎంతోనా ? ఇప్పుడే. అది సరే .... ఏదో పోటాడుకుంటున్నా మన్నారు ....

సాంబ : అబ్బే. గొప్ప పోట్లాట కాదులేండి. చిన్నసైజు అభిప్రాయభేదం.

వెంక : (కుర్చీలో కూర్చున్నాడు. టేబిల్‌మీద పుస్తకం తీసుకున్నాడు.) ఏమిటో అది ?

సాంబ : సృష్టిలో అందమైన వస్తువుల్ని ప్రేమించడం నాకు సరదా.

వెంక : చాలామంది ప్రేమిస్తారు.

సాంబ : అవునాండి ! ప్రేమించడం నేరం కాదుగదా. అది మా చలపతికి గిట్టదు. నాలుగేళ్ల క్రితం మీకు పాలకొల్లు బస్టాండులో కొత్తగా పెళ్లయిన దంపతులు కనిపించారు. వాళ్ల వెంట పెద్ద దిక్కు ఎవ్వరూ లేరు. ఒక పెట్టె, హొల్డాలే చెప్పుకోతగ్గ లగేజి. హొల్డాలు మీద ఆవిడ ముచ్చటగా కూర్చుని ఉంది. చేతిలో మరచెంబు వగైరాను. అతను సిగరెట్టు కాలుస్తూ వా ళ్లెక్కవలసిన బస్సు కోసం ఎదురుచూస్తున్నాడు. ఇంతలో ఆమెకి దాహం వేసింది. మంచినీళ్లు కావాలి. అడగాలంటే సిగ్గు. ఎలాగైతేనేం మెల్లిగా అడిగేసింది. అతను సోడా కోసం పక్క కొట్టు దగ్గరికి వెళ్లాడు. ఇంతలో వా ళ్లెక్కవలసిన బస్సు రానే వచ్చింది. జనం కిటికీల్లోంచి లోనికి ఉరికేస్తున్నారు. అవతల ఆ పెద్దమనిషి ఎంతకీ రాడాయె. ఈవిడకేమో అంత రద్దీలోనూ చోటు దొరుకుతుందో లేదోనని భయం. దొరికినా ఇద్దరు ఒకేచోట కూర్చునేందుకు వీలవుతుందో కాదోనని దిగులు. ఇవన్నీ ఆ అమ్మాయి కళ్లల్లో మీరు చదివేశారు. మీకీ సన్నివేశం బాగా నచ్చింది. దీన్ని మీ రిప్పటికీ మరిచిపోలేరు. మీగ్గూడా అలా జరుగుతే యెంత బాగుంటుందీ అని కోరిక. మీకు నచ్చిన పెద్దమనిషితో మీ కోరికని చెప్పుకుంటారు. అప్పుడా పెద్దమనిషి ‘నీ నమ్మకాన్ని పాడు చేయడం నా కిష్టంలేదు సుమా’ అని ఓదార్చుతే మీకెలా ఉంటుంది. చెప్పండి వెంకటరత్నంగారూ !

వెంక : (చప్పట్లు చరిచేడు) మోర్వలెస్. బ్యూటీఫుల్. మీలో ఇంతటి కవితావేశం ఉన్నట్టు నే నిప్పుడే గమనించేను.

సాంబ : మరి నా ప్రశ్న అలాగే ఉండిపోయింది.

వెంక : అవుతే చలపతిరావ్‌గారిదే తప్పు.

సాంబ : అవునాండి ! లోపల చదువుకుంటూన్నాడు కాబోలు, పిలిచి రెండు వాయించండి. మరి నే నొస్తానండి. నా కవతల చాలా పనులున్నాయి. అన్నట్టు (నసుగుతూ) అడక్కూడదు గానీండి ......

వెంక : ఫర్వాలేదు. అడగండి. ఒకే రూమువాళ్లం కాకపోయినా పక్కపక్క రూములవాళ్లం.మనలో దాపరిక మెందుకూ?

సాంబ : ఏంలేదు. నేను చలపతిని అయిదు రూపాయ లడుగుతే రెండు రూపాయ లిచ్చేడు. సరిపెట్టుకోడాని కది చాలనుకోండి. కానీ, గుమ్మం దాటిన తర్వాత అనుకోకుండా కొన్ని ఖర్చులు తలమీద కెక్కి కూర్చుంటాయి చూడండి. అంచేత ......

వెంక : మిగతా మూడు రూపాయిలూ నన్నివ్వమంటారు. అంతేగా ?

సాంబ : (అవు నన్నట్టు తలూపాడు.)

వెంక : తీసుకోండిసార్ ! మూడు కాకపోతే అయిదు (అయిదు రూపాయిల నోటిచ్చేడు) హేవిట్.

సాంబ : (తీసుకున్నాడు) ఎ ఫ్రండ్ యిన్ నీడ్ ! యీజె ఫ్రండ్ యిన్‌డీడ్ అన్నాడు శాస్త్రకారుడు. థేంక్యూ జెంటిల్మేన్ ! థేంక్యూ.

(దాదాపు పరుగెత్తినట్టు వెళ్లిపోయాడు.)

(వెంకటరత్నం లోన గుమ్మం దగ్గర నించుని లోపలికి తొంగిచూసేడు. తర్వాత గది అంతా గాలించేడు. గ్రామఫోన్ రికార్డు పరీక్షగా చూసి మళ్లా అక్కడే ఉంచాడు. చలపతి టేబుల్‌మీద పుస్తకాలు తిరగేశాడు. ఒక పుస్తకంలోంచి కవ

రోటి జారి కిందపడింది. దాన్ని జాగ్రత్తగా తీసి తన జేబులో ఉంచుకున్నాడు. కాసేపు తచ్చాడి తన రూములోకి వెళ్ళిపోయాడు. మరి కొంతసేపటికి చలపతి బైట గదిలోకి వచ్చాడు. అతని చేతిలో పుస్తకం ఉంది. నడుస్తూ కాసేపు చదివేడు. గ్రామఫోను దగ్గర సడన్‌గా ఆగిపోయేడు. పుస్తకం పక్కన పెట్టి రికార్డు చేతుల్లోకి తీసుకున్నాడు. ముందు నోటితో ఆ పాటను అన్నాడు.'' ''దూరాన నారాజు .........'' తర్వాత గ్రామఫోన్‌మీద రికార్డు పెట్టేడు. రికార్డు అదే పాట పాడింది. పాట సాగుతుండగా వెంకటరత్నం వచ్చి గుమ్మం దగ్గర నించున్నాడు. అతనికి యీ పాట వింటుంటే కోపం వస్తోంది. ఇదేమీ గమనించే స్థితిలో లేడు చలపతి. పాటలో లీనమైపోయాడు. పాట పూర్తయింది. వెంకటరత్నం చలపతి దగ్గరికొచ్చి, అతని భుజం తట్టాడు. చలపతి ఉలిక్కిపడ్డాడు.)

చల : మీరెంతసేపయిందీ వచ్చి ?

వెంక : ఇది రెండోమాటు రావడం. ఒకతడవ మీరు చదువుకుంటున్నారు కాబోలు. డిస్టర్బుచేయడ మెం దుకని వెళ్ళిపోయాను. ఇప్పుడు యీ రికార్డు వినిపిస్తేమళ్ళా వచ్చాను. అన్నట్టు సాంబశివరావు మీరూ పోటాడుకున్నార్ట ?

చల : మా పోట్నాటే చెప్పాలి. (విషయం మార్చి) మీఊర్నుం చెప్పుడొచ్చారు ?

వెంక : నిన్న. రాత్రంతా మా ఫ్రండింట్లో గడిపేను.

చల : ఎలా చదువుతున్నారు ?

వెంక : ఏం చదువుల్లే మాస్టారూ ! వచ్చే పోయే అతిథి దేవుళ్ళతోనే సరిపోతుంది పుణ్యకాలమంతా.

చల : పరీక్షలు దగ్గరడుతున్నాయండోయ్ !

వెంక : నే నింటిదగ్గర కూచోడం మా నాన్నకి గిట్టదు. బలవంతంచేసి యిక్కడికి తోలారు నన్ను. ముందే చెప్పాను యీ చదువులు నాకు అచ్చిరావని. విన్నారు కాదు. అనుభవిస్తారు.

చల : భలే గమ్మత్తుగా మాటాడుతున్నారే. మీ బాగోగుల్తో మీనాన్నగారెలా బాధ్యులవుతారు?

వెంక : కాబట్టి నా బాగు సంగతేదో నా కొదిలేస్తే బాగుండిపోను. గంపెడంత ఆస్తికి ఒక్కగానొక్క వారసుణ్ణి గదా, నా కెందుకీ అవస్థ ? హాయిగా కడుపులో నీళ్ళు కదలకుండా ఇంటిపట్టున కూచుంటే యిట్టే కాలం గడుస్తుందాయె. ఉన్నవాడూ చదివి లేనివాడూ చదువుతే నిరుద్యోగ సమస్య నెత్తికెక్కి కూచోక చస్తుందా మరి. పైగా ఉన్నవాడికే ఉద్యోగాలు. లేనివాడు ఎప్పటికీ లేనివాడే.

చల : (ఈ ప్రసక్తి నచ్చలేదు) మీఊరి ఖబుర్లు చెబుదురూ!

వెంక : ఏం ఊరులెండి. బోరుకొట్టి చచ్చేను. ఆ ఊళ్ళో మునుపటిసర్దాలు లేవు. మునుపటి ఆనందం లేదు. మొన్నామధ్య చెప్పాను చూడండి రాధ అని—(ఆగిపోయి చలపతిని క్రీగంట పరీక్షిస్తున్నాడు)

చల : ఆఁ .... అవును .... రాధ. ఏమయ్యింది ?

వెంక : (సిగరెట్ పేకెట్ విప్పాడు. తనోటి ముట్టించుకుని చలపతికో టిచ్చేడు. కావాలని అసలు విషయం తొరగా చెప్పలేదు) ప్రేమ అనే పదార్థాన్ని కత్తితో పరపరా కోసిపారేయాలి మాస్టారూ !

చల : ఇంతకీ రాధ కేమైందో చెప్పారుకాదు ?

వెంక : రాధ మొగుడు బడుద్ధాయి. ఏమీ తెలీని అమాయకుడు. వాడు రాధని దేవతలా కొలిచేడు. ఇప్పుడు మతిపోయి యేం చేయాలో తోచక అల్లాడిపోతున్నాడు.

చల : (సిగరెట్టు ముట్టించుకోలేదు. వెంకటరత్న మిచ్చిన అగ్గిపెట్టె చేతిలో అలాగే ఉండిపోయింది) అసలు జరిగిన దేమిటో పూర్తిగా చెప్పండి.

వెంక : రాధని నేను ప్రేమించినట్టే వెనకటికో తలమాసిన వెధవ ఒకడు కాలేజీలో ప్రేమించాడుట. కూటికి లేనివాడూ ప్రేమించడమేనా ? రాధ అంతస్థెక్కడ ? అతని అంతస్థెక్కడ ? నేను ప్రేమించానంటే అర్థముంది. రాధలాంటి ఆడపిల్లల్ని వెయ్యిమందిని కొనగల తాహతు నాకుంది. పైగా ఆమె మా మేనమామ కూతురు. ఆ పిల్లపైన నాకు అధికారం ఉంటుంది. మా అమ్మకీ ఆ మావయ్య మా రాజుకీ చిన్నప్పట్నుంచీ వల్లమాలిన విరోధం గనక రాధ మా గుర్నాథం భార్య అయింది. లేకపోతే—

చల : (కోపం వచ్చింది) మీ భార్య అయ్యేది. అది తెలుసు నాకు. కానీ, రాధని ప్రేమించిన కాలేజీ కుర్రాడిని వెధవని అనగలిగేరే—అంత తేలిగ్గా ఆ నిర్ణయాని కెలా వచ్చారు ?

వెంక : (నవ్వేశాడు) చూస్తుంటే ఆ మనిషి మీరే అన్నట్టు మాటాడుతున్నారే ?

చల : నేను గానీండి, మరోడు గానీండి. అది వేరే విషయం. విలువ అనేది అనేక రకాలుగా ఉంటుంది. మీకు డబ్బుంది. అతనికి డబ్బులేదు గానీ డబ్బుకంటె ముఖ్యమైన అర్హత లుండవచ్చు గదా.

వెంక : నా మొహంలేండి మాస్టారూ ! వాడికి కొన్ని అక్షా తలు గూడాను. ఇప్పుడు రాధ స్థితి చూస్తుంటే వాడి మెడమీద తల నరికేయా లనిపిస్తుంది. ఎంత మాయ చేశాడు ? నాకీ సంగతులు మొన్నటివరకూ తెలీవు. మొన్న ఊరంతా గుప్పుమంది. రాధకి ఫిట్సుట. రోజుకి వంద మాట్లు తెలివితప్పి పడిపోతుందిట. ఏమిటయ్యా కారణమూ అంటే—అదోరకమైన మాన సిక వ్యాధిట.

చల : వ్యాధా ?

వెంక : అక్షరాలా వ్యాధే. ఈ వ్యాధికి సూత్రధారుడు ఆ దౌర్భాగ్య దామోదరుడు. రాధ మాజీ ప్రియుడు. వాడు రాధకి గుర్తు రావడం, గుర్నాథంలో వాడి పోలిక మచ్చుకైనా కనుపించకపోడంతో పిచ్చెత్తినట్టు కేకపెట్టి నేల కూలిపోతుందిట రాధ. మరో అర గంటకి గాని స్పృహ రాదు. ఏ ముహూర్తాన పెళ్ల యిందోగానీ గుర్నాథం నరకయాతన అనుభవిస్తు న్నాడు. పాపం, వాడి గుండెల్లో ఎన్నెన్ని ఆశలు దాచు కున్నాడో గదా !

చల : అతనిమీద విపరీతమైన దయ చూపిస్తున్నారు మీరు.

వెంక : వాడంటే నా కెప్పుడూ సింపతీలే.

చల : మీకు మాటలు బాగా చాతవును.

వెంక : సరిగ్గా రాధ యిదేమాట అంటూండేది 'బావా నువ్వు గొప్ప వక్తవు సుమా !' అని.

చల : అనుక్షణమూ రాధ పేరు స్మరించడం భావ్యంకాదేమో!

వెంక : (దెబ్బతిన్నాడు) అది స్వ విషయం. మామధ్య బంధుత్వ మున్నది.

చల : కాదనను. కానీ, ఆమె గుర్నాథం భార్య.

వెంక : గుర్నాథం మా పిన్ని కొడుకు.

చల : (ఏమీ మాటాడలేదు. వెంటనే పుస్తకం తీసి, ఆ పుస్త కంలో చూపు నిలిపాడు).

వెంక : (నిష్ఠూరంగా అన్నాడు) ప్రేమించానని చెప్పుకునేందు కైనా 'గట్సు' లేని దద్దమ్మ ప్రేమిస్తే రాధ దుర దృష్టం కాకపోతే ఏమిటి ? ప్రేమించేవాడు పెళ్లికి సిద్ధపడాలి. అవతలివాళ్లు ఒప్పుకోకపోతే ఉండనే ఉంది గాంధర్వ వివాహం. అంతేగాని ఒక ఆడపిల్ల జీవితంతో ఆటలాడి, ఓడిపోగా చేతులు దులుపుకుని తనకేం పట్టనట్టు గోళ్లు గిల్లుకోడం పిరికివాడి లక్షణం.

చల : (వెంకటరత్నం మొహంలో తిన్నగా చూసేడు.)

వెంక : నా సంగతి వేరు. నే నిప్పటికీ రాధని ప్రేమిస్తూ న్నాను. రాధ యిష్టపడాలే గాని గుర్నాథానికి విడాకు లిప్పించడం క్షణంలో జరిగే పని. ఆ మాజీ ప్రేమి కుడు అవకాశవాది. తెర బైటకొచ్చి నిలబడగల సత్తా అతనికి లేదు. ఇంకా వాడిని మరిచిపోలేదంటే రాధ తన బ్రతుకుని తనే చేతులారా నాశనం చేసుకుంటున్న దన్నమాట.

చల : మీరు రాధ ప్రియుణ్ణి చాలా తడవలు తిట్టేస్తూ న్నారు. కోపం రాదంటే నేను నా ఉద్దేశాన్ని చెప్పాలని ఉంది.

వెంక : (వెకిలిగా నవ్వేడు) ఆల్‌రైట్. చెప్పండి.

చల : ప్రేమించినంతమాత్రాన పెళ్లి జరుగుతుందనే నమ్మకం ప్రేమించేవాడిలో ఉండటంలో ఆశ్చర్యం లేదు. గానీ పరిస్థితులు కత్తిగడితే తలొంచాల్సిందే. రభసతో జరిగే పెళ్లి జీవితాంతం రభసగానే ఉంటుంది. గనుక ప్రేమ అనే దానికి పర్యవసానం కేవలం పెళ్లి అంటే నే నొప్పుకోను. పోతే—ఆ అమ్మాయికి వేరే వ్యక్తితో పెళ్లయింది. పెళ్లయిన స్త్రీ ముసుపటి నేస్తురా లైనా యిప్పుడు సరాయి మనిషి. ఇప్పుడు రాధపైన అర్థంలేని కాంక్షలు పెంచుకోడం నేరం. అందు చేత రాధ స్నేహితుడు దూరంగా తిరుగుతూండచ్చు. తనకేమీ పట్టనట్టు నటిస్తూండచ్చు. కానీ— మీరలా కాదు. ఒకరి ఇల్లాలిపైన మీకు అలాంటి కోరికలు తగవు. భర్త అమాయకుడే కావచ్చు. అంత మాత్రంచాత అతని గురించి మీరు తేలిగ్గా మాట్లాడ టంలో మీ ఉద్దేశ మేమిటి ?

వెంక : నిజమూ అదే గనక. గుర్నాథం వట్టి ఫూల్ గనక

చల : అంతేకాదు—ఆమె యిష్టపడితే ఆవిడ భర్తకి విడాకు లిప్పించగలననే మీ సాహసాన్ని అసహ్యించుకుంటున్నాను.

వెంక : మిస్టర్ చలపతీ ! నా కన్నీ తెలుసు. మీచేత చెప్పించు కునే స్థితి కింకా దిగజారలేదు నేను. రెచ్చగొట్టకండి. ఒక్కమాటు భుజాలు తడుముకోండి.

చల : (తేలిగ్గా నవ్వేడు) తప్పుచేస్తే భుజంతో పని. ఇప్పటి కైనా మించిపోయింది లేదు. మీ మనసునీ, కోరిక లనీ అదుపులో ఉంచుకోండి. మనిషై పుట్టిన తర్వాత కొన్ని నియమాలని తప్పనిసరిగా పాటించి తీరాలి.

వెంక : షటప్ (లేచేడు. బైటికి వెళ్లబోయాడు గబగబా).

చల : ఆగండి (ఆగిపోయే డతను). మితిమీరిన అహం మనిషిని మనిషిగా ఉంచదు. కొంచెం అది కూడా అదుపులో పెట్టుకోండి.

# మంచు తెరలు

వెంక : నీ తెలివితేటలు మరొప్పుడైతే శ్లాఘించేవాడినేమోగానీ యిప్పు డలా చేయులేను చలపతీ ! ఎంత చక్కగా నటించావో జ్ఞాపకం తెచ్చుకో. నేను రాధని గురించి చెబుతూంటే ఏమీ తెలీనట్టు ఊకొట్టేవాడివి.

చల : రాధ గురించి ఎవరేమి చెప్పినా నే చేసేపని అదే !

వెంక : మిస్టర్ ! రేపు ఆ రాధకేమైనా జరుగుతే దానికి బాధ్యుడివి నువ్వే అవుతావ్. ప్రేమించి పిచ్చివాళ్లని చేయడం తమాషా కాదు. రాధ గొప్పింటి బిడ్డ. వాళ్ల నీడని చేరదా మనుకున్న నీ ఆశ యిలా తగులడిన తర్వాత నీతులు చెప్పక ఏం చేస్తావ్‌లే. మావయ్య జాగ్రత్త తీసుకున్నాడు కాబట్టి రాధ నీ వలలో పడలేదు.

చల : ఇంక మీరు వెళ్లచ్చు. రాధ మాజీ ప్రియుడు మీ కెప్ప ట్నుంచొ తెలుసు. అది నేను గావడంవల్ల నా మొహం ముందు నన్ను తిట్టడానికి ధైర్యంలేక, నన్ను తెలీ నట్టు నటించి నన్ను దూషించిన మీ చాతుర్యం మెచ్చుకో దగ్గది. ఇకనుంచైనా యెదటబడి మాట్లా డటం నేర్చుకోండి. వెళ్లిరండి.

వెంక : (కోపంగా చూసేడు) నిన్ను చంపాలన్నంత కోపం. కానీ నేనుగా నిన్ను చంపను. నువ్వు తొరగా చావ డమూ యిష్టంలేదు. అయినా నేను నీ చావుని చూడాలి. వస్తాను. (వెళ్లిపోయాడు.)

(చలపతి తన చేతుల్లో ఉన్న అగ్గిపెట్టెనీ సిగ రెట్టుని మూలకి విసిరేడు. ఏమీ తోచలేదు. గ్రామఫోన్ కనుపిం చింది. ఇందాకటి రికార్డు పెట్టేడు. పాట పూర్తిగా విన్నాడు. ఆ తర్వాత అతని మనసు మారింది. గ్రామఫోన్ పెట్టె తీసు కున్నాడు. రికార్డూ తీసుకున్నాడు. గబగబా బైటకు వెళ్లి పోయాడు. తలుపు గొళ్లెంపెట్టి.

నిమిషం వరకూ ఆ గదిలోకి ఎవరూ రాలేదు. ఆ తర్వాత సాంబశివరావ్ యీల వేసుకుంటూ తలుపు తీసుకుని వచ్చాడు. అతను చాలా ఆనందంగా ఉన్నాడు. గదిలోకి వచ్చి కూర్చు న్నాడు. అతని చూపు హఠాత్తుగా ఒకచోట ఆగిపోయింది. అత నికి గ్రామఫోను కనుపించలేదు. ఖంగారుపడిపోతూ లేచాడు. ఒకమాటు లోపలిగది కూడా చూసొచ్చాడు. గదినుంచి బైటికి వెళ్లి వెంకటరత్నాన్ని పిలిచేడు.)

సాంబ : లేవండోయ్ ! కొంప మునిగిపోయింది బాబోయ్ !

వెంక : (ఆత్రంగా వచ్చేడు) ఏమైంది?

సాంబ : ఈ గదిలో చోరీ జరిగింది. మావాడి గ్రామఫోన్ పోయింది.

వెంక : (గది అంతా పరీక్షగా చూచి) ఇది చోరీ కాదు.

సాంబ : మరి.

వెంక : ఒక విధమైన తలతిక్క. మనిషిలో కలిగిన గొప్ప రియాక్షన్.

సాంబ : ఆశ్చర్యంగా ఉంది సుమండీ !

వెంక : అతను కాలేజీలో చదువుకుంటున్నప్పుడు మీ రతన్తో పాటు చదుకోలేదు. కదూ—

సాంబ : అఫ్‌కోర్స్—కావచ్చు.

వెంక : అతను కాలేజీలో చదువుకుంటున్నప్పుడు అతనో ప్రేమికుడని మీకు తెలీదు కదూ—

సాంబ : అఫ్‌కోర్స్. అదీ వప్పుకుంటాను. ఎంచేతంటే నేను ప్రేమిస్తున్నట్టు నేను చెప్పేదాకా నా ప్రేమ విషయం అతనికి తెలీదు. ప్రేమనేది స్వ విషయం. కొందరు చెప్పుకుంటారు. కొందరు చెప్పుకోరు. ఇంతకీ గ్రామ ఫోన్ పోటానికీ అతని ప్రేమకీ సంబంధమేమి టసలు ?

వెంక : మీరు చాలా అమాయకుల్లా కనిపిస్తున్నారు.

సాంబ : అఫ్‌కోర్స్. కావచ్చు. షేక్స్‌పియరూ, న్యూటనూ, గాంధి మొదలగు మహానుభావులంతా అమాయకుల్లానే కనిపించేవారట.

వెంక : (అతని మాట పట్టించుకోలే దసలు) ఇప్పుడు పోయిం దనుకుంటున్న గ్రామఫోన్ మూడేళ్ల క్రితం చలపతి బర్త్‌డే ప్రెజంటేషన్‌గా అతని కొచ్చింది. అతను రోజూ వింటున్న ఆ రికార్డు అతనికీ, అతని ప్రియు రాలికీ చాలా యిష్టమైనది. ప్రేమకానుక పదిలంగా దాచుకోవడం అవాస్తవికత కాదు. అవుతే రోజులన్నీ ఒక విధంగా ఉండవు. అతను ప్రేమించిన పడతి మరొహడి భార్య అయ్యింది. ఇప్పుడు ఆవిడ చావు బ్రతుకుల మధ్య కొట్టుకుంటోంది. అవి డిచ్చిన ప్రేమ కానుకని చూస్తో పాత రోజులు జ్ఞాపకం తెచ్చుకోడ మనేది యిన్నాళ్లూ మధురంగా ఉండేది. ఈవేళ కథ అడ్డం తిరిగింది. అతని మనసు చెదిరిపోయింది. ఇప్పుడు అదే ప్రేమకానుకని తను భరించలేడు. అది అతనికి కనిపించకూడదు. కాబట్టి ఇది చోరీకాదు.

సాంబ : వండర్‌గా ఉందే. నాకు తెలీని యీ విషయాలన్నీ మీకెలా తెలిసాయి.

సాంబ : అదేకాదు మీ ప్రేమ విషయమూ తెలుసు.

సాంబ : (అదిరిపడ్డాడు) తెలుసా? మీకు తెలుసా?

వెంక : గోడచాటునుండి వినడం సభ్యత కాకపోయినా మీ ఉప న్యాసం గోడల్ని చీల్చుకు నాచెవిని పడటంలో నాతప్పు లేదేమో!

సాంబ : అడగటం మరిచేను మాష్టారూ! మీరు ప్రేమ పక్షు లేనా?

వెంక : ఒకప్పుడు.

సాంబ : మరిప్పుడో?

వెంక : నా గురించి మీకు నేను చెప్పుకోడం ఇష్టంలేదు. అంతా వింటే నామొహం ముందే తిట్టేస్తారు. సిన్నర్నని దూషిస్తారు. బైదిబై— నాకు పాపపుణ్యాల మీద నమ్మకం బొత్తిగా లేదు. రెండేళ్ల క్రితం రైల్లో ఒక క్రిష్టియన్ కలిశాడు. అతను మత ప్రచారకుడుట. ఈ ప్రచారాలపై నాకు గౌరవం ఆనాడూ లేదు ఇప్పుడూ లేదు. అతను నన్నడిగేడు—"ఓ మనిషి! నువ్వు పాపివా?' అని. అది వింటూనే నవ్వొచ్చింది. నాకు. వెంటనే జవాబు చెప్పేను. "నేను పాపిని కాదని తెలుసు. నీ సంగతి మాత్రం తెలీదు" అని. అతను తల దిమ్మెత్తేలా ఆశ్చర్య పోయాడు. పక్క స్టేషనులో చెప్పకుండానే దిగేశాడు. (చిన్నగా మొదలైన నవ్వు వికృతంగా మారింది.)

సాంబ : ఇప్పుడు మిమ్మల్నేమని సంబోధించాలో తెలీకుండా ఉంది.

వెంక : ఇప్పుడేకాదు, ఎప్పుడూ నన్ను వెంకటరత్నమనే పిలుస్తుండండి. (భుజం తట్టాడు) వస్తాను. మీ ప్రేమ గురించి కమ్మని కలలు కనండి. (వెళ్లిపోయాడు, సాంబ శివరావ్ తెల్లబోయి నుంచున్నాడు)

## 2

(అదే రూము. సమయం ఉదయం. సాంబశివరావు బొమ్మ బొరుసూ వేస్తూండగా చలపతిరావ్ బైటకు వెళ్లబోతున్నాడు. అతను చాలా మారిపోయాడు. మనిషిలో మార్పు కొట్టొచ్చినట్లుంది. గడ్డం మాసింది. జుత్తు రేగి ఉంది. కళ్లు లోపలికి పీక్కుపోయినట్లున్నాయి)

సాంబ : నీతో మాటాడాలనుకుంటే మూడు రోజుల్నుంచీ కుదరడం లేదు.

చల : అలాగా!

సాంబ : ఈ మూడు రోజుల్లోనూ మూడు గంటలున్నావేమో రూములో—అవునా?

చల : అవుతే!

సాంబ : మిగతా కాలం ఎక్కడ గడుపుతున్నావ్?

చల : (తల దువ్వుకుంటో) తెలుసుకోవాలని ఉందా.

సాంబ : గ్రామఫోన్ ఏంచేశావ్?

చల : (దువ్వుకోడం పూర్తయింది) సముద్రంలో పారేద్దామనుకున్నానుగానీ మనసొప్పక ఓ ఫ్రెండుకి దానం చేశాను.

సాంబ : నేనో సలహా ఇవ్వనా చలపతీ.

చల : ఏమిటో అది.

సాంబ : పెళ్లి చేసుకో.

చల : ఇప్పుడా విషయమెందుకు వచ్చిందసలు?

సాంబ : ఎన్నాళ్లని దాస్తావ్. పాపం...నిన్ను చూస్తుంటే జాలి వేస్తుంది బ్రదర్!

చల : (ఏదో మరచిపోయేడు గాబోలు, లోపలికెళ్లాడు)

సాంబ : భగ్నప్రేమ గుండెల్ని కోస్తుందిట. మనిషిని నిలువునా చిత్రవధ చేస్తుందిట. ఇన్నాళ్లు నీ సంగతి తెలీదు నాకు. నిక్షేపంలాంటి కుర్రాడనుకున్నాను. ఏ దిగులులేని అదృష్ట జాతకుడనుకున్నాను.

చల : (గబగబా బైటకొచ్చాడు. అతని చేతిలో వాచీ ఉంది) ఇప్పుడు నాకేం జరిగిందని నీకింత చింత ?

సాంబ : (అతని మొహంలోకి చోద్యంగా చూశాడు) నువ్వలా అనుకుని అంతా మరచిపోతే నిజంగా నాకే చింతా ఉండదు. ఆ పిల్ల కాకపోతే మరొకళ్లు. నువ్విష్ట పడాలేగానీ ఆడ పిల్లలకి మనదేశంలో కొరతలేదు.

చల : మతి పోతోంది నీకు.

సాంబ : (అభిమానం దెబ్బతిన్నది) నాకు మతిపోడమెందుకు? రేపోమాపో లలితను పెళ్లాడేస్తాను. ఆమె అంగీకారమూ సంపాయించేను. వాళ్ల పెద్దవాళ్లూ ఒప్పుకుంటారనే అన్నది. కాబట్టి నా ప్రేమ మంట గలవదు. నేను భగ్న ప్రేమికుడిని కాలేను. కానీ నువ్వు.........

చల : (అరిచేడు) సాంబశివరావ్.

సాంబ : గ్రామఫోన్ దానం చేసినట్టే ఆ పిల్లనీ దానం చేశానని సరిపెట్టుకో.

చల : షటప్. మితిమీరి మాట్లాడుతున్నావ్.

సాంబ : ఏమైనా అను. నువ్వు మునుపటి చలపతివి కావాలి. ఈ షికార్లు మానాలి. పుస్తకాల పురుగువి కావాలి.

చల : మీరెవ్వరికీ మతుల్లేవు. ఇప్పుడు నాకేం జరిగిందని ఇంత ఉపదేశం?

సాంబ : నిజంచెప్పు. గ్రామఫోను ఎందుకు దానం చేశావ్?

చల : పాతదయ్యింది కాబట్టి.

సాంబ : అది నీబర్తుడే ప్రెజంటేషన్. నీకు ఆ అమ్మాయి ఇచ్చిన ప్రేమకానుక. దాన్నంత తేలిగ్గా దానం చేయలేవు. నీ గుండెల్లో ఓ మూలకలత రేగింది. తుఫాన్ ప్రారంభమైంది.

చల : ఆ వెంకటరత్నం చెప్పేడా నీకు?

సాంబ : అంతాకాదు. కొంత నేను ఊహిస్తున్నాను.

చల : (తూలిపోయాడు. రిష్టుకి వాచీ పెట్టుకున్నాడు. టేబిల్ మీద చేరగిల పడ్డాడు) నువ్వు చాలా శ్రమ తీసుకున్నావ్ సాంబశివరావ్.

సాంబ : (పేలవంగా నవ్వేడు) షటప్ అన్నావు. మితిమీరి మాటాడుతున్నాననీ అన్నావు.

చల : ఆ వెంకటరత్నం నన్ను తినేస్తున్నాడు. వాడి విషపు నవ్వూ వాడి నక్కజిత్తులూ, వాడి పర్సనాలిటీ నా మనసుని పాడు చేస్తున్నాయి. నేను చావాలిట. నా చావుని వాడు చూడాలిట.

సాంబ : (అదిరిపడ్డాడు) వాట్?

చల : దానికి కారణం లేకపోలేదు. రాధని ప్రేమించేను. వాడు కామించేడు. నేను పరిస్థితులకి తలొంచేను. వాడు పరిస్థితుల్ని తనకి అనువుగా మార్చుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. నాభయం—రాధకి పీడు కీడు చేయగల డేమోనని. ఆమె పచ్చటి సంసారంలో నిప్పులు పోయగల దుర్మార్గుడు. అది చాలదన్నట్టు మాపైన స్కేండల్స్! నావల్ల... (కంఠం రుద్ధమైంది) రాధ చావు బ్రతుకుల మధ్య ఉందిట. దానికి కారణం నేనట. నేను! (మాటాడలేక పోయాడు. మొహాన్ని తన చేతుల్లో దాచుకున్నాడు)

సాంబ : (అతని దగ్గరిగా వెళ్ళేడు) నాకిన్నాళ్ళూ ఈ విషయం తెలిసిందిగాదు.

చల : (కళ్ళొత్తుకున్నాడు) వెంకటరత్నానికి కావలసింది నేను. రాధని ప్రేమించింది నేను. నన్ను హింసించడం వెంకటరత్నానికి సరదా. ఇది ఒకవిధమైన వేట. నీకు తెలీదుగాని ఇన్నాళ్ళూ నేనెంతో కుమిలిపోయాను. నాముందే రాధని తిట్టేవాడు. నాముందే రాధని అసహ్యించుకునే వాడు. ,ఇదంతా నేనెవరో తెలీక మాటాడుతున్నాడనుకున్నాను. కానీ....వాడికన్నీ తెలుసు. ఇది హత్యకంటే గొప్పది. నా సహనాన్ని పరిక్షించేడు. ఏమి తెలీనట్టు నటించి నన్నిన్నాళ్ళు చంపుతూ వచ్చాడు. మొన్న వాడి చర్య నా సహనాన్ని చంపింది. రేపు....రాధ చచ్చిపోతే.... దానికి మొదటి కారణం నేనుట. నావల్లనే రాధ సుఖపడలేక పోయిందట. నాకిప్పుడేమనిపిస్తుందో తెలుసా సాంబశివరావ్!... ఈ చదువు కట్టిపెట్టి— ముఖ్యంగా వెంకటరత్నం బారినుండి తప్పించుకు పారిపోవాలనీ— ఎవరికీ తెలీని చోట అన్నీ మరచి బ్రతకాలనీ—

సాంబ : (గాబరా పడేడు) కొంచెం ఆగు. నన్ను చెప్పనివ్వు ఇప్పుడు నీ కథ నాకర్థమైంది. ఆ బరువేదో నా నెత్తినుంచు. నేనిటునుంచి నరుక్కొచ్చి వాడి చాత ముప్పై మూడు చెరువుల నీళ్ళు తాగిస్తాను. మన సంగతి వాడికి తెలీదు కాబోలు. ఎంత నాటకం ఆడేడూ. నువ్వు నిర్భయంగా ఉండు చలపతీ! మరీ అంత అవసరమైతే రూము మార్చి మరోచోట ఉందాం. నీ కెందుకు. వాడి సంగతి నేచూస్తాగా.

చల : నేనెందుకిలా తయా రౌతున్నానో అంతుపట్టకుండా ఉంది. చాలా మారిపోవాలనుకున్న నా ప్రయత్నం వెంకటరత్నం వల్ల కొనసాగడం లేదు. ఏనాటి పాపమోగానీ నాకీ యముడు దాపురించేడు. (''దూరాన నారాజు....సన్నగా వినిపిస్తోంది. అతను మాటాడుతూనే ఉన్నాడు) అవే స్మృతులు...అదేపాట...ఆ రోజులన్నీ గుర్తుకొస్తున్నాయి. చేయి జారిన ఆనందం. అప్పటి అందమైన ఊహాగానాలు, రంగుల కలలూ (చెవులు మూసుకున్నాడు. పాట వినిపించడమూ ఆగిపోయింది.) చలపతీ నీకు చావు రావడం లేదుగానీ చచ్చేంత చావు ననుభవిస్తున్నావ్. అనుభవించు.

సాంబ : (కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి) నా కేడుపొస్తోంది (బొమ్మ బొరుసు వేశాడు.) అవును నిజంగానే ఏడుపొస్తోంది. నువ్వు బైటకి వెళ్ళిపో చలపతీ. వెళ్ళు. నన్ను ఒంటరిగా ఉండనివ్వు. నన్ను ఆలోచించుకోనివ్వు.

(చలపతిరావ్ వెళ్ళిపోయాడు నెమ్మదిగా. సాంబశివరావ్ పడక్కుర్చీలో వాలిపోయాడు. కాసేపు ఏదో ఆలోచించాడు. గబ గబా లోపలి గదిలోకి వెళ్ళి గాజు కూజా గ్లాసూ తీసుకొచ్చేడు. కూజాలో ఉన్న నీళ్ళని గ్లాసులో ఒంచుకుంటూ—)

సాంబ : ఇది బ్రాందీ అనుకుందాం. ఇప్పుడు నేను దుఃఖిస్తున్నాను కాబట్టి తాగుతాను. (తాగేడు) నిషా ఎక్కలేదు మరి. నాచుట్టూ భూమి తిరగడం మాని సూర్యుడి చుట్టూ తిరుగుతూందిట. (మరికొంచెం తాగేడు) తాగడంలో సుఖం ఉందని చెప్పిన తాగుబోతెవడోగాని, వాడుత్త ఫూల్! ఏదీసుఖం! ఎక్కడ! దాని విలువెంత? సారీ.... నే తాగింది ప్యూర్ వాటర్. వాడు తాగేది ఫక్తు బ్రాందీ. ఏదైతేనేం. తాగేందుకు అనువుగా ఉన్న ద్రవ పదార్థం. నవ్వు కున్నాడు. ఏదో ఆలోచించి మరింత బిగ్గరగా నవ్వి, నవ్వు నాపుకుంటూ—ఓ యబ్బో! ఇప్పుడు అచ్చం తాగిన వాడిలాగే మాటాడేశాను. (సిగరెట్టు వెలిగించేడు) ఇప్పుడు

మూంచి ఇదిలో ఉన్నాను. ఊ....ఎవడ్రా వాడూ! చలపతిని తినేదెవడ్రా? వాడి పీక పిసికేద్దును. డేం రాస్కెల్! స్కౌండ్రల్! వ్వే రార్వ్యా...ఐ వాంట్ టు కిల్ యూ—నిన్ను చంపాలని నాకోరిక! (లేచి గుమ్మం వైపుకి ఒస్తూ తూలిపడ పోయి తమాయించుకు నిలబడ్డాడు. అప్పటికి గుర్నాథం గుమ్మంటగ్గర నిలబడిఉన్నాడు భయంగా. లాల్చీ పై జామా, కళ్లజోడూ, మధ్య పాపిడి, కొంచెం చాదస్తం ఉన్న మనిషిలానే ఉన్నాడు. ఇప్పుడు సాంబశివరావ్‌ని చూస్తూ ఒణికిపోతున్నాడు.)

గుర్నా : ఏమండోయ్ గురూగారూ !

సాంబ : (అతన్ని చూసేడు. సిగ్గుపడి మామూలు స్థితిలోకి ఒచ్చేశాడు.)

గుర్నా : ఏమిటండి బాబోయ్ ఇది! గుర్రం ఎక్కేరా?

సాంబ : (అర్థం కాలేదు) అంటే.

గుర్నా : పాపం కొత్తలాగుంది. అందుకనే నడిచే ఓపికగానీ మెల్లిగా మాటాడే గుణంగానీ మచ్చుకైనా కనుపించ లేదు. మొదట్లో అలాగే ఉంటుందిలేండి. రానురానూ అలవాట్లై పోగలరు....

సాంబ : (నవ్వేడు) అంటే మీరూ పప్పులో కాలేశారన్న మాట. నేను తాగింది నీళ్లండి. నీళ్ళు.

గుర్నా : నీళ్లే! చంపారుగదండీ గురూగారూ! అసలు తాగడంలో ఎన్నెన్ని రకాలున్నాయో తెలుసుకోవాలనుకుంటే మా వాడిని కనుక్కుంటే చాలు.

సాంబ : మీ వాడా?

గుర్నా : అవును మా వాడే. ఒకనాఢు మా వాడేం జేశాడనీ—

సాంబ : మీరెవరో నాకు తెలీదు.

గుర్నా : మీరూ నాకు తెలీదు.

సాంబ : నాపేరు సాంబశివరావ్.

గుర్నా : నాపేరు గుర్నాథం.

సాంబ : ఈ గదిలో మరో ఫ్రెండుతో అద్దెకుంటున్నాను.

గుర్నా : మీ పక్కగదిలో అద్దెకుంటున్న మావాడికోసం వచ్చాను.

సాంబ : మీ వాడా?

గుర్నా : అవును మా వాడే! ఒకనాడు మావాడేంజేశాడనీ—

సాంబ : వెంకటరత్నం—

గుర్నా : (గట్టిగా నవ్వేడు) ఆ...వాడే....వాడే మా వాడు.

సాంబ : మీరతనికోసం వచ్చారా?

గుర్నా : (తలాడించేడు—రెండో చేతులోకి సూటుకేసు మార్చుకుంటూ)

సాంబ : అతను లేడు.

గుర్నా : తెలుసండి. ఆ సంగతి అడుగుదామనే ఒచ్చాను.

సాంబ : అతనెప్పుడొస్తాడో తెలీదు.

గుర్నా : (రెండడుగులు లోపలికేశాడు) వాడొచ్చేంతవరకు ఈ గదిలో ఉంటాను. ఏమంటారు సింహాచలంగారూ!

సాంబ : (ఉలిక్కి పడ్డాడు) నాపేరు సింహాచలం కాదు.

గుర్నా : నామతి పోనూ మీపేరు సాంబశివరావ్ కదూ!

సాంబ : చూస్తుంటే మీకు లేనట్టే కనిపిస్తోంది మరి.

గుర్నా : అని ఎవడో మతిలేని వాడనాలి? మీకేం. నిక్షేపంలాంటివారు. నాకు మతిపోయిందని ఎలా అనగలరు? ఊరికే కోస్తున్నారంతే.

సాంబ : మీరేం చేస్తుంటారు?

గుర్నా : వ్యాపారం గురూగారూ! ఏదో గడచిపోతుంది లేండి. (నిద్ర వస్తుంది కాబోలు గట్టిగా ఆవిలించేడు. బద్ధకంగా ఉందేమో ఒళ్లు విరుచుకున్నాడు)

సాంబ : రైల్లో ఒచ్చారేమిటి?

గుర్నా : ఏం రైల్లో లెండి, ఒళ్లు హూనం చేసింది.

సాంబ : బాగా రష్‌గా ఉండి ఉంటుంది.

గుర్నా : ఏం రష్షో లేండి ప్రాణం పోయింది.

సాంబ : రైలు ప్రయాణం అందునా దూర ప్రయాణమేమో—

గుర్నా : ఏం దూరం లెద్దురూ! దుంప తెంపేస్తేనూ.

సాంబ : రాత్రి ప్రయాణం కదంటండీ!

గుర్నా : (మళ్లా ఆవిలించేడు) ఏం ప్రయాణమో లేండి...చివరి కొచ్చి చేరుకున్నాను. అదే చాలు.

సాంబ : దానికి తగ్గట్టు మీ వాడూ లేడు.

గుర్నా : ఏం మా వాడో లేండి. వాడెప్పుడూ యింతే (కళ్ళు మూసుకు పోతున్నట్టుంది. మత్తుగా అన్నాడు) ఒక.. నాడు...మా వాడేం జేశాడనీ......

సాంబ : మీకు నిద్రొస్తుంది కాబోలు !

గుర్నా : (ఇంకా మత్తుగా అన్నాడు) ఏం నిద్రో లేద్దురూ...పాడు నిద్ర...కళ్లమీదకి ముంచుకొస్తుంటేనూ. పోనీ వాడివి కలుసుకోకుండానే వెళ్లి పోదామనుకుంటే, రేప్పొద్దున్న నేనొచ్చి వెళ్లినట్లు తెలుస్తే (ఆవలించేడు చిటికేస్తూ) నా చర్మం ఒలిచేస్తాడు. ఒక్కనాడు మావాడు ఏం జేశాడనీ.....

సాంబ : (బొమ్మ బొరుసు వేశాడు.) ఆల్‌రైట్. అవుతే మీరిక్కడే పడుకోండి. నేను మళ్లా ఇప్పుడే ఒస్తాను. ఏమంటారు?

గుర్నా : నేనుంటాన్లెండి. వెళ్లిరండి.

సాంబ : ఇప్పటివరకు మా రూమ్మేటు గురించి ఎదురు చూశాను. వాడు రాలేదు. కాసేపట్లో రావచ్చు. మీ దగ్గరేమైనా డబ్బులున్నాయా మాస్టారూ?

గుర్నా : ఏం డబ్బులో లేండి. ఉన్నాయి. ఎంత?

సాంబ : ఎంతో ఎందుకు లేండి. అయిదు చాలు.

గుర్నా : (సూటుకేసు టేబిల్ మీదపెట్టి, తెరచి దాన్లోంచి ఓ మూట తీశాడు. ఒక్కో పొర ఊడదీశాడు. రెండు నిమిషాల తర్వాతగానీ పర్సు దొరకలేదు. దాన్లోంచి అయిదు రూపాయల కాగితం తీసి ఇచ్చాడు.)

సాంబ : (తీసుకున్నాడు) డబ్బు విషయంలో మీరు చాలా జాగ్రత్త తీసుకుంటారు కాబోలు.

గుర్నా : ఏం జాగ్రత్తో లేండి! పోయే డబ్బు పోతూనే ఉంది మరి.

సాంబ : అచ్చా సార్! థేంక్యూ. మీరింక రెస్టు తీసుకోండి. బై. (వెళ్ళిపోయాడు)

గుర్నా : (సూటుకేసులోంచి నైట్ డ్రెస్ తీసుకుంటో) ఏం రెస్టో లెండి. ఈ పాడుజీవికి రెస్టు గూడాను. మీరు మాత్రం (అప్పటికిగాని సాంబశివరావ్ వెళ్ళిపోయినట్టు గమనించలేదు)—తొరగా రండి. ఏం ఒస్తారో ? (అవి లింత వచ్చింది. ఆవిలిస్తూనే లోపలి గదిలోకి వెళ్ళాడు. బట్టలు మార్చుకుని మళ్ళా వచ్చాడు. సూటుకేసు లోపల పెట్టాడు. మంచినీళ్ళు తాగేడు. మరోమాటు వళ్ళు విరుచుకుని పడక కుర్చీలో నడుం వాల్చాడు. అయిదు నిమిషాల తర్వాత గురక ప్రారంభ మైంది. మరి కాసేపట్లో పెద్దదైంది.)

(పరంధామయ్య వచ్చాడు. ఏభై సంవత్సరాల వ్యక్తి. బక్కగా రెపరెపలా ఉన్నాడు. గుమ్మందగ్గ రేనించుని చేత్తో తలుపు తట్టారు. గుర్నాథం వినిపించుకునే స్థితిలో లేడు. మరోమాటు తట్టారు. అయినా లాభం లేకపోయింది.)

పర : ఇదో బాబూ ! ఓ బాబూ !

గుర్నా : ఏంబాబోలేండి. ఎవరో మీరు ? (నిద్రలోనే అనేశాడు)

పర : నిద్ర లేస్తావూ ?

గుర్నా : లేవన్లేండి. మళ్ళా రండి.

పర : (లోపలికొచ్చి కూర్చున్నాడు. పైమీద టవల్తో మొహం తుడుచుకున్నాడు. మరోతడవ గుర్నాథంవైపు ఆశగా చూస్తో—) చదవులు మాని సినిమాలు షికార్లూ యెక్కువైతే యిదిగో యిలా తగులడక ఏమవుతుంది మరి. ఓ బాబూ! మర్యాదకోసమైనా లేవవయ్యా !

గుర్నా : (లేచి నించుని కళ్ళు మూసుకునే అన్నాడు) ఏం మర్యాదోలేండి. లేచి నిలబడ్డానుగా ఏంకావాలో చెప్పండి.

పర : (పరీక్షగా చూచేరు) నించునే నిద్రపోతున్నావ్ లాగుందే. కళ్ళు విప్పు బాబూ !

గుర్నా : (కళ్ళు విప్పి పరంధామయ్యని చూసేడు. కొంచెం తత్తర పాటు చెందేడు) ఎవరు కావాలి మీకు ?

పర : అబ్బాయ్ సాంబశివం.

గుర్నా : అబ్బాయ్ సాంబశివమా ?

పర : మరే .....

గుర్నా : ఆ పేరుగలవా ళ్ళెవరూ యిక్కడ లేరే. పక్కవీధిలో కనుక్కోలేక పోయారూ ?

పర : అదీ అయ్యింది. ఈగదనే చెప్పారు.

గుర్నా : ఏం చెప్పడమో లేండి. అబ్బాయ్ సాంబశివమనేవా ళ్ళెవరూ ఇక్కడ లేరు.

పర : ఇంతకీ నువ్వెవరి వసలు ?

గుర్నా : నాపేరు గుర్నాథం.

పర : అబ్బాయ్—

గుర్నా : (విసుగుపుట్టింది. బద్ధకంగానూ ఉంది) ఏం అబ్బాయో లేండి ....

పర : (కోపం వచ్చింది) ఏమిటయ్యా నీ హడావిడి. మాట వినిపించుకోవే అసలు. ఏమైనా చాదస్తమా ఏమిటి ?

గుర్నా : నా పేరు గుర్నాథం.

పర : అద్భురే !

గుర్నా : ఏద్భురే ?

పర : హారి నీ హంగామా బంగారంగానూ. మాటమాటకీ ఆలా అడ్డుపడతా వేమయ్యా నాయనా ? నువ్వు ....

గుర్నా : అబ్బబ్బ నా పేరు గుర్నాథం. గుర్నాథం. గుర్నాథం. సరా?

పర : నీ ఛాదస్తం గూల. ఈ గదిలో యెంతమంది ఉంటున్నా రసలు ?

గుర్నా : అది నాకేం తెలుసు ?

పర : (ఉలిక్కిపడ్డాడు.) ఇదేమిటి ?

గుర్నా : అవును. అది నాకేం తెలుసు ?

పర : నువ్వు యీ గది తాలూకు మనిషివి కాదా ?

గుర్నా : మాదీఊర. కాదు. చుట్టం చూపుగా వచ్చాను.

పర : అలా చెప్పు. అవుతే నీకు తెలీదులే ! అబ్బాయ్ సాంబశివం—

గుర్నా : నాకు సాంబశివరావుగారు తెలుసు.

పర : (ఎగాదిగా చూచి) ఆ సాంబశివరావ్ సంగతే అడుగు తూంట. అతను మా అల్లుడు. అతనీ గదిలోనే ఉంటు న్నాడు కదూ.

గుర్నా : ఏం ఉండటమోలేండి. ఇక్కడే ఉంటాడు. ఇప్పుడే బజారు వెళ్లాడు. మళ్లీ వస్తాడు.

పర : వస్తాడు. ఎందుకురాడు. వస్తాడు.

గుర్నా : అవును. వస్తాడు.

పర : హు.... ఎంత వయస్సొ ఉంటే ఏం లాభం. ఏం చదువుతే ఏం ప్రయోజనం మనిషన్న తర్వాత బుద్ధీ, జ్ఞానం ఉండాలి. విశ్వాసం ఉండాలి.

గుర్నా : ఏం విశ్వాసమోలేండి.

పర : వాడు కృతఘ్నుడు. నీచుడు. దుర్మార్గుడు.

గుర్నా : (ఖంగారు తిన్నాడు. దెబ్బతో నిద్ర తేలిపోయినట్టయింది) ఈ దాడి సాంబశివరావ్‌గారి మీదనే ?

పర : ఏం ? నీకు చింతగా ఉందా ?

గుర్నా : ఏమి చింతోలేండి. వింటూన్నవాడికి మతులు పోతేను.

పర : నా మాటలేం వింటావులే. వాడు చేసింది తలుచుకుంటూంటే గుండెల్ని కోసేస్తుంది. ప్రేమిస్తాడు. ప్రే..... మ!

గుర్నా : (పకపకా నవ్వేసి ఆనక అన్నాడు) ప్రేమే ? ప్రేమ !

పర : ప్రేమే ! కానీ నువ్వెందు కలా నవ్వేవ్ ?

గుర్నా : మీ విట్టుకి ! బలే హాస్యం చేస్తారు మీరు.

పర : నీ కేమైనా పిచ్చా ఏమిటయ్యా ! అల్లుడు ప్రేమించాడని చెబితే పొట్ట పగిలేట్టు నవ్వి పైగా హాస్యగాడినంటావూ ?

(చలపతి వచ్చాడు. అతన్ని చూచి యిద్దరూ మాటలాడేరు. మునుపు యీ యిద్దర్లోనూ ఎవర్నీ చూడలేదు గనక చలపతి కొంచెం బిత్తరపోయేడు. క్షణాలు నిశ్శబ్దం. తర్వాత గుర్నాథమే మాట్లాడేడు.)

గుర్నా : రండిరండి. సాంబశివరావుగారి గురించి మాట్లాడుకుంటున్నాం. వీరు పరంధామయ్యగారని—సాంబశివరావుగారి మావయ్య.

చల : నమస్కారమండి.

పర : నమస్కారం బాబూ !

గుర్నా : (చలపతిని పరంధామయ్యగార్కి పరిచయం చేయబోయేడు కానీ అతను తెలీకపోవడంతో మాట నాన్చి అన్నాడు) వీరు .... నాకు తెలియదు. మీరే పరిచయం చేసుకోండి గురూగారూ.

చల : (గుర్నాథం ధోరణికి ఆశ్చర్యపోయేడు) చలపతిరావ్ నాపేరు. మీ సాంబశివం రూమ్మేటుని. ఇద్దరం కలిసి చదువుకుంటున్నాం.

పర : (నిష్ఠూరంగా అన్నాడు) నువ్వా బాబూ! కొంచెం ఒళ్ళు దగ్గరెట్టుకుని తిరుగు. నువ్వు మావాడికి చేసిన సాయం చాలు గానీ నీకో నమస్కారం బాబూ !

గుర్నా : (మళ్ళా నవ్వేడు) భేష్ .... మహా మంచి తిట్లు ....

పర : ఇదిగో మతిలేనిమనిషి ! నువ్వు కాస్త నోరు మూసుకొందూ ! చూడు చలపతీ—ఇలా ఎందరి కొంపలు ముంచాలనుకున్నావ్ నాయనా ?

చల : మీ రంటున్న దేవిటో అర్థం కావడంలేదు నాకు.

గుర్నా : (ఆవిలింత వచ్చింది. ఆపుకు మరీ అన్నాడు) అందికే అన్నాను గొప్ప తిట్టేస్తున్నారని.

(పరంధామయ్య గుర్నాథంవైపు కళ్లెర్రజేసి చూశాడు. గుర్నాథం భయపడ్డాడు.)

గుర్నా : మధ్య నా కెందుకు బాబూ ! నాకు నిద్దరొస్తుంది. పోయి పడుక్కుంటా (లోపలిది గదిలోకి వెళ్లిపోయాడు.)

పర : ఛీ.... ఛీ .... మర్యాదా, మన్ననా ఏమీ లేవు. అందరూ పశువులు.

చల : (అదేమీ పట్టించుకోలేదు. నిలువుటద్దం ముందు నించుని చొక్కా విప్పుకోబోతున్నాడు.)

పర : చెట్టంత పెద్దమనిషిని నోరుచేసుకు నిలా మాట్లాడుతూంటే ఒకడేమో నిద్రంటాడు. ఇంకోడేమో అద్దంలో చూచుకుంటాడు. ఇదేనా మర్యాదా ?

చల : (కోపంగా వెనక్కి తిరిగేడు) చాలా అనవసరంగా మాట్లాడుతున్నాడు. మర్యాద తెలీని మనుషు లెవరో తెలుస్తూనే ఉంది.

పర : తలుచుకుంటూంటే కడుపు తరుక్కుపోతుంది. ఓపక్క మా కొంప అంటుకుంటే మీ కది చీమ కుట్టినంతైనా బాధనిపించడంలేదు. పైగా ఎకసెక్కాలూ నవ్వులూను. ఇందుకేనా ఇంతింత చదువులు చదువుకుంది.

చల : ఇప్పుడు మీకు జరిగిన అన్యాయ మేమిటి ? దానికి నే నెంతవరకూ బాధ్యుడ్ని ?

పర : అన్యాయం అని నెమ్మదిగా అడుగుతువా బాబూ ! ఓపక్క కొంపే మునిగిందని చెబుతూంటే, మావాడు, మా అల్లుడు సాంబశివరావ్ ప్రేమించాడుట. అది నీకు తెలీదు ?

చల : (కారణం తెలిసింది. అంచేత కొంచెం కుదుటపడ్డాడు. తెలుసు.

పర : అదే. అదే నా బాధ. నీ కన్ని విషయాలూ తెలుసు. వాడి ప్రేమ నువ్వూ మెచ్చుకుంటున్నావ్. వాడిని నమ్ముకున్నవాళ్లు నడిగంగలో మునిగినా సరే. అది నీ కనవసరం.

చల : ఒకళ్ల సొంత విషయాల్లో జోక్యం కల్పించుకోవాలనే తాపత్రయం నాకు లేదు.

పర : మరలాటి వాడివి గమ్మున ఊరుకోవాలి గాని ప్రేమ పాఠాలు వాడికి నువ్వేందుకు నేర్పాలి ?

చల : అలా అని మీ కెవరు చెప్పారు?

పర : నా కొచ్చింది ఆకాశరామన్న ఉత్తరమైతే నే నింతదూరం వచ్చేవాడిని గాదు. ఎవరో పెద్దమనిషి వెంకటరత్నం గారట. ఆయన వ్రాశారు.

చల : (వెంకటరత్నం పేరు వినగానే ఉలిక్కిపడ్డాడు.)

పర : దేశంలో యింకా మంచి మనుషు లున్నారు. వాళ్ల కళ్లు కప్పడం మీతరం కాదు. వెంకటరత్నంగారు మీ యిద్దరి గురించి నా కెన్నో వ్రాశారు. ఎవరో ఆ లలితమ్మ కనిపిస్తే దాని అంతూ వీడి అంతూ తేల్చిపారేద్దును. (ఉత్తరం తీశాడు) ఇదిగో చదువు. నువ్వే చదువు.

చల : (వెంకటరత్నం వ్రాసిన ఉత్తరం చదివేడు) పరంధామయ్యగార్కి, మీ సాంబశివరావ్ నాకు బాగా తెలుసు. అతని పుస్తకాల్లో మీరు వ్రాసిన ఉత్తరం దొరికింది. మీరు అతనిపైన చాలా ఆశలు పెటుకున్నట్టు గ్రహించగలిగేను. కానీ, అతను మిమ్మల్ని మోసం చేస్తున్నాడు. లలిత అనే అమ్మాయిని ప్రేమించాడు. చలపతిరావ్ అనే అతని రూమ్మేటు అతన్ని సర్వ విధాలా పాడుచేస్తున్నాడు. మీరోమాటు వస్తేగాని పరిస్థితులు చక్కబడవు. ఇది ఆకాశరామన్న ఉత్తరం కాదు కాబట్టి, నన్ను మీరు తప్పకుండా మెచ్చుకోవాలి. —వెంకటరత్నం

పర : (ఉత్తరం తీసుకున్నాడు.) చదివావుగా. కాబట్టి నేనింక ఆట్టే వాగక్కర్లేదు.

చల : అతను ప్రేమించినమాట నిజమైతే గావచ్చు కానీ నా మనస్సాక్షిగా, అతన్ని పాడుచేయాలనే దుర్బుద్ధి నా కేనాడూ లేదు.

పర : నా బాధా అర్థం చేసుకో చలపతి. వాడి కింత డబ్బు తగలేసి చదువు చెప్పిస్తున్నానుగదా—నాకా అన్యాయం చేస్తే ? పైగా—పెళ్లికానివాడు ప్రేమిస్తే కొంత అర్థముంది. వీడికేం తెగులు ? నిక్షేపంలాంటి భార్యని—

చల : (ఆశ్చర్యపోయాడు) సాంబశివానికి పెళ్లయిందా ?

పర : అందుకేగా బాబూ ! ఆపసోపాలు పడుకుంటూ యింత దూరం వచ్చింది.

చల : నాకీ విషయం యింతవరకూ తెలీదుసుమండీ.

పర : (మరింత ఆశ్చర్యపోతూ) నీకూ తెలీదూ ? అవుతే నిన్నూ మోసగించాడన్నమాట. వాడు చేస్తోన్న ఘోరం యింతా అంతా కాదు బాబు. మా సంసారాన్ని నడివీధిలో పెట్టేడు. వాడు కోరితేనే నా కూతుర్నిచ్చి పెళ్లిచేశాను. ఇంకా చదవాలని ఉందంటే చదువూ చెప్పిస్తున్నాను. ఇంతకంటె ఏ మావ చేస్తాడు ? ఇంతా చేస్తూన్న నాకే వాడు కీడు తల పెట్టాడు. నా కూతురి గొంతు కోస్తూన్నాడు. రేపో మాపో ఆ లలితమ్మ గొంతూ కోసేస్తాడు. ఆ .... అది నిజం.

చల : ఇప్పుడు మీ రిన్ని చెప్పిన తర్వాత నాకూ గుర్తొస్తుంది. అతను లలితను ప్రేమించడంలేదు. ఆపిల్ల వెనకనున్న డబ్బుని ప్రేమిస్తున్నట్టు అతనే చెప్పేడు.

పర : కాబట్టి వాడికిరాతకం నీకూ అర్థమై ఉంటుంది. వాడిని క్షమించేందుకు దేవుడూ ఇష్టపడడు. వాడు పాము నాయనా ! ఇన్నేళ్లూ నా యింట్లో పెరిగి, నా ఉప్పు తిని నాకే అపకారం చేస్తున్నవాడికి—యిక స్నేహితులూ, ఆడపిల్లలూ, వాళ్ల తల్లితండ్రుల ప్రపంచం—యివన్నీ లెఖ్ఖా జమా ?

చల : చాలా అన్యాయంగా ఉంది. ఇన్నాళ్ళూ ఒకే గదిలో ఉంటూన్నా గూడా అతనికి పెళ్లయినట్టు చెప్పనే లేదు. అతను రానీండి. సంగతేమిటో కనుక్కుందాం. బుద్ధి చెప్దాం.

పర : చాలు బాబూ ! ఈ చల్లటిమాట చాలు. నువ్వు నా పక్కన నిలబడ్డావంటే వాడి అంతేమిటో నేను చూస్తాను. ఈ చదువుకీ, దిక్కుమాలినవాడి ప్రేమకీ తిలోదకా లిప్పించి యింటికి తీసుకుపోయి, రెండు కాళ్లూ కట్టి గదిలో పెట్టి తాళంవేస్తాను. నాటకం ఆడతాడూ నాటకం.

చల : కానీ—మనిషిని చూడగానే చెడ్డవాడని ఎవరూ చెప్ప లేరు.

పర : అదే బాబూ ! వాడి దగ్గరున్న చాతుర్యం. మంచివాళ్లందర్నీ బుట్టలో వేసుకోడం వాడికి బాగా తెలుసు. సరె .... ప్రస్తుతం నా పెట్టే బేడా మా దూరబ్బంధువు లింట్లో పెట్టాను. అక్కడ భోంచేసి వాటిని తీసుకొని మళ్లా వస్తాను. ఇంతలో వాడొస్తే కాస్త కని పెట్టుకునుండు. వెళ్లొచ్చేదా మరి.

చల : అలాగే వెళ్లిరండి. మీ రొచ్చేవరకూ నే నిక్కడే ఉంటాను. మీవాణ్ని యిక్కడే ఉంచుతాను.

పర : వెయ్యేళ్లు చల్లగా వర్ధిల్లు నాయానా ! కుర్రవాడంటే అల్లా ఉండాలి. పెద్దవాళ్ల బాధని అర్థం చేసుకోవాలి. చాతనైన సాయమూ చేయాలి. అంతేగాని, అదిగో ఆ చాదస్తం మనిషిలా అల్లరిచేస్తే ఏమైనట్టు?

చల : అత నెవరట?

పర : నాకేం తెలుసు బాబూ చుట్టం చూపుగా వచ్చాట్ట. సరే .... వస్తా నాయనా. !

చల : మంచిదండి.

(పరంధామయ్య వెళ్లిపోయారు)

(కాసేపు మౌనంగా నించుండిపోయాడు చలపతి. లోపలి నుంచి గుర్నాథం గురక స్పష్టంగా వినిపిస్తోంది. అతన్ని నిద్రలేపుదామని లోపలి కెళ్లాడు గానీ మళ్లా మనసు

మార్చుకుని బైట కొచ్చేడు. ఏమీ తోచడంలేదు. పుస్తకంతీసి చదువుతున్నాడు. కాస్సేపటికి సాంబశివరా వొచ్చాడు ఏదో సినిమా పాట పాడుకుంటూ. చల పతిని చూచి పాట ఆపి అన్నాడు)

సాంబ : గూడ్. బుద్ధిమంతుడంటే అల్లా ఉండాలి. సర్వ వేళలా చేతిలో పుస్తకం ఉండాలి. నా కిప్పుడు చాలా ఆనందంగా ఉంది. అన్నట్టు నువ్వెంతసేపయింది వచ్చి ?

చల : ఇంతకుమునుపే. నువ్వేదో సరదాగా ఉన్నావు.

సాంబ : చెప్పనా ? ఎందుకో చెప్పేదా మై డియర్ చలపతీ ! నేను చాలా అదృష్టవంతుడ్నోయ్. ఈ వేసవి సెల వుల్లో భవదీయుడు కాశ్మీర్ వెడుతున్నాడు, వెంట లలిత. ఖర్చు వాళ్లదే.

చల : అలాగా.

సాంబ : నీకు తెలీదోయ్ చలపతీ ! లవ్ అనే వస్తువు ఎంత మజాగా ఉంటుందనుకున్నావ్ ?

చల : నిజమేనేమో ! కానీ, సాంబశివం ! వంచనతో ప్రారంభ మైన లవ్ చాలా దారుణంగా ఉంటుందని మాత్రం నాకు బాగా తెలుసు.

సాంబ : (నవ్వేడు) లవ్‌లో వంచ నేమిటోయ్ వల్లకాడు !

చల : ఇందాక—నువ్వొచ్చే ముందే—పెద్ద షాకు తిన్నాను. దాన్నుంచి యింకా కోలుకోలేదు.

సాంబ : గూడ్. అప్పుడప్పుడూ షాకు తినడం ఆరోగ్యానికి మంచిది. ఏం .... మళ్లా మీ వెంకటరత్నంగానీ వచ్చేడా ?

చల : మా వెంకటరత్నం కాదు. మీ మావయ్య.

సాంబ : (అదిరిపడ్డాడు) మావయ్యా ! మా మావయ్య ! ఏమి టోయ్ నువ్వంటున్నది?

చల : నువ్వు గమనించలేదు గానీ—ఈ ఒక్క క్షణంలోనూ నీ మొహంలో ముప్పైమూడు రకాల మార్పులు కనిపించాయి. ఏం .... మీ మావయ్యంటే నీ కంత భయ మెందుకు ?

సాంబ : (పేలవంగా నవ్వేడు) నాకు భయమా ! మావయ్యంటే నాకు భయమా ? భలే .... నా కెందుకూ భయం.

చల : మీ మావయ్యకి నీ ప్రేమ విషయం తెలిసింది.

సాంబ : (మెల్లిగా వెళ్లి కుర్చీలో కూర్చున్నాడు. జేబు రుమాల్తో మొహం తుడుచుకున్నాడు.)

చల : నువ్వు చాలా యోగ్యుడి వనుకున్నాను.

సాంబ : కానా ?

చల : ఆ సంగతి మీ మావయ్యకి బాగా తెలుసు. ఆయన నిన్ను చదివిస్తున్నారు కదూ !

సాంబ : తల్లీ దండ్రీ లేని వెధవని. మావ కాబట్టి చేరదీసి చదివించేడు.

చల : నీకు పెళ్లయింది. కోరి మీ మావయ్య కూతుర్నే చేసుకున్నావు. అవునా ?

సాంబ : (తలొంచేశాడు.)

చల : చెప్పు సాంబశివరావ్. నే నంటున్నది నిజమేగా ?

సాంబ : (తలెత్తాడు—కళ్లల్లో నీళ్లు నిండుకున్నాయి) నీలాగా నీలాంటి చాలామందిలాగా చదువుకుని బాగుపడాలనే కోరిక నా కుండటం అన్యాయంకాదు. నాకు చాలా కోరిక లున్నాయి. తీర్చేందుకు అమ్మా నాన్నా లేరు. దౌర్భాగ్యుడ్ని. ఎంతో పాపం చేసుకుంటేనే గాని నాలా తయారు కాలేరు. నిజం చలపతీ ! నా కోరికలన్నీ ఇనుపసంకెళ్లతో బిగించేశాను.

చల : కానీ .... నువ్వంటే నాకు జాలిలేదు.

సాంబ : వద్దు. నామీ దెవ్వడూ జాలి చూపరాదు. వాళ్లకా అధికారం లేదు. నా పరిస్థితులు తలుచుకుంటాను. ఏడుపొస్తుంది. ఒంటరిగా కూర్చుని ఏడుస్తాను. నా ఏడుపు ఎవడూ వినకూడదు. అది సహించలేను.

చల : నీ గురించి నువ్వెంత చెప్పుకున్నా వినడానికి సిద్ధమే. కానీ, నువ్వు మీ మావయ్యకీ, నీ భార్యకీ చేస్తున్న ద్రోహాన్ని మాత్రం క్షమించలేను.

సాంబ : నీ మెర్సీ గూడా నా కొద్దు. క్షమించమని ప్రాధేయ పడను. మావయ్య గురించి గానీ, నా భార్య గురించి గానీ చెడు ప్రచారం చేయను. కానీ, వాళ్ల గురించి నీ కసలేం తెలీదు. అదే వెలితి.

చల : నీ పెళ్లయినట్టు నువ్వింతవరకూ చెప్పనేలేదు. దీన్నేమనాలి ?

సాంబ : భార్యకి అన్యాయం చేసేటంత దుర్మార్గపు మనిషిని కాను. నా ఖర్మనీ నా దురదృష్టాన్నీ యిప్పుడు నీముందు చెప్పుకోవాలని ఉంది.

చల : పెళ్లయి గూడా ఖర్మ, దురదృష్టం అని కుమిలి పోయేవాడిని నిన్నొక్కడ్నే చూశాను.

సాంబ : మరే .... ఉన్నదీ నే నొక్కడ్నే నేమో. చదువు కోవాలి, మీ అందరిలా హాయిగా నవ్వుతూ తిరగాలి. దానికి డబ్బు కావాలి. అక్కడికే ఒకళ్ల వంచన, వాళ్ల దయా దాక్షిణ్యాలమీద ఆధారపడి బ్రతుకుతున్నాను. ఇలాంటి పరిస్థితుల్లో నా ముచ్చట్లెలా తీరాలి ? ఎలా చెప్పు చలపతీ ?

చల : మధ్య నే నెందుకూ? అదీ నువ్వే చెప్పరాదూ ?

సాంబ : మావయ్యా స్వార్థపరుడని చెప్పను. మావయ్యకి ఓ కూతురుంది. ఆ అమ్మాయి మూగపిల్ల, పుట్టెడు చెవుడు. ఒకర్తే కూతురు. న్యాయంగా సంపా యించింది గానీ నోళ్లుకొట్టి నిల్వ చేసింది కానీ ఒక 'ల' కారం ఆస్తి మావయ్యకుంది. అయినా సరే, ఆ పిల్లకి పెళ్లికాదు. చూస్తూ ఎవడూ ఆపిల్లని చేసుకోడు. అక్కడికీ కట్నం రూపంగా చాలామందికి 'ఆశ' చూపించేడు. అయినా మావయ్య ప్రయత్నాలు ఫలించలేదు. లాస్ట్ రిసార్ట్—భవదీయుడు. ఈ కోరికల పుట్టమీద మావయ్య వల బాగా పనిచేసింది. వాళ్లమ్మాయితో నా పెళ్లయింది. వాళ్ల డబ్బుతో నా చదువూ సర్దాలూ సాగుతున్నాయి. అర్థమైందా

చలపతీ ! నా పెళ్లాం మూగదోయ్. వట్టి అనాకారి రకం.

చల : మూగ కానివ్వు, గుడ్డి కానివ్వు. భార్య అన్న తర్వాత భార్యే, భార్య ఉండగా మరో అమ్మాయితో ప్రేమ వ్యవహారం సాగించడం నేరం.

సాంబ : అవునా నేరమని నేనూ ఒప్పుకుంటాను. కానీ నా కెన్నో ఆశలున్నాయ్, ఎన్నో కలలున్నాయ్—అవి తీరే మార్గమెలా ? నా కెన్నో కల లొస్తుంటాయి. ఒక అప్సరసా నేనూ సిమెంటు రోడ్డుపైన నల్ల కారు మీద షికారు వెడతాం. సముద్రపు టలలో స్నానం చేస్తాం. చల్లగాలిలో పైపైకి ఎగురుతూంటాం. ఇవన్నీ నా కలలు. రోజూ తప్పనిసరిగా వచ్చే బంగారు కలలు. మావయ్య వాళ్లింట్లో నా యిష్టం వచ్చినట్టు కలవరించుకోడానికి వీలులేదు. అంచేత మధ్య మధ్య యింగ్లీషులో కలవరిస్తాను. నీకు తెలీదు నా బాధ. నా గుండెల్లో రగల్తూన్న నిప్పు రవ్వ గురించి నువ్వు పట్టించుకోవు.

చల : అందుకని చెప్పి లలితను ప్రేమించావ్. వాళ్ల నల్ల కారునీ బొచ్చుకుక్కల్నీ ప్రేమించావ్.

సాంబ : (తల పంకించేడు) ఎగ్జాక్ట్లీ. చప్పున గ్రహించావు గానీ పప్పులో కాలేశావు. ఒక సంగతి చెప్తాను. నమ్ముతావా చలపతీ !

చల : చెప్పు.

సాంబ : దైవసాక్షిగా చెబుతున్నాను. లలితంటె ఎవరో నాకు తెలీదు. వాళ్ల కారుగానీ, బొచ్చుకుక్కగానీ తెలీవు.

చల : (ఆశ్చర్యపోయేడు) సాంబశివరావ్ !

సాంబ : ట్రూత్. నంథిగ్ బట్ ట్రూత్. లబ్జీర్ణవాడి స్కైకాంక్ష ఏమిటో తెలుసా ? మంచి ఆవకాయ తినేయాలని ఉంటుంది. తింటే జీర్ణం చేసుకునేపాటి జీర్ణశక్తి ఉండదు. అంచేత ఆవకాయని గురించి మంచి మంచి కలలు కంటాడు. నా తంతూ అంతే. నా కలలనీ, నా కోరికలనీ సాధించుకునేపాటి శక్తిలేక అలాగని చంపుకోడానికి యిష్టమూ లేక నీతో కథలు చెప్పి సంతోషించేవాడిని. భార్య ఉండగా పర స్త్రీపై కాంక్ష పెట్టుకుని మార్గాలు వెతికే నేర్పరిని కాదు చలపతీ! నా దురదృష్టానికీ, నా జాతకానికీ కంట తడిపెట్టే అల్ప జీవిని.

చల : (కదిలిపోయాడు) సాంబశివరావ్ నన్ను క్షమించు. ఇందాకా సేపట్లో మీ మావయ్య వస్తానని చెప్పారు. అసలు సంగతి తెలీక ఆయన్తో యిష్టం వచ్చినట్టు వాగేను.

సాంబ : కాబట్టి యీ సాంబశివరావ్ కలలు కూడా దూరమౌతాయి. కాసేపట్లో .... పూర్ ఫెలో .... వాళ్ల మావయ్యతోపాటు వాళ్లూరి రైలెక్కుతాడు. వాళ్లూర్లో, ఆ పంజరంలో—దిక్కుతోచక, లబోమని ఏడుస్తాడు. సెలవు చలపతీ .... వస్తాను.

చల : (ఉలిక్కిపడ్డాడు) ఎక్కడికి ?

సాంబ : చచ్చేందుకు మాత్రం కాదు. నే చావ నసలు. అలా ఊరంతా మనిష్టం వచ్చినట్టు తిరిగి, బీచ్ దగ్గరికెళ్లి (నవ్వేడు) నా కథానాయకురాలితో కాసేపు కాలక్షేపం చేసి, వాళ్లతోపాటు కాశ్మీర్కి రాలేనందుకు క్షమించమని గుడ్బై చెప్పి సెలవు పుచ్చుకుని వస్తాను. పంజరంలోకి ప్రయాణం చేస్తాను.

చల : పోనీ .... మీ మావయ్య కివన్నీ చెప్పి వప్పించరాదు.

సాంబ : మా మావయ్య నీలాటివాడు కాదు. ఆ మనిషికి అనుమానపు వాసన తగలనే కూడదు, తగిలిందా మరి నా ఖర్మ కాలిందన్నమాటే! ఆయన నాపైన ఎన్నో ఆంక్షలు పెట్టేడు. మా ఊళ్లో సాయంత్రపూట కాలువ ఒడ్డుకి షికార్లు చేయడానికి నాకు హక్కు లేదు. కిటికీ దగ్గర కూర్చుని వీథిలోకి చూడరాదు నా అందం ఆడపిల్లలకి వెర్రి కలిగించినా ఆశ్చర్య పడరాదు. అలాగైతే మావయ్య కొంప కూలిపోతుంది. ఆయన ముద్దుల కూతురు ఉరోసుకు చస్తుంది. నా పేరు సాంబశివరావ్ కాదు. పరంధామయ్యగారి అల్లుడబ్బాయిగోరిని.

చల : (జాలి కలిగింది) సాంబశివరావ్ !

సాంబ : చావనివ్వు బ్రదర్ ! ఒకడి గురించి మరోడు పట్టించుకునే రోజులా యివి ? కావు. ఎవడికున్న బాధలు వాడికున్నాయి. నువ్వు మాత్రం సుఖంగా బ్రతుకుతున్నావా? అలా అని నీ గుండెలమీద చేయి వేసుకు చెప్పు చూద్దాం. అంతే బ్రదర్ ! గుప్పిట బిగించి ఉంచుతేనే రహస్యం ? విప్పావో ! .... ఉష్ కాకి .... నవ్వులపాలు. దిగులు పడ్డా్తలు. వస్తా. మళ్లా వచ్చి, ఉండు కాస్తాగు చెప్తాను (జేబులోంచి అర్ధరూపాయి బిళ్ల తీసి బొమ్మ బొరుసూ వేశాడు) ఆల్రైట్ తప్పకుండా నిన్ను కలుసుకుంటాను. కలుసుకునే వెడతాను. ఏదీ ఆఖరిసారిగా అన్నట్టు అయిదు రూపాయి లప్పు.

చల : (జేబులోంచి చప్పున తీశాడు) ఇంద.

సాంబ : థేంక్యూ .... వస్తా ....

(వెళ్లిపోయాడు. చలపతి నిట్టూర్చాడు. అతన్ని గుమ్మం వరకూ సాగనంపి, అక్కడే నిలబడి కాసేపు చూచి వచ్చి కూర్చున్నాడు. సిగరెట్టు తీసి ముట్టించేడు. పొగ వదిలాడు. అంత లోపల్నుంచి గుర్నాథం మొహం తుడుచుకుంటో వచ్చాడు.)

గుర్నాథం: టైమెంతయిందండీ !

చల : (వాచి చూచి) పది.

గుర్నా : అబ్బా .... చాలా అయిందే. ఒళ్లు మరిచి నిద్రపోడంలో నన్ను మించినవాడు మరోడు లేడని మావాడనేవాడు.

చల : (కుతూహలంగా అడిగేడు) ఎవరండీ మీవాడు ?

గుర్నా : ఏం మావాడోలేండి. వెంకటరత్నమనీ యీ పక్క గది—

చల : వెంకటరత్నమా !

గుర్నా : ఆ .... అవును .... వెంకటరత్నమే ....
చల : అతను మీ బంధువా ?
గుర్నా : ఏం బంధువో లేండి. మా పెద్దమ్మ కొడుకు.
చల : (గభాలున లేచి నించున్నాడు) అవుతే .... మీపేరు గుర్నాథం. అవునా ?
గుర్నా : సాంబశివరావుగారు చెప్పేరా ?
చల : కాదు మీరు నాకు బాగా తెలుసు.
గుర్నా : ఏం తెలుసోలేండి. ఆ పరంధామయ్యగారు చెప్పి ఉంటారు.
చల : కాదు. మీరు నాకు తెలుసు.
గుర్నా : (తెల్లబోయాడు) ఎలాగ ?
చల : మీతో నేను చాలా విషయాలు మాట్లాడాలి. దయచేసి కూర్చోండి.
గుర్నా : (కూర్చున్నాడు).
చల : ఇప్పుడు చెప్పండి.
గుర్నా : ఏం చెప్పడమోలేండి. ఇదేమిటండి బాబోయ్. పన్నేదో గారడీ చేస్తున్నట్టుందే. (లేవబోయాడు)
చల : లేవవద్దు. దయచేసి కూర్చోండి.
గుర్నా : (మళ్ళా సర్దుకు కూర్చున్నాడు).
చల : మీ వెంకటరత్నం ఎలాటివాడు. మీకేం భయంలేదు. నిస్సంకోచంగా చెప్పండి.
గుర్నా : బహు దొడ్డ మనిషి.
చల : (అతని మొహంలోకి చూస్తూ) నిజమే చెబుతున్నారా ?
గుర్నా : నిజమే !
చల : అవుతే మరో విషయం అడుగుతాను. భావ్యం కాక పోతే క్షమించాలి.
గుర్నా : ఏమి క్షమించడమోలేండి. మీ రడగండిసార్. మావాడి గురించి లక్ష అడిగినా చెబుతాను.
చల : (సంకోచిస్తూ) ఇది మీవాడి గురించి కాదు.
గుర్నా : ఏం కాదో ? మరెవరి గురించండి.
చల : రాధ గురించి.
గుర్నా : రాధ గురించా ? మా రాధమ్మ గురించే ? మీకెలా తెలుసు రాధ ?
చల : తెలుసు. ఇప్పు డావిడ సుఖంగా ఉందా ?
గుర్నా : ఏం సుఖం లెద్దురూ ! రోజుకో రోగం. ఆవిడ సుఖ పడేది లేకపోయినా మావాడి సుఖమూ వల్లకాట్లో కలిసింది.
చల : అదేమిటి ? రాధ సుఖానికీ మీవాడి సుఖానికీ సంబంధ మేమి టసలు ?
గుర్నా : (నవ్వేడు తేలిగ్గా) అదేమిటండి బాబోయ్. భార్యా భర్తలైన తర్వాత ఒకరి సుఖదుఃఖాలు మరొకళ్లవి కావుటండీ !
చల : (తల దిమ్మెత్తేలా ఆశ్చర్యపోయాడు) ఏమిటీ ? రాధ వెంకటరత్నం భార్యా ?
గుర్నా : ఇదిగో పంతులుగారూ ! తమరేం పెళ్ళిచ్చుకోలేదుగదా ?
చల : మరి .... మరి ....
గుర్నా : ఏం మరో .... ఏమిటండీ మీ భయం ?
చల : నాతో అలా చెప్పాడేం, రాధ మీ భార్యని.
గుర్నా : (చెవులు మూసుకున్నాడు) రామరామ ! అవేం మాట లండీ బాబూ ! రాధమ్మ నా వదిన. మావాడి భార్య.
చల : చిత్రంగా ఉందే. అవుతే ఎందు కింత నాటకం ఆడేడు? అంత అవసరం ఏమొచ్చింది?

(హఠాత్తుగా వెంకటరత్నం వచ్చేడు.)

వెంక : అవసరమే చలపతీ ! గొప్ప అవసరం.
చల : (బిత్తరచూపులు చూచాడు.)
గుర్నా : వచ్చావూ ! రక్షించావు. రాధ వదిన కెలా ఉంది?
వెంక : ముంచుకొచ్చింది గుర్నాథం—క్షణాల్లో ఉంది దాని బ్రతుకు. రాధ బ్రతకదు. చివరి ఆశగా విశాఖపట్నం హాస్పిటల్‌కి తీసుకొచ్చేను. డాక్టర్లు పెదవి విరిచేరు. ఘడియల్లో ఉంది నా రాధ. ఆ దీపం వెలగదు.
గుర్నా : ఏమిట్రా యిది. నన్ను ఖంగారు పెట్టేస్తున్నావు. అయినా హాస్పిటల్లో ఒక్కర్తెనీ పెట్టి నువ్విలా వచ్చా వెందు కసలు ? ముందు పద నేనూ వస్తాను.
(లోపలి గదిలోకి వెళ్ళాడు. బట్టలు మార్చుకునేందుకు.)
వెంక : చలపతీ ! తప్పుచేయడం తెలీని మనిషిని నేను. పరి స్థితులు అన్నివిధాలా ఎదురు తిరిగేయి. పరాయివాడి కైనా వద్దు యీ అనుభవం. (కాసేపు ఆలో చించేడు.) అడుగు చలపతీ ! నీలోపల దాచుకున్నవన్నీ అడిగేయ్. నిర్మొగమాటంగా అడిగేయ్. ఈ ఛాన్సు మళ్లీ నీకు దక్కదు.
చల : ఇప్పుడే ఒక్కటొక్కటేగా అర్థమౌతున్నాయి.
వెంక : నీకు నువ్వే అర్థం చేసుకుంటే తృప్తి ఉండదు నాకు. నన్ను చెప్పనివ్వు. రెండేళ్ల క్రితం రాధతో పెళ్లయింది. అంతకి మునుపు రాధ నీ స్నేహితురాలని తెలీదు. భార్యగా రాధ నన్ను సుఖపెట్టలేదు. అను క్షణం నిన్ను తలుస్తూండేది కాబోలు. కొద్ది నెలల్లోనే ఆమె ప్రేమ వ్యవహారం బయటపడింది. ఇక్కడి కొచ్చిన తర్వాత నాకు నీతో పరిచయం కలి గింది. నువ్వంటే జలసీ. మా సంసారంలో నిప్పులు పోసింది నువ్వు. మా బ్రతుకు పాడుచేసింది నువ్వు. నువ్వే చలపతీ !
చల : (కలవరపడ్డాడు) క్షమించండి. అనవసరంగా నిందలు వేయడం పెద్దమనుషులకి తగదు.
వెంక : నువ్వు చేసింది నేరం. రాధని ప్రేమించి తప్పుకోడం నేరం.
చల : పరిస్థితులు మీకు తెలీవు.
వెంక : ఆ పత్తిడిని ఆదుకోగల తాహతు లేనివాడివి నోరు మూసుకు పడుండాలి. అలా చేయలేదు నువ్వు. పైగా నన్ను రెచ్చగొట్టావ్. ప్రతిరోజూ నువ్వు ఆ రికార్డు వినేవాడివి. ఇది నే సహించలేను. గతాన్ని గుర్తు చేసు కునే అర్హత నీకు లేదని నా ఉద్దేశం. నిన్ను హింసించా

లని నా అభిమతం. కథ ఆలోచించేను. పగ తీర్చుకోడానికి మార్గం కనిపించింది. గుర్నాథాన్ని రాధ భర్తగా చెప్పాను. అట్నుంచి నరుక్కొచ్చేను. నీ మనసు చెదరగొట్టేను. సాధించేను. నా కసలు కోపం యెక్కువ. నే నెంత కథ చెబుతున్నా నువ్వు బైట పడలేదు. 'రాధ మాజీ ప్రేమికుడ్ని నేనే' అనివుంటే—ఉహు నీకై నువ్వేనాడూ చెప్పలేదు. చివరికి తెగించి నేనే నీ గుట్టుని రచ్చ కీడ్చేను. దానివల్ల నువ్వనుభవించిన వేదన తల్చుకుంటే నా వళ్లు యిప్పటికీ జలదరిస్తోంది.

చల : తెలిసి నేను మీకే అపకారమూ చేయలేదు. నేనే మీరైతే—

వెంక : అసంభవం. నాలాంటి మనిషి మరోడు ఉండడు. ఉన్నాడని తెలుస్తే నే నూరుకోను.

చల : (తలొంచుకున్నాడు. ఏమనాలో తెలీదు) పోనీండి. తప్పంతా నాదే. ఏ శిక్ష విధిస్తారో విధించండి.

వెంక : నిన్ను శిక్షించడానికి రాలేదు. నమ్ముతానంటే ఓ విషయము నీలో చెప్పాలని ఉంది. నమ్ముతావా ?

చల : (తలూపేడు)

వెంక : రాధ నీకు దేవత కావచ్చు. నా కది దెయ్యం. చాలా మంచివాడుగా బ్రతుకుదామనే నా ప్రయత్నాన్ని పాడు చేసిన రాక్షసి ! కానీ, రాధంటే జాలి ఉంది. జీవితంలో ఓడిపోయిన ఆడకూతు రెవరైనా సరే—కనిపిస్తే లోలోన ఏడుస్తాను. పాపం రాధ యిప్పుడు చావు బ్రతుకుల మధ్య ఉన్నది. రేపీవేళకి మనకి దూరమవుతుందని జోస్యమూ చెప్పగలను. అందికే—రాధను క్షమించాను. రాధ బ్రతుకుతుందనే ఆశ ఉంటే మళ్లా నే నిక్కడికి వచ్చేవాడినే కాదు. రాధ పోయేముందు ఒక చిన్న కోరిక కోరింది. నిన్ను చూడాలని ఉందిట. నమ్ముతావా ?

చల : నన్నా. నన్ను చూడాలని కోరిందా రాధ !—

వెంక : ఏడువకు. మగవాడు గొంతు చించుకుని ఏడుస్తే చెడ్డ చిరాకు నాకు. రా. ఒక్కసారి వచ్చి రాధకి కనిపించిపో. రాధ పోయిన తరువాత మనిద్దరం మనసు విప్పుకు మాటాడుకుందాం. మంచి స్నేహితులుగా స్థిరపడి పోదాం. రాధ ఉండగా మాత్రం యిది అసంభవం. కనుక మనం కాబోయే మంచి స్నేహితులమని రాధకి చెబుదాం. రా. తొరగా తెములు.

(గుర్నాథం బట్టలు మార్చుకుని మధ్య గుమ్మం దగ్గర నించున్నాడు. అతని చేతిలో సూటుకేసు ఉంది. అతను మాటలన్నీ విన్నాడు. కోపం వచ్చింది) గబగబా వెంకటరత్నం దగ్గరికొచ్చి—)

గుర్నా : ఏమిట్రా యిది. మీ సంసారంలో చిచ్చుపెట్టిన పెద్దమనిషి వీరేనా. నమస్కారం దేవుడుగారూ ! నమస్కారం. ఈ గదిలో మీ రున్నారని తెలుస్తే యిక్కడో క్షణమైనా ఉండేవాడిని కాదు. ఇందుకా బాబూ ! రాధ సుఖంగా ఉందా అని అడిగేరు. ? .... మీరూ మనుషులేనా ? పదరా రత్నం. ఇక్కడో క్షణమైనా ఉండొద్దు.

చల : వెళ్లండి మాస్టారు ! వెళ్లండి. నే నక్కడికి రాలేను. దయచేసి వెళ్లిపోండి.

వెంక : రాధకి మాటిచ్చేను. నువ్వు లేకుండా నేను తిరిగి వెళ్లను.

గుర్నా : ఇది మరీ బాగుంది. చోద్యం. పదపద. ఎవడైనా వింటే నవ్విపోతాడు. పద ముందు.

వెంక : నువ్వుండు గుర్నాథం. రా .... చలపతీ పోదాం.

చల : రాలేను (వెనక్కి తిరిగి లోపలి గదిలోకి వెళ్ల బోయాడు.)

వెంక : ఆగు. దేవుడ్ని గూడా లక్ష్యపెట్టను నేను. ఒక సామాన్య మానవుడివి నువ్వు. రెండు చేతులూ జోడించి ప్రార్థిస్తున్నాను. నామాట విని రా. ఆఖరి సారిగా నిన్ను చూస్తుంది రాధ. చివరి రోజిది. నాకు తెలుసు. నువ్వు రాధని చూడాలనుకుంటున్నావ్. మనసులోని కోరిక చంపుకోడం నీ చేతకాదు. తర్వాత నువ్వే బాధపడతావ్. మనం కాబోయే మంచి స్నేహితులం. మరిచిపోవద్దు. దయచేసి వచ్చేయ్ చలపతీ ! ప్లీజ్.

చల : (కళ్లు కప్పుకున్నాడు) మీరు నిజంగా దేవుడే !

వెంక : దేవుడ్ని నాతో పోల్చి చెబుతే దేవుడిమీద మరింత నిర్లక్ష్యం పెరుగుతుంది నాకు. పోల్చక . ముందీ గది దాటు.

(గుర్నాథం ఇద్దరివైపూ కోపంగా చూచి విసురుగా వెళ్లిపోయాడు.)

చల : (రెండడుగులు ముందుకువేసి మెల్లిగా అన్నాడు) పదండి.

వెంక : సంతోషం ! చేయి కలుపు మై డియర్ బాయ్ ! రాధ చచ్చేముందు నిన్ను చూడాలని కోరింది గానీ నేనందుకు యిష్టపడలేదు. చివరి క్షణంలో గూడా రాధ ఆత్మ క్షోభించాలి. సాధించేను. పద. రాధ సమాధి దగ్గర నీ గోడు చెప్పుకుందుగానీ. ఆశ్చర్యపడకు—మనం యిప్పుడు మంచి స్నేహితులం. నిజం.

ఊс .... నడు తొరగా.

(చలపతి బిత్తరపోయేడు. వెంకటరత్నం అతని చేయి పుచ్చుకు తీసుకెళ్లాడు.)

---

# అభినయ దర్పణములు

## శ్రీ కృష్ణశ్రీ

పై శీర్షికతో నాట్యశాస్త్ర విషయముల గూర్చిన కావ్యములు సంస్కృతమున తెలుగున కలవు. నందికేశ్వర ప్రోక్తమగు అభినయ దర్పణము, ఆంధ్ర దేశమున గత శతాబ్దినాటికే (1887. రెండవ మారు) ఆంధ్ర లిపిలో సీడామంగలం తిరు వేంకటా చార్యుల వారిచే ఆంధ్ర తాత్పర్య సహితముగా ప్రచు రింపబడి లోక ప్రఖ్యాత మైనది. దీనినే, కళాశాస్త్ర నిపుణులు, జ్ఞానులు ప్రాక్ పశ్చిమ దేశములందు విద్వాంసులని పేర్గాంచిన ఆనంద కుమారస్వామి, ఆంధ్రభరత్న సాయమున, ఆంగ్లీకరించి పాశ్చాత్యులకు భారతీయ నాట్య వైభవాంతరార్థమును బోధించెను. ఈ గ్రంథ మందలి వస్తువు ఆంధ్రదేశమున శతాబ్దముల నుండి నాటక జనులచే పవిత్రముగ పరిగణింప బడుచున్నది. ఇందలి హస్తాభినయ వివరణములు, నేటికిని కూచిపూడి వారిచే నేమి, వీరలకు బోధనలొనర్చెడి నాట్యాచార్యులకేమి ప్రమాణ గ్రంథముగా వెలయు చున్నది. ఆంధ్రభరత్న, ఆనంద కుమార స్వాముల ఆంగ్లీకరణము దేశ దేశములందు పేర్గాంచిన ప్రశస్త గ్రంథము. వీరి ఆంగ్లీకరణమున పైజెప్పిన భరత విద్యా ప్రతి పాదన ప్రవీణులగు సీడామంగలం వారు సంతరించిన పాఠము ననుస రించినదే.

ఈ గ్రంథ ప్రారంభమున ప్రార్థనలు రెండు కలవు, మొద టిది : నటరాజస్వామికి. రెండవది : నాట్యశాస్త్రార్థ ప్రదుడగు నందికేశ్వరునకు. ఇంద్రుడు నందికేశ్వరుని దర్శనార్థమై వచ్చెను. వెంట సుమతియను నర్తకుడుండెను. సుమతికి నాట్య విషయముల బోధించుటకై సురపతి, వాని వెంట నిడికొని నంది వద్దకు వచ్చెను.

ఇంద్ర ఉవాచ :

త్వదీయ కృపయా పూర్వం నాట్యశాలామలంకృతామ్ ।
త్వదీయ నర్తక స్యాయం త్వత్కృపామభి వాంఛ తి ॥

ఈ శ్లోకమందు ఇంద్రుని వెంట సుమతి యను నటుడు, నాట్యార్థ విషయము లర్థించుటకై యుండెనని విశదము కాగలదు. ఇందులకు :

నందికేశ్వర ఉవాచ :

మయా విధేయం కిం తస్య వద వాసవ తత్త్వతః

అతనికి (ఆ సుమతి యను నటునికి) నే చేయదగిన దేమున్నది ?

అందులకా శక్రుడు.

ఇంద్ర ఉవాచ :

దైతేయ నాట్యశాలాయాం నర్తకో నట శేఖరః
తం విజేతు మయం నాట్య వినోదైః క్రమ వేదిభిః

భవ ద్విరచితం గ్రంథం భరతార్ణవ మిచ్ఛతి ।

నటశేఖరుడను దైత్యకుల నటుడు, వారి నాట్యశాల యందు ప్రఖ్యాతుడు. వానిని నాట్య కౌశల ప్రయోగమున జయించు కోరికతో, మీరు రచించిన భరతార్ణవ మందలి వస్తువును గ్రహింప తలంచి వచ్చినాడు.

ఇందులకు,

నన్దికేశ్వర ఉవాచ :—

చతు స్సహస్ర సంఖ్యాతైః గ్రంథం శ్లోకైశ్చ పరిపూరితమ్।
భారతార్ణవ శాస్త్రన్తు సుమతే శృణుసాదరమ్॥

ఓ సుమతీ, నీవు నాచే 4000 శ్లోకములుగా పరిపూర్ణ మొనర్చబడిన భరతార్ణవ శాస్త్రమును సాదరముగా ఆక ర్ణింపుము.

(ఇందలి సుమతి ఇంద్రునికి సంబోధన కాదనియు ఐరావత వాహనుని వెంట వచ్చిన నటుని పేరని గ్రహించ వలెను.)

భరతార్ణవ గ్రంథ బహు విస్తారతను తెలిసిన బృహ స్పతి శిష్యుడు నందికేశ్వరునితో.

ఇంద్ర ఉవాచ :—

నందికేశ దయామూర్తే విస్తారాత్సం విహాయమే ।
సంక్షిప్త నాట్యశాస్త్రార్థం క్రమపూర్వ ముదాహర॥

వెంట వచ్చిన సుమతికి సుబోధ మగునట్లుగ సంక్షే పించి ఆ భరతార్ణవ సారమును బోధింపుమని ఇంద్రుడు కోరెను. అందులకా శివనంది గణాధ్యక్షుడు—

నందికేశ్వర ఉవాచ :—

వదామి సుమతే దేవ సంక్షిప్య భరతార్ణవమ్ ।
దర్పణాఖ్య మిదం సూక్ష్మ మవధారయ సాదరమ్॥

సులభగ్రాహ్యమునకై దర్పణ సామ్యముగను, లఘువు గను, భరతార్ణవమును సుమతికి అనతి విస్తారముగ నందీశ్వ రుడు బోధించెను. ఈ బోధనయే అభినయదర్పణమనియు, అయ్యది నందికేశ్వర ప్రోక్తమనియు ప్రఖ్యాతమైనది. కాని

పై శ్లోకము ప్రకారము ఈ గ్రంథమును భరతార్ణవ దర్పణ మన్న సరిపోయెడిది.

ఈ సుమతి శిష్యత్వమును, సీడామంగళము వారుగాని, వారి పాఠము ననుసరించిన వారు గాని ప్రత్యేకముగా పేర్కొన లేదు.

సుమతి భరతాచార్యుని పుత్ర శతమందు ఒకడని తెలియుచున్నది. (మోనియరు విలియమ్స్ నిఘంటువు) భ. నా. శా. మందీతని పేరు కానరాలేదు. 1957 సం. న తంజావూరిసరస్వతీ మహల్ పుస్తక భాండాగారమువారు నందికేశ్వర రచిత మగు భరతార్ణవమను గ్రంథమును ప్రకటించిరి. ఆ గ్రంథ మంతయు సుమతి యను శ్రోతకు నందీశ్వరుడు బోధించిన ట్లున్నది. అంతర్గతముగ ఆ గ్రంథమందలి కొన్ని అధ్యాయ గద్యములందు సుమతి బోధకమనియు కలదు. ఈ గ్రంథమున 1200 శ్లోకములు గలవు. ఇదియే 4000 శ్లోక పరిమితి గల గ్రంథ సంక్షిప్త స్వరూపమా ? అట్లగునేని, పై చెప్పిన అభినయదర్పణము ఈ ప్రచురింపబడిన భరతార్ణవ గ్రంథ సారమా ? కాని పోలికలు మిక్కుటముగ లేవు. భరతార్ణవ మను పేరు కల్గిన మఱియొక వ్రాత ప్రతి, వినాయక ప్రోక్తమని కలదు. కర్త వేరై గ్రంథశీర్షము ఒక్కటిగ నుండుట సామాన్యమే. అట్లే, గ్రంథము, తత్కర్త పేర్లు ఒక్కటిగ నుండుటయు పొసగునేమో.

ఇది యిట్లుండ, 1934 సం. కావ్యతీర్థ మన్‌మోహన్ ఘోష్ అభినయదర్పణమను సంస్కృత గ్రంథమును పాఠ నిర్ణయ మొనర్చి, దేవనాగరి లిపిలోను, దానికి ఆంగ్లానువాద మును శాస్త్రీయ గ్రంథముగా ప్రకటించిరి. వారు సేక రించిన వ్రాత ప్రతులు అయిదు. అవి :—

(1) మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార మందలి తెలుగు లిపియందు గల సంస్కృత గ్రంథము. నెం. 304. ఇయ్యది 1893—94 లో దేవనాగరి లిపిలో వ్రాసినట్లున్నది.

(2) శాంతినికేతన మందలి తాళపత్ర గ్రంథము. నెం. 3038. తెలుగు లిపి. కాని, అసంపూర్ణము. దీనినే పునాదిగా గొని ఘోష్ పాఠమును నిర్ణయించెను.

(3) అడయారు భాండాగార మందలి తెలుగు లిపి యందున్న తాళపత్ర గ్రంథము. నెం. XXII. C. 25.

(4) అచ్చటనే యుండు మఱొక తాళపత్ర గ్రంథము. నెం. XXII. C. 38. తెలుగు లిపి.

(5) కాగితపు వ్రాతప్రతి. తెలుగు లిపి. అడయారు నందలిది. నెం. VIII. J. 9.

ఇవిగాక ముద్రింపబడిన గ్రంథములును పరిశీలింప బడినవి.

(1) ఆనంద కుమారస్వామివారి ఆంగ్లీకరణము. దీనికి మూలము 1887 లో సీడా మంగళము వేంకటాచార్యులు తెలుగు లిపిలో ప్రచురించిన రెండవ కూర్పు.

ఇవిగాక ఘోష్ విద్వాంసుడు పునః నగర భండార్కరు పుస్తక భాండాగారమందలి భరతార్ణవమును మఱికొన్ని వ్రాత ప్రతులను పరిశీలించి తమ అభినయదర్పణ పాఠమును నిర్ణ యించిరి. కాని, వారు తంజావూరు, మైసూరునందలి భరతార్ణవ ప్రతులను చూడనందున సుమతి ప్రశంసను వెలికి దీయరైరి. వారు నిర్ణయించిన పాఠ్యక్రమమున సుమతి ప్రశంసగాని, ఇంద్రుని వేడికోలు గాని లేవు. కాని వారు అధశ్శీర్షిక క్రింద ఇంద్ర—నంది సంభాషణల గూర్చి చెప్పిరి. కాని సుమతి ప్రశంస మృగ్యము. ఇది సంస్కృత అభినయ దర్పణమును గూర్చిన ప్రశంస.

## 2

1951 సం. న మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారు సంగీత కళానిధి శ్రీ టి. వి. సుబ్బారావు సంపాదకీయమున, అభినవదర్పణమను తెలుగు గ్రంథమును ప్రచురించిరి. దీని కర్త లింగముగుంట మాతృ భూతేశ్వర కవి. ఈ కవి (పే. 2)

సరవి లింగముగుంట శంకరనారార్యునకు పౌత్రుడ
నయి దనరువాడ
ననువుగా మృత్యుంజయార్యు పుత్రుండనై నిర
తంబుఁ గీర్తిచే నెగడువాడ
బరను పావనుండైన కరిరాజ వరదుని వరముచే జని
యించి పరుగువాడ
ననువుగఁ జెలువొందు యాజ్ఞవల్క్యాచార్యు కరు
ణకుఁ బాత్రమై మెఱయువాడ
నమర గాశ్యప గోత్రజుఁ డైనవాడ
జేరి హరిదాసులకు సేవ చేయువాడ
నవనిఁగవి మాతృభూత నామాన్వితుఁడుగ
జెలగువాడను శ్రీహరి గొలుచువాడ.

ఈ కవికి ఒకనాడు స్వప్నమున వైకుంఠుని సాక్షాత్కార మయ్యెను. పే. 3.

చెలగి యొకనాడు స్వప్నమం దెలమి వచ్చి యొనసి యభి నయ దర్పణంబనగ నిలను ఘన ప్రబంధము నొక్కటి గఱిమ మీఱబూని రచియింపు మనుచును నానతిచ్చె.

ఈ పేరుగల ప్రబంధము, ఈ రచనకు పూర్వ మొక్కటి యున్నట్లు కవి :—

పే. 4. ధరను విలసిల్లు నభినయ దర్పణంబు గరిమనిదె
పద్య కావ్యమ్ముగా నొనర్తు.

అట్లు పూర్వము విలసిల్లినది నందికేశ్వరుని, సంస్కృత అభినయ దర్పణమే. కేవలము సూటిగా నొనర్చిన తెలుగు సేత కాక, కవి సంస్కృత కావ్యమునే లక్ష్యముగా పాటిం చుచు, నిజ కౌశలమును అక్కడక్కడ చూపుచు తెలుగున అభినయదర్పణమును రచించెను. నాట్య విషయములపై తెనుగున గ్రంథము రచింపబడుట, ప్రచురింపబడుట

చిత్రమే. ఈ కవి కాలమును, దీని ప్రచురించినవారు 17 వ శతాబ్ది యని సూచించిరి.

ఆచార్య నిడదవోలు వేంకటరావుగారు తమ దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయమున పే. 228 న అధస్సూచిని, ఈ కవిని వీరి పుస్తకమును పేర్కొనిరి. ఈ రచనయందు సంస్కృత మూలమే గురిగా యున్నట్లు బాగుగ విశదమగు చున్నది. సంస్కృతమున,

కంఠేనాలంబయేద్గీతం హస్తేనార్థం ప్రదర్శయేత్
చక్షుర్భ్యాం దర్శయేద్భావం పాదాభ్యాం తాళమా
మాచరేత్॥
యతో హస్తస్తతో దృష్టిర్యతో దృష్టిస్తతో
మనః।
యతో మనస్తతో భావో యతో భావస్తతో రసః॥
అత్రత్వభినయ స్యైవ ప్రాధాన్యమితి కథ్యతే.

పై నాట్య క్రమమునకు మాతృభూతేశ్వరకవి తెలుగున సీసము పాటించెను. పే. 4.

చెలువొంద గీతంబు చెన్నుమీఱగఁ బాడి యర్థంబుఁ
గరముల నమరఁబట్టి
పరగు గన్నులయందు భావంబుఁదగ నుంచి పదములు
దాళంబుఁ బరగఁ దీర్చి,
హస్తంబు పొడచూపు నచట దృష్టియు నుంచి మఱి
దృష్టిగలచోట మనసు నిల్పి
మనసు నిల్చినయెడ నెనయ భావమునుంచి భావం
బుతో రసంబలరఁజేసి
యెలమి నివియెల్ల నొక్కడై మెలగుచుండ నట్టిదే
సూడ నిలలోన నభినయంబు
నెనసి భరతజ్ఞు లది మెత్తురింపుమీఱ రాక్షసవిరామ
కస్తూరి రంగధామ

ఈ కవి తన కావ్యమును 'శ్రీహరి కంకిత'మొనర్చి ప్రతి పద్యమునను మకుటముగా కస్తూరి రంగని పేర్కొనెను. మూడు ఆశ్వాసముల గ్రంథముగా కవి, పరిసమాప్త మొనర్చెను. కాని పూర్తిగ సంస్కృత అభినయదర్పణమును అనుసరించలేదు. తనకు తోచిన హస్త విన్యాసములకు లక్షణము చెప్పి, వాటి వినియోగములను నిర్ణయించి చెప్పెను. ఇట్లే తెనుగున భరతసార సంగ్రహమని మఱొక సమగ్రముగు నాట్య శాస్త్ర గ్రంథమును మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయమువారు 1956 న ప్రచురించిరి. గ్రంథకర్త : చిల్లకూరి కవిసింహ దివాకర తారకాది నారాయణదాసు. ఇదియు చంద్రశేఖరకవి సంస్కృతమున రచించిన భరతసారమును గ్రంథమునకు స్వేచ్ఛానువాదము. ఈ సంస్కృత గ్రంథము ప్రచురింపబడినది. 1955 లో. తెనాలి వాస్తవ్యులు, నాట్యాచార్యులైన లంకా సూర్యనారాయణశాస్త్రిగారిచే ఆంధ్ర తాత్పర్యముతో ప్రకటింపబడినది. ఆంధ్రీకరణముల ముఖ్యోద్దేశము తెలుగువారికి వారి భాషలో నాట్య విషయముల ప్రయోగము సాయ మొనర్చుటకే నని తెలియుచున్నది.

## 3

అభినయదర్పణ మని తెనుగున వ్రాతప్రతి వ్యవస్థలో నుండు మఱొక గ్రంథమును గూర్చి వ్రాయుటయే ఈ వ్యాసముయొక్క ఉద్దేశ్యము. అట్టి పేరు గల కావ్యముల గూర్చి పైన వ్రాయుట సిద్ధించినది. అవి ప్రచురణ భాగ్యము నొందినవి.

తంజ నగరము నేలిన శహజీ (1684—1712) బంధువర్గములోని ఖండోజీ ప్రభువు, కవిగిరి లేక వేంకట గిరి యను మహాకవిని పోషించెను. ఇతడు,

కమలాంబికా విమల కృపాలబ్ధ సాహిత్య కళావతంస లోహిత గోత్ర అహోబలార్య పుత్ర దర్భకుల పావన గిరిరాజకవి వరానుజ విచిత్ర రాయావతంస.

ఆదరణ మిచ్చిన ఖండోజీ ప్రభువు తనకు నచ్చిన దర్భకవి గిరిని, విచిత్రరాయ వతంసా యని గౌరవపురస్సరముగా పిలుచుటచే, ఆ కవికి బిరుద నామముగా అయ్యది ప్రవర్తిల్లినది. ఈ కవి జ్యేష్ఠ సోదరుడు గిరిరాజకవి. ఈతని దౌహిత్రుడే "గిరిరాజ సుతాతనయు" డగు శ్రీ త్యాగబ్రహ్మస్వామి. కవిగిరికి అన్నయందు భక్తి గౌరవములు మెండుగ నున్నట్లు తెలియుచున్నది. ఈ కవిగిరి భక్త రుగ్మాంగదుని చరిత్రను ద్విపదలో సంతరించినట్లును తెలియుచున్నది. వీరిని గూర్చి ఆచార్య నిడదవోలు వేంకట్రావుగారు, వారి దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయ చరిత్రయందును, ప్రస్తుతము ఉస్మానియా యూనివర్సిటీ సంస్కృత అకాడమీలో పరిశోధనా శాఖయందు పండితులుగా నున్న శ్రీ విశలదేవుని సుందర శర్మగారు, ఆంధ్రప్రభ వారిచే వారాంతమున ప్రచురింపబడు సారస్వతానుబంధములోని తే 22—9—1962 గల వ్యాసమున స్థూలముగ గలదు. తెనాలి రామలింగకవి ఘటికాచల మహాత్మ్యమును వ్రాసి, దాని ప్రఖ్యాత మొనరింపకనే యశశ్శరీరుడయ్యెను. అతని మనుమడు బహుశః రెండవ రామలింగయ్య, దానిని రాజాదరణము కొఱకై ఖండోజీ వద్దకు గొనిపోగా, ఆ మహారాష్ట్ర ప్రభువు దానిని స్వీకరింప వల్లె యని, తన యాస్థాన పండితుడైన కవిగిరిచే ప్రశంసా పద్యముల వ్రాయించుకొనెను. ఈ ఘటికాచల మాహాత్మ్యమును మఱల డా. కేతవరపు రామకోటిశాస్త్రిగారు సంతరించిరి, పాఠ నిర్ణయముచేసి ప్రచురింపనున్నారు. వారు ఈ కవిగిరిని గూర్చిన విశేషము లనేకములు వ్రాయుదురు గాక !

17 వ శతాబ్దినాటికే నాట్య విషయములపై నట్టువరాండ్రకు నవగత మగునట్లు తెలుగున పద్యకావ్యములు వచ్చినట్లు ఈ వ్యాసమున తెలుపబడినది. కవిగిరియు తన పోషకుడగు ఖండోజీ ప్రోత్సాహముతో ఈ అభినయదర్పణమును నాట్యగ్రంథమును వ్రాసెను.

"ఒకానొక ప్రబంధం బెద్దియైన రచియింపం గోరి యున్న సమయంబున",

ఓజదలిర్ప ప్రేమమున నోలగముండి హితాళితోడ ఖం
డోజి విచిత్రరాయుడు మనోధృతి నన్నటు బిల్వబంచిభా
మాజన మాన చోర మధుమాస రసాల మరందసాంద్రధా
రాజయ మంజు వాక్యముల రమ్మని బల్కుచు కూర్మి
కుల్కుచున్·

తన యర్ధాసనంబున నుండ నియమించి యంతరంగంబున దయారస తరంగంబులు పొంగి పొరలు తెరంగుల ముఖ పుండరీకంబు కొండింప నను నిజనామాంకితు చూచి యిట్లను,

అభినయదర్పణంబను మహా గ్రంథంబు
దెనుంగున మెరుంగిడి మదీయ కీర్తికి
ముఖాలంకారంబు సేయుమన్న వల్లెయని
యిట్లంటి :—

నీ మహనీయ రూప మతి నిశ్చల సత్య పదంబె యందునో
భామల మానసంబులతి భవ్యగ నవ్య శరవ్య మందునో
కామిత ధర్మ మందునొ వికాస దయారస రాసమందునో,
యేమని యందు నెందు కరుణాహిత ఖండొజి భూవరాధిపా.

అని లోకాభినందితుండగు కృతి నాయకు గుణంబు లభినందించి తదంకితంబుగా .... (నా) యొనర్పం బూనిన యీ తత్కృతికి సందర్భక్రమం బెట్టి దనిన :—

తంజనగరమందు సరస్వతీ మహల్ శ్రీ శరభోజీ ప్రభువు సేకరించి స్థాపించిన పుస్తక భాండాగారము ప్రశస్తమైనది. భారతీయులు గర్వించదగినది. అందుండు వ్రాత ప్రతి నెం. B. 11537 యందు శీర్షిక యిట్లున్నది .

అభినయ లక్షణము—అభినయదర్పణము—విచిత్రరాయ వతంస.

దీని ప్రతి రూపమును పుస్తక భాండాగారమువారు దయతో నొకటి వ్రాసి పంపిరి. వారికి ఈ వ్యాసకర్త కృతజ్ఞుడు.

ఈ కావ్య ప్రారంభముననే కావ్య భర్తను బ్రోచుటకై కర్త దేవస్తుతి యొనర్చినాడు. మొదటి వృత్తమును హరిపై రెండవదానిని (ఖిలముగా నున్నది) శారదాదేవి మగనిపై, మూడవ దానిని శివునిపై రచించెను. ఈ పద్యములు శృంగార ఘుటికలు. హరిని గూర్చినది ప్రథమ పద్యము :—

శ్రీ కలకంఠ కంఠ కుచసీమల నొక్క కరంబు దర్పణ
శ్రీకర గండపాళి నొక చెయ్యి, నితంబముమీద నొక్కకే
లాకల కంధరాప్తి నొక హస్తము సాచి సహస్రబాహుతా
స్వీకరణంబుగోరు హరి చెల్వుగ బ్రోవుత ఖండొజి ప్రభున్.

రెండవది ఖిలమైనది.

తృతీయ పద్యము అర్ధనారీశ్వరి శృంగారకలాపము.

మణి దంతురీ భవన్మంజు కుంజంబుల తన పదాబ్జంబు
ముందరగ చాచి
సముదగ్ర మకరంద సంతాన వల్లరుల్ తనకేలు
జొనిపి ముందరగ గోసి,
యనుపమాన మృగాజి నాస్తరణంబుపై తన ప్రక్క
గాగ ముందర శయించి
శీతోష్ణ శంకచే చేత గందంబున తన మేన కొంత
ముందర నలంది
యలర ప్రియుహాలి కిట్లు వేడ్కలు ఘటించు విశ్వ
మోహను డర్ధనారీశ్వరుండు
కౌశికాన్వయు మల్లవడీశమౌళి పుణ్యు ఖండోజి రా
యని బ్రోచుగాత !

ఈ కవి కృతిభర్తయు శృంగార చమత్కారములందు ప్రియుడని తెలియుచున్నది.

కథావస్తువును గూడ పార్వతీదేవికి ఏకాంతమున పరమేశ్వరుడు ప్రశ్నోత్తర రూపముగ వర్ణించినాడు. ఎట్లన :—

శ్రీ గిరిజా రమణీమణి
శ్రీ గిరినాయకుని తోడ సితపర్వత సా
భోగపటీ భాగపటీ
రాగ కుటీరముల కేళి నలరగ నచటన్.

అప్పుడా గౌరి.

తన గొప్ప కొప్పు గనుగొని
ఘనమని నటియించు నొక శిఖావళి మిధునం
బును గాంచి యద్భుత స్థితి
మనమున తనరారి గౌరి మగనికి ననియెన్.

ఏమనగా :—

కాన నుండెడి బర్హి యుగంబు సలుపు
నాట్య వైఖరి నామది నాటె నిట్టి
నాట్యమున కెద్ది జీవంబు నాథ దెలుపు
మనుడు శైలజ కనియె చంద్రార్ధమౌళి.

ఈ గ్రంథ విస్తారమున కిదియే మూల ప్రశ్నగ వర్తిల్లినది. చంద్రశేఖరు డి ట్లుపక్రమించెను.

వెన్నెల రేలకు వాసన
క్రొన్ననలకు బోలె కుసుమ కోమలి వినవే
చెన్నలరగ నాట్యంబున
కన్నువ యభినయము జీవమందురు తజ్ఞుల్.

ఈ దర్పణమందు ఏర్చి కూర్చిన విషయసంపత్తి ఇట్టిది:

రంగమండపము నలంకరించు సభాపతి, వారి గుణములు, వారి స్థానము, అభినయమను పదమున కర్థము, దాని విభాగములు—వాచిక, సాత్విక, ఆంగిక (ఆహార్యము పేర్కొనబడ లేదు.) నాట్యమునకు పనికివచ్చు, పనికిరాని యువతుల గూర్చి అంగాభినయంబునందు హస్తములు మాత్రము పేర్కొనబడినవి. ఇచ్చట సంయుత హస్తలక్షణములు, వాని వినియోగములును వివరింపబడినవి. ప్రథమ బింబము సంపూర్ణమయ్యెను. ద్వితీయ బింబ ప్రారంభమున అసంయుత హస్తముల గూర్చి వివరించి, వాని వర్ణనా వినియోగముల చెప్పి ద్వితీయ బింబము సమాప్తమైనది. తృతీయ బింబమందలి వస్తు ప్రదర్శనమే కవి గిరిగారి విశిష్టతా క్రమమును దెలుపును. తృతీయ బింబ ప్రారంభమున శివుడు :

అవధరింపుము గుణహారి యంగజారి
కరిముఖ మయూరవాహుల కన్న సతికి
లలితముగను నసంయుత లక్షణంబు
నొప్పుగా చెప్పి యవ్వల చెప్పదొడగె !

కవిగిరి తన కావ్యము కూర్చునందు భావములు 120 ని వరుసగా పేర్కొనెను. వీటిని అభినయమున, అంగ (ముఖ్యముగ హస్త) విన్యాసములతో నాట్యకర్త చూపనగునని ఉద్దేశించి వీటియందు యే యే హస్తవిన్యాస మెట్లొనర్పవలసినది వివరించెను. ప్రథమమున చెప్పిన 120 భావములు, వరుస తప్పి కొన్ని, వర్ణనలే లేక కొన్ని యున్నవి. ఈ భావము లేవన, దేవతలు, నదులు, కొండలూ, ఋతువులు, ఇట్టివి మఱికొన్ని.

పై 120 భావములకు అంగవిన్యాసములతో క్రియారూపముగ ప్రతిరూపముల చూపు విధమును పద్యములందు కవి తీర్చినాడు. ఈ ఘట్టమున కవిగిరి, సుమతిబోధక మనియు పేరొందిన భరతార్ణవము నుండి విషయగ్రహణము చేసెను. కొన్నింట మూల శ్లోకములకు తెనుగు అనువాదము సల్పెను. ప్రథమమున ఈశ్వరాభినయము. దీనియందు హస్త విన్యాస మెట్లన :

ఎడమ పదంబు నెత్తి మొక మించుక ముందర సాచి వెంటనే
యెడమ కరంబు సాచి ధరనింపుగ సవ్య పదంబు చక్కగా
పుడమిని నిల్ప సవ్య కరమున్ నుదురందు నరాళకంబుగా
నిడ నది యీశ్వరాభినయ మిందు నిభానన శైలనందనా !

ఇట్లు దేవతలయందు చేయనగు హస్తముల తెల్పి శాస్తా దేవుని అభినయమున చూపు విధమును తెల్పెను. శాస్తాదేవుడు హరిహరుని పుత్రుడు. దక్షిణ దేశమున అయ్యప్పన్ అను పేరున జను లనేకులు కొల్తురు. ఆంధ్రావనియందు గురునాథుడనియు సేవింతురు. ఈ దేవతను గూర్చి హస్త విన్యాసము తెల్పినది ఈ కవిగిరి యొక్కడే యనిన సత్యదూరము కాదు. ఈ శాస్తాదేవునియందు :—

సమముగా దృష్టి యుగళంబు చక్క నిలిపి
నిగిడి చక్కగ చతురశ్రముగను నిల్వ
నవనిలోపల నది శాస్త యభినయంబు
గోత్ర సత్పుత్రి జలజ పవిత్ర గాత్రి.

వినగోరు గౌరీదేవికి బోధించు గౌరీ రమణుడు ఉమాదేవి యందు చూపనగు హస్తాభినయమును గూర్చి తెల్పుచున్నాడు.

యెలమి కటకా ముఖంబుగా నెడమ చెయ్యి
యెడమ చనుకట్టు నను నిల్పి కుడి కరము ప
తాకగా చాచి నడుచు చందమున నున్న
యదియె పార్వతి వినుము నీ యభినయంబు.

దీనికి మూలమగు భరతార్ణవమున శ్లోక మిట్లున్నది. పే. 515.

వామేతు కటకం కృత్వా వామస్తన వివేశితమ్
దక్షిణస్తు పతాకశ్చొ ధస్తాత్పం ప్రసారితః
పాదయానం సమాస్థాయ పార్వతీం దర్శయేద్బుధః.

తుంగభద్రా నదియందు చూపనగు హస్త విన్యాసము లిట్లున్నవి.

సవ్య కరము కనిష్ఠిక సాచి పెద్ద
వ్రేళ్ల పైనెత్తి తక్కిన వ్రేళ్ల గూర్చి
వామ కరము పతాక నధోముఖముగ
నమరగ ధరింప తుంగభద్రాభినయము.

గ్రీష్మ ఋతువునందు చూపదగినది.

పదములు మెల్లనె నిడుచును
గదిసిన చెమ్మటల దుడుచు కైవడి దన ప
య్యెదపై నొత్తుచు నూర్పులు
వదలిన గ్రీష్మాభినయము వా ...... (ఖిలము)

తరువాత 119, 120 భావముల యందు చూపనగు వర్ణన పద్యములు ఖిలమై యున్నవి. ఈ తృతీయ బింబము చివర గద్యము లేదు. అటుపైన గ్రంథమే సాగినట్లు లేదు. చివరి బింబాంత పద్యము సరిగాలేదు.

మల్లవడి వరద దళ ది
గ్గల్లతటీ ముకుర మిళిత కాశ్మీర నివా
సోల్లసిత కరణ తేజో
హల్లక విద్వేషి మూర్తి అనుపమ కీర్తీ.

ఇంతటితో త్రిబింబయుత అభినయదర్పణ మహా కావ్యము సంపూర్ణమగుచున్నది.

ఈ గ్రంథమున కవిగిరి, లేక వేంకటగిరి, లేక విచిత్ర రాయ వతంసుని ప్రతిభ, విశిష్టతలు ఎన్నదగినవి. భావములను కొన్నింటిని వరుసగా పేర్కొని అభినేత్రి నాట్య మొనర్చునప్పుడు వినియోగింపనగు హస్తాభినయమును నిర్ణయించుట. ఇట్టి వస్త్వావిష్కరణమే సంస్కృతమున రాయరఘునాథుడను కవి హస్త రత్నావళియను నాట్య గ్రంథమున జేసియున్నాడు. (చూ : భారతి 1963 అక్టోబరు పే. 19) కవిగిరి రచనకును సంస్కృతమున ఇదే పేరు గల్గిన నందికేశ్వరీయమునకును ఎట్టి సంబంధము లేదు. దానికి దెనుగుసేతయు గాదు.

ప్రారంభమున అభినయ లక్షణమును గూర్చి చక్కని పద్య మల్లినాడు ఈ కవిగిరి.

చెలువుగ భావము దప్పక
వలుగురికిన్ మనసు గరంగ నయగారివగన్
బలికిన బలుకుకు తెల్లమి (తెలివిడి(
నలరగ నర్థంబు దెలుపు టభినయ మయ్యెన్.

ఈ పద్యమందు గమనింపదగిన పదములు 'మనసు గరగంగ' యును, 'నయగారి వగ' యును. రససిద్ధియే లక్ష్యమని తాత్పర్యము. అందులకు సౌందర్యమునే వెదజల్లునట్లు నయగారి వగ ననుసరించవలెనట !!

తెలుగువారు ఈ ఆంధ్ర ''అభినయదర్పణమును'' అచ్చొత్తించుట కర్తవ్యముగా తలంతురుగాత !

చిన్ననవల :

# సాగరసంగీతం

శ్రీ విహారి శ్రీ శాలివాహన

ఆ ఊళ్లో అతన్నెరుగనివాళ్లెవరూ లేరు.

ఆ ఊళ్లో వాళ్లనే ఏమిటి ?—ఆ ఊరిమీదుగా ప్రయాణము చేసిన ఎంతోమంది రైలు ప్రయాణికుల్లో కొందరికైనా అతను గుర్తుండి ఉంటాడు. చింపిరిజుట్టు, గుబురు గడ్డం, లోతుకు పీక్కుపోయిన కళ్లు, మోకాళ్లపైకి ఎగకట్టిన చింకి ధోవతి, భుజంమీద వో చిన్న మురికి తుండు—క్లుప్తంగా చెప్పాలంటే యిదీ అతని ఆకారం. ఊచల్లాంటి చేతుల్ని అస్తమానం గాలిలోకి ఊపుతూ, ఎండుటాకుల్లాంటి పెదవుల్ని కదలిస్తూ ఏదో గొణుక్కుంటూ, అడుగులో అడుగేసుకుంటూ తిరిగే అతని లక్షణాన్ని గమనించిన వాళ్లకి తప్పకుండా అనిపిస్తుంది—"అతను 'అదో తరహా' మనిషి" అని.

తొలికోడి కూసిన కొన్ని నిముషాలకి "బండికి గంట కట్టరా పిచ్చి" అనే పెద్ద మాష్టరు పిలుపే ప్రతిరోజూ అతనికి మేలుకొలుపు. ఒళ్లు విరుచుకుంటూ లేచి, క్రింద పరచుకు పడుకున్న తుండును దులిపి పైన వేసుకొని వెళ్లి గంట కొట్టేవాడు. పెద్ద మాష్టరు గదిలోకి పోయి చేతి లాంతరు తీసుకుని ప్లాట్‌ఫారం చివర దాకా వెళ్లి దాన్ని చేతో ఎత్తి పట్టుకుని నాలుగైదు సార్లు అటూ యిటూ ఊపేవాడు. ఎర్ర సిగ్నలు పచ్చదిగా మారంగానే వెనక్కి తిరిగి వచ్చేవాడు. లాంతరు గదిలో పెట్టి పంపు దగ్గఱకు పోయి దాని ప్రక్కనే ఉన్న వేపచెట్టు మండ విరిచి పళ్లు తోమటం మొదలెట్టేవాడు. అతని దంతధావనంపూర్తయేసరికి రైలు వచ్చేది రైలు దిగిన ప్రయాణికు లెవరైనా ఏ పెట్టో బెడ్డింగో ఊళ్లోకి తీసుకుపోవాలంటే ఆపని చేసేవాడు. లేకుంటే స్టేషనుకు ఎదురుగా ఉన్న అచ్చాయమ్మ హొటలుకు పోయి పప్పు రోటిలో పోసుకుని కూర్చునేవాడు. ఆపని పూర్తయేసరికి మళ్లీ రైలు వేళయ్యేది. ఇలా ఆ స్టేషనులో పగటిపూట ఆగే ఆరు రైళ్లలో నుంచి దిగే ప్యాసింజర్ల బరువులు మోసిగాని, లేకపోతే హొటల్లో ఆపనీ యీపనీ చేస్తూనో రాత్రిదాకా గడిపేవాడు. కూలి డబ్బుల్తో పొట్టని పోసుకుంటూ ఉండేవాడు. చీకటిపడగానే మాత్రం ఆ ఊరికి రెండుమైళ్ల దూరంలో ఉన్న ఏటి ఒడ్డుకు పోయేవాడు. అక్కడ ప్రొద్దుపోయేదాకా కూర్చుని ఎప్పుడో వచ్చి స్టేషన్లో పడుకునేవాడు—'మాయాప్రపంచమ్మ తమ్ముడూ....' అని ఏవేవో పాడుకుంటూ.

గడచిన పదేళ్లనుంచీ యిలా సాగిన అతని దినచర్య ఈనాటితో అంతమైంది. అతనీ రోజున లేడు—

అత న్నెరిగిన వాళ్లంతా "పాపం. పిచ్చోడు పోయాడు." అన్నారు. అంతకంటే ఆప్తు లనబడే అచ్చాయమ్మ, పెద్ద మాష్టరువంటి వాళ్లు ఏవో మంతనాలు జరిపి ఆ అభాగ్యుని అంతిమయాత్ర కవసరమైన ఏర్పాట్లు చేయటంలో నిమగ్నులైనారు.

* * *

గణపతి వ్రాసిన ఉత్తరాన్ని, మళ్లీ చదువుకున్నాడు చిరంజీవి.

"నేనీఊరు క్షేమంగానే చేరేను. పల్లెటూరు వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది. కాని ప్రకృతి కంటే విభిన్న ప్రకృతులు కలిగినవాళ్లుగా కనపడుతున్నారు. ఈ ఊళ్లో నాకు తారసపడ్డ మనుష్యులు. నా రాకకోసం ఊళ్లో పెద్దమనుష్యు లనబడ్డ వాళ్లంతా వేచి చూస్తున్నారు, నేనీ ఊరుకు వచ్చిన రోజున అంతా ఘనమైన స్వాగతం పలికారు. ఆరోజు హాయిగానే గడచిపోయింది. మర్నాడు బడిలో ప్రవేశించాను. పిల్లల్లో కూడా ఉత్సాహం గోచరించింది కాని, ఆ ఉత్సాహాన్ని మలినపరుస్తూ "రెక్‌లెస్‌నెస్" అంటారే అది కొట్టొచ్చినట్లు కనపడుతున్నది. బహుశా నా నిర్ణయం తప్పే కావచ్చు. కాని కాలం నిర్ణయిస్తుంది గదా తప్పొప్పుల్ని.

"ఇక పోతే యీ ఊళ్లో నీకు తెలియజేయవలసిన. విశేషాలు కొన్ని ఉన్నై. ఊరంతా రాజకీయాల మయం ఉన్న జనాభా పదివేలయినా పార్టీలు చూస్తే తల కొకటిలా ఉంది. పల్లెపట్టుల ఔన్నత్యాన్నే విని, చదివి ఊహించుకుని ఉప్పొంగిపోయిన నావంటి వాడికి యీ యదార్థాలన్నీ ఆశాభంగం కలిగించకమానవనుకో. అయినా మనిషిమీద మనిషికి యింతింత పగ ఉందంటే బాధపడకుండా ఉండలేం. మునవబు కరణాల మధ్య పచ్చి గడ్డి వేస్తే భగ్గున మండుతుంది.

అలాగే ప్రెసిడెంటు—వోతుబరి మాధవయ్యా—వీ రింటిమీది కాకి వా రింటిమీద వాలదు. చివరికి చాకలివాళ్ల దగ్గర్నుంచీ యింతే. ఒక పార్టీవాడు మరో పార్టీకి సంబంధించిన మనుషు లకు గుడ్డలు ఉతకడు. ఇలా ఉన్నాయి రాజకీయాలు. నేనీ వూళ్లో అడుగు పెట్టగానే అందరూ బాగానే పలుక రించారు. కాని మాధవయ్యగారు కరణంగారు కలిసి నన్ను వాళ్ల దారి పట్టించి, మాధవయ్యగారింట్లో మకాం వేయించ టంతో మొదలైంది గొడవ. మర్నాటి నుంచీ నేను యీ 'జట్టు' మనిషినై పోయాను. ప్రెసిడెంటు గారికీ, ఆయన పార్టీ వారికీ, నే నొక శత్రువుగా కనపడుతున్నాను. మాటల్లో చేతల్లో ఈ విషయాన్ని వన్నె చిన్నలుగా వెలువరిస్తూ ఏదో 'తెలివి' గా ప్రవర్తిస్తున్నారు. అర్థంలేని కక్షలకు లోనై ఊరును నాశనం చేస్తున్నారు. ఇవన్నీ చూసి బాధగా ఉండి, ఇలా అని మాధవయ్యగారితో హెచ్చరించి చూశాను. ఆయన నా మాటను తేలిగ్గా తీసుకుని నన్నొక అర్భకుడిలా భావిం చాడు. నేనా మాట అన్నప్పుడు ఆయన నవ్విన నవ్వునుబట్టి నాకు తెలిసిం దిది. నేనీ విషయంలో గట్టిగా జోక్యం కలుగజేసు కోవాలనిపించేలోగానే మరో తాజా పరిణామం సంభవించింది.

''నిన్న సాయంత్రం ఊరి బయటకు షికారుకు పోయి వస్తుంటే మునసబు కనిపించి పలుకరించాడు. మాటల మధ్యలో ''మీరా మాధవయ్యగారిని నమ్ముకుంటే బొందన పడతారు. నామాట విని ప్రెసిడెంటుగారు వైపు మొగ్గమని'' ఉచిత సలహా యిచ్చాడు.

''నాకీ మొగ్గటాలు, తగ్గటాలు పనికిరావనీ, నాకు ఆయనంటే అభిమానం గాని, ఈయనంటే కోపంగానీ లేవనీ'' విడమర్చి చెప్పాను. ''ఊఁ .... ఊఁ .....'' అని తల ఊపు కుంటూ వెళ్లిపోయేడు. వెళ్తూ వెళ్తూ హెచ్చరించి పోయాడు. ''జాగ్రత్త పంతులూ. ఊరికి కొత్తోడివి. చీకటి పడి యినాలా ఊ రెలుపల తిరగమాక'' అంటూ. ఇదీ వరస. ఈ ద్వేషాల నన్నిటినీ పోగొట్టి వీళ్లందర్నీ ఓ త్రాటిమీదకు లాగాలనే కోరిక మాత్రం ఉంది. ఏం చేయగలనో. చూద్దాం.. మరి ....ఇక ఉంటా ....

నీ గణపతి.''

చిరంజీవి సన్నగా నవ్వుకున్నాడు. ఏ విషయాన్నయినా 'సీరియస్' గా తీసుకుని ఆలోచిస్తూ కూర్చునే గణపతి రూపం అతని కళ్లముందు నిలిచింది.

గణపతి స్వరూప స్వభావాలు చిరంజీవికి తెలిసినంతగా మరొకరికి తెలియవు. వా ళ్లిద్దరూ నాలుగేళ్లపాటు కలిసి బ్రతికినవాళ్లు. ఏమండీతో ప్రారంభమై, ఏమోయ్‌తో మరో మెట్టు పైకెక్కి 'ఏరా' తో పరిపక్వ స్థితిని పొందింది వాళ్ల స్నేహం.

''గణపతి మంచి ఊళ్లో పడ్డాడు. సంస్కారానికీ, ఉత్త మాభి రుచులకూ ఈ రోజుల్లో ఉన్న విలువ ఏమిటో ఇకనైనా తెలుసొస్తుందిలే వాడికి.'' అనుకున్నాడే కాని అంతలోనే ''ముక్కుకు సూటిగా పోయే కుర్రాడికి ఏ అన్యాయం జరుగు తుందో'' నని తహతహలాడిం దతని మనస్సు.

గణపతి బొత్తిగా లౌక్యం తెలియని మనిషి. ఎంత చిన్న విషయానికైనా ఊగిపోయే తత్వం అతనిది. పైగా ఆవేశం ఓ పాలు హెచ్చు. దాంతో ఏ బెడద కొనితెచ్చు కుంటాడో ననిపించింది. 'గణపతికి బెడద' అనే ఊహ కలిగే సరికి మనస్సు మథనపడసాగింది. తమ సాహచర్య మధురో హలు హృదయంలోనుంచీ పెల్లుబికినై.

కాలేజీ చదువుకోసం పట్నంలో అడుగుపెట్టిన గణ పతికి తొలిసారిగా తటస్థపడిన వ్యక్తి తాను. గణపతి రాకతో తన రూము కొక క్రొత్తదనం వచ్చింది. అతని ఆకారంలోనే ఏదో క్రొత్తదనం కనపడుతూ ఉండే దసలు. తలమీద మొదటి సగభాగం అర్ధచంద్రాకృతిలో తీసివేయబడి, రెండో సగాన్ని ఆక్రమించిన అతని గిరజాల జుట్టు, దానికి చివర తోకలా వ్రేలాడే 'పిలక', స్వచ్ఛమైన పాలభాగంమీద విభూతిరేఖలూ, నొసట కుంకుమబొట్టు, రోడ్డు దుమ్మంతా ఊడుస్తూ ఉండే ఖద్దరు పైజమా, దానిమీద అటు పొడుగు చేతులూ, ఇటు పొట్టి చేతులూ కాని ఖద్దరు లాల్చీ—కాలేజీ విద్యార్థుల కాల క్షేపానికి చక్కని ముడిసరుకుగా ఉపయోగపడినై యివన్నీ. ఈ ఆకారానికి తోడు స్వభావంలో కూడా ఒక ప్రత్యేకతని ఆపాదించుకున్నాడు గణపతి—ఆ రోజుల్లో. తోటి విద్యా ర్థులు పరోక్షంగా గానీ ఏమని గేలిచేసినా ఎదురు మాట్లాడే వాడు కాదు. ఎప్పుడూ ఏదో తన భావనా ప్రపంచంలో తను తేలిపోతున్నట్లు కనిపించేవాడు.

ఫస్టియర్ పూర్తయేసరికి గణపతిలో చెప్పుకోదగిన మార్పు కలిగింది. నలుగురిలో కలిసి తిరగటం, పదిమందితోత్సా హంగా మాట్లాడటం అలవాటు చేసుకున్నాడు. వీ టన్నిటినీ మించి పుస్తక పఠనం ఒకటి అబ్బింది. తద్వారా అత నెంతో జ్ఞానాన్ని, సంస్కారాన్ని నేర్చుకున్నాడు. శుద్ధ చాందసుని యింట పెరిగి ఊడలు దిగిన సంకుచిత స్వభావా లన్నిటినీ కూకటివ్రేళ్లతో ఛేదించివేశాడు. దాంతో అతనిలో అంత ర్నిగూఢమై ఉన్న కరుణ, జాలి, సానుభూతి, మంచిదనం వెలుపలిచూపు చూడసాగినై. బాధావ్యథలతో సతమతమై పోయే ప్రజల్ని చూసి అతని హృదయం ఆరాటపడేది. వాళ్లందర్నీ ఆ విష వలయంలోనుంచి తప్పించాలనీ, ఆ కార్య సాధనకు తన జీవితాన్ని పణమొడ్డాలనీ—ఎన్నెన్నో భావాలు చెలరేగినై. వీ టన్నిటినీ తన ఎదుట మహదావేశంతో చెప్తూ పొంగిపోయేవాడు గణపతి. అతన్ని చూసి తనకు గర్వంలాంటి దేదో కలుగుతూండేది. ఆశ్చర్యమూ కలిగేది—ఎలాంటి వ్యక్తి ఎలాంటి మనిషిగా మారేడా అని......

కాలేజీలో రెండవ సంవత్సరమంతా ఎంతో కోలాహలం చేసేడు గణపతి. ఎప్పుడూ ఏవో సభలూ, ఉపన్యాసాలు, నాట కాలు, ప్రదర్శనలు—ఎందులో చూసినా గణపతే. ఏ బీద విద్యార్థి సహాయార్థమో, ఏ బీద కుటుంబీకుని పుత్రిక వివాహ సహాయానికో ప్రదర్శనలు ఏర్పాటుచేస్తూ ఉండేవాడు.

ఇలా అనేక వ్యాపకాలతో 'బిజీ' గా తిరిగే గణపతిని చూస్తే గుర్రుగా ఉండేది కొంతమందికి. కొన్నాళ్లయ్యేసరికి ఆ గుర్రు బయటపడింది. గణపతి చేసే ప్రతి పనిలోను దోషాన్ని చూపటం మొదలెట్టారు కొందరు. అతనిమీద విషప్రచారం ప్రారంభమైంది. గణపతి ఎంతో ఆవేదన పొందేడు. తానేదో నలుగురి మంచికీ ప్రయత్నిస్తుంటే వాళ్లంతా ఎందు కలా అడ్డుపడతారో తెలియక అల్లాడేవాడు. తనతో వాళ్లందరి సంకుచిత స్వభావాలను గురించి పదేపదే చర్చిస్తూ ఉండేవాడు. అలా గెలుపు—ఓటముల మధ్య గడచిపోయింది ఆ యేడు.

గణపతి ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు. ఇక్కడే అతని జీవితం మలుపు తిరిగింది. సెలవులకు యింటికి వెళ్లిన గణపతి తనకున్న యావదాస్తి—తన తండ్రి—ని పోగొట్టుకుని అసహాయ స్థితిలో తిరిగి పట్నాని కొచ్చేడు. అప్పుడే గణపతి సర్వస్వం తానుగా భావించుకున్నాడు. తను. ఆనాడు తనకీ భావన ఎందుకు కలిగింది—ఎలా కలిగిందీ అనేదానికి జవాబు లేదు.

గణపతి చదువు ఆపేయవలసిన పరిస్థితులు ఏర్పడినై. కాని, తన సలహా ప్రకారం అతను ట్రైనింగులో చేరాడు. ఆ రెండేళ్లూ తనే అతన్ని ఆర్థికంగా కనిపెట్టుకుని ఉన్నాడు. ట్రైనింగు పూర్తిచేయటం, పల్లెటూళ్లో ఉన్న మిడిల్ స్కూల్లో ఉద్యోగం రావటం వెంట వెంటనే జరిగినై. వెళ్లిన నాలుగు రోజులకు గణపతి ఉత్తరం వ్రాసేడు.

మిత్రుడికి త్వరలోనే జవాబు వ్రాయాలను కున్నాడు చిరంజీవి.

* * * *

శివకామయ్యగారు గణపతిని దులిపేస్తున్నారు.

''మీరు చేసిన అవివేకపు పనికి ఆ పెద్దమనిషి నన్ను నానా మాటలూ అన్నాడు మేష్టారూ. నే నిలా కరుకుగా మాట్లాడటం మీకు కొంత బాధ కలిగించవచ్చు. కానీ, ఈ స్కూలు హెడ్‌మాష్టరుగా నాకు కొన్ని ప్రత్యేకమైన బాధ్యత లున్నయ్. వాటిని నిర్వర్తించడం నా విధి. అందుకే మిమ్మల్నింత గట్టిగా హెచ్చరిస్తున్నాను. మనలా పొట్టకోసం ఆరాటపడే దురదృష్టమంతు లెవరూ ఈ ఊళ్లో లేరు. వాళ్ల పిల్లలకి చదువు రావట మన్నది అంత ముఖ్యంకాదు గాని, వాళ్ల కేదైనా జరిగిందంటే, ఆ జరిపినవాళ్లమీద కక్ష తీర్చుకోవట మన్నది అతి ముఖ్యమైన విషయం. మీరా కుర్రవాణ్ని సదుద్దేశంతోనే కొట్టిఉండొచ్చు. కాని, చూశారా, ఆ చిన్న విషయం ఎంత గాలిదుమారం లేవదీసిందో. ఐనా క్లాసులో అంతమంది పిల్లలుండగా వాడే ఎందుకు దొరికాడండీ మీకు. నా ఖర్మకాలి నా కిలా రాసిపెట్టుంది. ఆఁ. అయిందేదో అయింది గానీ, యికనైనా కాస్త జాగ్రత్తగా ఉండండి.''

త వఢచుకుని ఆయన చెప్పినదంతా విన్న గణపతి తలెత్తి ''అయిందా'' అన్నాడు సూటిగా శివకామయ్యగారి కళ్లల్లోకి చూస్తూ.

శివకామయ్యగారు గతుక్కు మన్నారు. ఆశ్చర్యంగా గణపతిని తేరిపార చూడటం మొదలెట్టారు.

''మీరు చెప్పాల్సిన విషయం అయిందా అని ....'' గణపతి ఆయన ఆశ్చర్యాన్ని పారద్రోలుతూ అడిగేడు.

శివకామయ్యగారు రెచ్చిపోయారు. ''వాట్ డూ యూ మీన్'' అన్నారు గట్టిగా.

''ఐ మీన్ టు సే దట్ ఐయామ్ నాట్ ఎట్ ఫాల్ట్.'' అంటూ విసురున అక్కణ్ణుంచీ బయటి కొచ్చేసేడు గణపతి. శివకామయ్యగారి మొహం ఉడికిన బంగాళ దుంపలా మారటం గమనించకపోలేదు గణపతి.

టీచర్స్ రూములో కొచ్చి ఓ మూలగా కూర్చున్నాడు గణపతి. ఒంటరిగా అదే ప్రదేశంలో కూర్చుని కాంపోజిషన్ బుక్సు దిద్దుకుంటున్న తనను హెడ్‌మాష్టరు ఉన్న ఫళాన రమ్మని కబురు పెట్టినప్పుడే అనుకున్నాడు గణపతి. ''ఏదో జరిగిందిరా భగవంతుడా'' అని. తీరా వెళ్తే జరిగిందిది.

ఆ క్రితంరోజు జరిగిన సంఘటనంతా గణపతి కళ్ల ముందు తిరిగింది. తాను క్లాసుకు పోయేసరికి క్లాసు రూమంతా నానా హంగామాగా ఉంది. పిల్లలంతా అరుచుకుంటూ, ఎగురుకుంటూ ఏదో ఘనకార్యం సాధించినట్లు మొగ్గలేస్తున్నారు. తను లోపలికి పోవటంతో వాళ్ల ఆనందం చప్పున చల్లారింది. ఎక్కడివా ళ్లక్కడ కూర్చోగానే పాఠం మొదలెట్టబోయేడు తను. కానీ అంతలో ఒక పిల్లవాడు వచ్చే నవ్వును చొక్కాలో దాచుకుంటూ 'ఇహిహి' అన్నాడు. విషయమేమిటని గద్దిస్తే బిక్కుబిక్కు మంటూ బోర్డువైపు చూపేడు. వికృతరూపంలో ఒక బొమ్మ వేసి, దాని క్రింద 'ఓ బొజ్జ గణపయ్య' అని వ్రాసే రెవరో దానిమీద. తనకేదో ఆపుకోలేని ఆవేశం, కోపం కలిగాయి. ఫలితంగా ఆ పనికి కారణభూతుడైన కుఱ్ఱోణ్ణి చావ చితక బాదేడు. చూసి కూడా పాఠం చదువలేని మొద్దు వెధవ వాడు. తను కలగన్నాడా ఆ పిల్లాడు ప్రెసిడెంటుగారి ముద్దుల కొడుకని!

వాడు పోయి యింట్లో ఫిర్యాదు చేయటం, ప్రెసిడెంటుగారు శివకామయ్యగారిని పిలిచి నాలుగు పెట్టట మనేది తర్వాత జరిగిన తతంగం. రాత్రే తనకీ విషయం తెలిసింది. తెలుగు మేష్టరు శంకరశాస్త్రిగారు ఆ సమయంలో ప్రెసిడెంటుగా రింట్లోనే ఉన్నారట— వాళ్లమ్మాయికి సంస్కృతం నేర్పుతూ. ఆయనే తన కిదంతా చెప్పి, ఓ పుల్ల విరుపుమాట అని పోయేడు.

''మన స్కూల్లో టీచర్లందరికీ ఆయనంటే అభిమానమోయ్. ఎందుకంటావా ?—ఆయన గంగి గోవు. వూళ్లో స్కూలు వెలవటానికీ, దాని పోషణకూ అన్నిటికీ ఆయనే గదా కారణం. పైగా తృణమో పణమో ముట్టచెప్పే మంచితనం ఆయన కొక్కడికే ఉంది. అందుకని యికనైనా ఆ మాధవయ్యకొంప వదిలేసి యువతలకిరా. ప్రెసిడెంటుగారికి ఆగ్రహమొస్తే మనకీ ఊళ్లో పుట్టగతు లుండవోయ్'' అని.

ఆయన చేసిన హితబోధలాంటి హెచ్చరికతో తన పట్టుదల ఒకింత పెరిగింది. "వీళ్ళు చేసేదేమిటో చూద్దాం" అనుకున్నాడు ధీమాగా.

గణపతి ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ అక్కడి కొచ్చేడు గోపాలం.

గోపాలం స్కూలు జవాను. అతను మాధవయ్యగారి పొలంలో కొంతభాగం కౌలుకు తీసుకుని కొడుకుచేత చేయించు కుంటూ ఉండటంవల్ల, అతనంటే ప్రెసిడెంటుకు పడదు. ఆవిధంగా అతను మాధవయ్యగారి పార్టీ మనిషిగా మారిన వాడు. ఇప్పుడు గణపతీ అదే కోవలో ఉండటం వలన గోపాలానికి గణపతి అంటే కొంత అభిమానం ఏర్పడింది.

"ఏమిటోయ్" అన్నట్లు సాలోచనగా గోపాలంవైపు చూసేడు గణపతి.

గోపాలం ఏదో చీటీలాంటి కాగితాన్ని అతనికిస్తూ "అమ్మాయిగారు యివ్వమన్నారండి" అన్నాడు.

గణపతి ఆ ఉత్తరాన్ని చదువుకుని "ఉఁహూఁ" అని తల పంకించాడు.

* * * *

మధ్యాహ్నం 12 గంటలైంది.

గణపతి ఇంటి కొచ్చేసరికి మాధవయ్యగారు తాపీగా చుట్ట కాల్చుకుంటూ వరండాలో కూర్చున్నారు. తన గది లోకి వెళ్లబోయాడు గణపతి.

వెళ్తున్న గణపతిని గంభీరంగా కేకేసేరు మాధవయ్యగారు, "మేష్టారూ ...."

గణపతి అక్కడికొచ్చి నిలబడ్డాడు.

"కూర్చోండి" అన్నారు మాధవయ్యగారు. గణపతి ఆయన ప్రక్కనే ఉన్న కుర్చీని అవతలికి లాక్కుని కూర్చున్నాడు.

"నిన్న మీరు ఆ కుర్రవాణ్ణి కొట్టినందుకు మీకు శిక్ష పడబోతున్నది తెలుసా ?" అన్నారు.

గణపతి నిర్విణ్ణుడైనాడు.

"ప్రెసిడెంటు పరిషత్తుకు పోయి మిమ్మల్ని ఏ శంకరగిరి మాన్యాలకో తోలించటానికి ఈవేళే బయల్దేరుతున్నాడు. ఇదంతా మీరు నాయింట్లో ఉండటంవలన జరుగుతున్నది కనుక, నాకు జరుగుతున్నట్లుగానే భావించటంలో తప్పు లేదు. ఏమంటారు ?"

మాధవయ్యగారి ప్రశ్నకు గణపతి మౌనం దాల్చాడు.

"అందుకనే నేనూ బయల్దేరుతున్నాను. వాడెంత ప్రెసిడెంటయినా, నామాత్రపు పలుకుబడి వాడి కెక్కణ్నుంచి ఏడుస్తుంది. మిమ్మల్ని ట్రాన్స్‌ఫరు చేసే మొనగాడెవడో చూస్తా ...." ఈ మాటలని తన బుంగమీసాల నొకసారి దువ్వుకున్నారు మాధవయ్యగారు.

గణపతికి పరిస్థితి అర్థమైంది. 'సుజాత తనను స్కూలు వదలగానే రమ్మన్నది యిందుకన్నమాట. ముందుగా తనకు తెలియజేసి మంచిపని చేసింది.' అనుకున్నాడు. ఉన్న రాజకీయాల నన్నింటినీ సమయింపజేసి, ఈ పెద్ద తలకాయల నన్నింటినీ ఒకచోట చేర్చాలనే ఆశతో తానుంటే, దానికి వ్యతిరేకంగా ఒకళ్లమీద ఒకళ్లు కారాలూ, మిరియాలూ నూరటం ఎక్కువౌతున్నదేమో అనే బాధ కలిగింది.

"మీ ఉద్దేశ్య మేమిటి ?" అన్న మాధవయ్యగారి ప్రశ్నతో ప్రస్తుతంలో పడి, చెప్పాడు గణపతి.

"నాకీ రాజకీయాలంటే గిట్టవండీ. మనుషులమీద మనుషులు యింత ద్వేషం పెంచుకుని వినాశనాన్ని కొనితెచ్చుకోవటం వివేకవంతుల లక్షణం కాదు. సమయ మొచ్చింది కాబట్టి నా మనసులో మాట చెప్తున్నాను. ప్రెసిడెంటుగారికీ, మీకూ రాజీచేసి మీ యిద్దర్నీ ఒకటిగా చేయాలని నా కోరిక. దాంతో ఊళ్ళోవాళ్లంతా ఒకటై గ్రామాభివృద్ధికి పూనుకోవచ్చు. దానికి ప్రయత్నిస్తానని యిదివరకే మీతో అన్నాను కూడా."

మాధవయ్యగారు నవ్వసాగేరు. ఆయ నెందుకు నవ్వుతున్నాడో తెలియకపోలేదు గణపతికి. "అదేం అంత తేలిగ్గా అయ్యే పనా ?" అని ఆయన భావం. కొద్దిసేపయిన తర్వాత అన్నారు మాధవయ్యగారు.

"మీరు చాలా అమాయకులండీ మేష్టారూ. ఈపని మీరు సాధించగలరనే మీ నమ్మకానికీ, సాధించాలనే ఆశకే నాకు నవ్వొస్తున్నది."

గణపతి వెంటనే అనేశాడు, "సాధించటం సాధించలేకపోవటం అనేది ప్రయత్నంమీద ఆధారపడి ఉంటుంది. అసలా ప్రయత్నమూ లేకుండానే, ఆపని జరగదని కూర్చుంటే, ప్రపంచంలో జరిగిన మహత్కార్యాలేవీ జరిగి ఉండేవే కావు. అందుకని ప్రెసిడెంటు గారితో మాట్లాడాలని ఉంది నాకు." ఆవేశంతో అతని కంఠం బరువెక్కింది.

కొద్ది క్షణాలు తటపటాయించి "సరే. మిమ్మల్ని నే నెందుకు నిరుత్సాహపరచాలి. వెళ్లి మాటాడిరండి. అప్పుడుగానీ మీకు ఆ ప్రెసిడెంటు సంగతి తెలీదు." అన్నారు మాధవయ్యగారు. "ప్రెసిడెంటు" అనే మాటను నొక్కి పలుకుతూ.

గణపతి సంతృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు. చాలామంది పెద్దల్లో సహజంగా గోచరించే లక్షణమే మాధవయ్యగారిలోనూ ఉందనిపించింది. పైకెంత బింకపు మాటలు మాట్లాడినా, ఒక్కొక్క సమయంలో ఎదటివాళ్ల చెప్పు చేతలకు యిట్టే లోనవుతారు కొందరు. ఇదే లక్షణం ప్రెసిడెంటుకూ ఉంటే తన ఆశ నెరవేరకపోదనే ధైర్యం కలిగింది.

గణపతి ప్రెసిడెంటుగారింటికి బయల్దేరపోతుండగా గది గుమ్మంలో నిలబడి ఉంది సుజాత. గణపతి ఉత్సాహంగా ఆమె ముఖంలోకి చూస్తూ "సుజాతా. నువ్వు చాలా తెలివైన

"పని చేశావ్. థాంక్స్." అన్నాడు. ఆమె తలవంచుకునే ఉండటంతో గణపతికేదో సందేహం కలిగింది.

"ఏమిటి సుజాతా ? ఏమిటి సంగతి ?" ప్రశ్నించాడు.

ఆమె బదులుగా ఒక్కమాటే అంది. "మేష్టారూ. నాకేదో భయంగా ఉందండీ. మీరు వెళ్ళొద్దు. చూస్తూ, చూస్తూ ఆపదల్ని కొనితెచ్చుకోవట మెందుకు ?"

గణపతి తేలిగ్గా నవ్వేశాడు. "పిచ్చి సుజాతా. నామీది ప్రేమతో నీకింత భయంగా ఉంది కానీ, నాకేం ఫర్వా లేదు. అక్కడి కక్కడ నన్నే మాంత్రికుడు బంధించడు. ఒకవేళ అలాంటి దేమైనా జరిగినా ఆదుకోవటానికి నువ్వున్నావుగా" అన్నాడు.

సుజాతకు కోప మొచ్చింది. "మంచేదో చెడ్డేదో నిర్ణయించుకోలేనంత ఆవేశముంది మీకు. నా కెందుకు. మీ బాధ మీరు పడండి" అంటూ విసురుగా ఇంట్లోకి వెళ్ళిపోయింది.

సుజాతకు కోపం తెప్పించినందుకు బాధ కలిగింది గణపతికి. అంతలోనే 'సుజాతకు తనమీదున్న భక్తిశ్రద్ధల మూలంగా అంత భయపడుతున్నదిలే' అనిపించింది. నవ్వుగా యీల వేసుకుంటూ హుషారుగా బయల్దేరాడు.

* * * *

గణపతికి ఉత్తరం రాసి పదిహేను రోజులైనా జవాబు లేకపోయేసరికి కాస్త బెంగ పట్టుకుంది చిరంజీవికి. ఆఫీసు నుంచి వచ్చి తన గదిలో పడుకున్న చిరంజీవి ఆలోచనలన్నీ గణపతిమీదనే లగ్నమై పోయినై. గణపతి ఎలా ఉన్నాడోననే ఆవేదన పెరిగిం దతని మనస్సులో.

"సిరంజీవిగోరూ ...." అన్న పిలుపు, పిలుపుతోపాటు గేటు తలుపు కొడుతున్న శబ్దం, తన నిశ్శబ్దాన్ని భంగపఱచటంతో లేచి వెళ్ళి తలుపు తీసేడు చిరంజీవి.

మధ్య తరగతి రైతులాంటి ఒక వ్యక్తి ఎదురుగా నిలబడి ఉన్నాడు. "సిరంజీవిగోరుండేది యీడనేనా" అని అడిగాడు.

"అవును. నేనే. ఏం కావాలి ?" చిరంజీవి ప్రశ్నించాడు.

"మాది .... పూరండీ. గణపతి పంతులుగారు పంపారు."

ప్రాణం లేచివచ్చిన ట్లయింది చిరంజీవికి. "రా.... రా ...." అంటూ లోపలికి దారి తీశాడు.

గదిలోకొచ్చి కూర్చున్న తరువాత మొదలెట్టాడు ఆ వ్యక్తి. "గణపతి పంతులుగారు మా మంచి మనిషండి. నూటికీ, కోటికీ ఒక్కరు తగుల్తారు అట్టాంటి మనుషులు."

"అది సరేనయ్యా. మావా డెలా ఉన్నాడు ? ఏం చెప్పమన్నాడు ?" మధ్యలోనే కల్పించుకుని ఆతృతగా అడిగేడు చిరంజీవి.

"ఉండండయ్యగోరూ.... అంత అట్టా గిదవుతారేం. ఆ అయ్యగారికేం. బాగానే ఉన్నార్లెండి." అన్నాడు ఆ వ్యక్తి.

"అమ్మయ్య" అని స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకున్నాడు చిరంజీవి.

అతను మళ్ళీ చెప్పటం మొదలెట్టేడు. "అయ్యగారు మా ఊరొచ్చి నెల రోజులే ఐనా, ఊళ్ళో మా మంచి పలుకుబడి సంపాదించినార్లెండి. మా మాధవయ్యగారికీ, ప్రెసిడెంటుగారికీ రాజీ చెయ్యాలని ఆయనగారి తాపత్రయం. అయితే యేం. ఎదవనాకొడుకులు సాగనిచ్చింద్రుగాదు. అంతే బాబూ. అస్తమానం కొట్టుకచచ్చే నాయాళ్లకు మంచి చెప్తే బుర్ర కెట్టా గెక్కుతుంది. పాపం. బంగారంలాంటి మడిసి వూసులు తీసెయ్యటానికి ఎనకా ముందూ చూడకుండా బాదారు."

చిరంజీవి నిర్విణ్ణు డైనాడు. అతని హృదయంలో ఏదో దేవినట్లయింది. "ఆఁ. మా గణపతిని కొట్టేరా ?" కంఠం బొంగురుపోయి, ఆవేదనా, దుఃఖం ధ్వనించాయి.

ఆ వ్యక్తి అవునన్నట్లు తలూపుతూ విషణ్ణవదనంతో వివరాలు చెప్పసాగేడు. "అవును బాబూ. పెసిడెంటుగారినీ, మాధవయ్యగారినీ ఒక్క తాటిమీదకు లాగాలని పాపం బహుశ్రమ పడ్డారు. మాధవయ్యగారిది అదో యిదిలెండి. పంతులుగారేదన్నా గట్టిగా సెప్తే "సరే. కానీ" అనేస్తారు. దీనికీ అట్టాగనే అన్నారు. కానీ ఆ కుళ్ళు మనిసి పెసిడెంటు గణపతిబాబుగా రెళ్ళి మాట్టాడేసరికి, "అట్టాగే. రేతిరికి రచ్చబండకాడ పదిమందీ పోగై, ఉన్న యిసయాలన్నీ తేల్చేసుకుందాం రండన్నాడు. రేతిరి కూడు తిన్నాక ఊళ్ళోవాళ్లంతా ఆడకిఁ చేరినాం. ఆళ్ళిద్దరి మద్దెన ఉన్న అనుమానాలన్నీ యివరించుకుంటుంటే, మాట మీద మాట పెరిగి కర్రలు లేచినై. పెసిడెంటు మూతా అసలా పనికే తయారై ఆడ కొచ్చినారని మా కెవ్వరికీ తెలవదు. నలుగు రైదుగురు గర్జన పడుతుంటే బరిసెలు తీసుకుని దొమ్మీ కొచ్చారు రౌడీ ఎదవలు. దాంతో మావాళ్ళూ రెచ్చిపోయారు. రెండు పార్టీలవాళ్ళూ 'ఏసెయ్యండహో, అంటే ఏసెయ్యండహో' అని కొట్టుకున్నారు. పంతులుగారేమో "ఆగండి, ఆగండి" అని ఒకటే అరుపులు. గందరగోళంలో ఎవడేశాడో గానీ తలకాయకి మా గట్టి దెబ్బ తగిలింది పంతులుగారికి. ఆడిచేతు లిరగ" పళ్ళు పటపటలాడిస్తూ ముగించా డతను.

"గణపతీ" అంటూ చిన్న పిల్లాడిలా బోరున విలపించ సాగేడు చిరంజీవి.

చిరంజీవి వాలకం గమనించిన ఆ వ్యక్తికి బాధ కలిగింది. అనునయిస్తున్న ధోరణిలో అన్నాడు.

"వూరుకోండి బాబు. అయ్యగారికేం ఫర్వాలేదు. మా మాధవయ్యగారు అరి పేణానికి పేణం అడ్డమేస్తారు. ఈ గోరం జరిగి మూడ్రోజు లయింది. ఇయ్యాలే పంతులుగారు కళ్ళు తెరిచారు. ఆరు మీకీ యిసయాలన్నీ చెప్పి రమ్మని

పంపారు. మాధవయ్యగారు కేసుపెట్లాల్లెండి. ఆళ్ల అంతు తేలిపోద్ది. పీడరుకాడ కూ్కాడా పోయి ఏదో కాయితా రిచ్చి రమ్మన్నారు నన్ను ..... ''

చిరంజీవి ముంజేతో్తి కళ్లను తుడుచుకుంటూ అడిగేడు. ''మావాడు నన్ను రమ్మన్నాడా ?'' అని.

''అవును బాబూ. చెప్పటం మరిచేపోయాను. ఇయ్యాలా రేపు కాకపోయినా, మీ సెలవు యీలునుబట్టి రమ్మన్నారు. నే ఎల్లొస్తా బాబూ. పొద్దు పోతోంది.'' అంటూ లేచాడతను.

అంగీకారసూచకంగా తల త్రిప్పేడు చిరంజీవి.

ఆ వ్యక్తి వెళ్లిన తర్వాత గణపతిని గురించిన ఆలోచనలతో సతమత మవసాగేడు చిరంజీవి. ఆఫీసు టైముసు చేరువ చేస్తూ ముందుకు సాగిపోతున్న కాలం అతన్ని ఆట్టే సేపు ఆపని చేయనీయలేదు.

*    *    *    *

గణపతి ఆ దెబ్బనుంచీ కోలుకొనేసరికి వారం రోజులు పట్టింది. చిరంజీవి వచ్చి చూసి వెళ్లాడు. ఉన్న విషయాలన్నీ అతనికి వివరించాడు గణపతి. పరిస్థితుల ప్రాతికూల్యానికి చింతిస్తూనే మిత్రుడికి హితబోధ చేసిపోయాడు చిరంజీవి.

''ఆశయాలంటూ నీకీ లేనిపోని గొడవ లెందుకు ? నీ పని నువ్వు చూసుకుని తిన్నగా ఉండమ'' ని నవ్వేసి ఊరుకున్నాడు గణపతి.

గణపతి యిప్పు డిప్పుడే లేచి తిరగ కలుగుతున్నాడు. తనకి సంభవించిన ప్రమాదంలో నుంచీ అతను బ్రతికి బయటపడటానికి కారణభూతులైన వ్యక్తులు ఇద్దరు. ఒకరు డాక్టరు వేణు. రెండవవారు సుజాత.

సుజాత అతన్ని కంటికి రెప్పలా కాపాడిందా రోజుల్లో. అహరహమూ నిద్రాహారాలు మాని అతని సన్నిధిలోనే కూర్చుని పరిచర్యలు చేసింది. డాక్టరు వేణు తన విజ్ఞానాన్ని, శక్తినీ వినియోగించి వైద్యం చేశాడు. తను చదువుకున్న విద్యకూ, తన తెలివితేటలకే పరీక్షగా మారిన యీ కేసును 'సక్సెస్' చేసి అతనొక గొప్ప విజయాన్ని సాధించాడు. ఎల్లప్పుడూ పెదవులపై చిరునవ్వుల వెన్నెలలు కురిపిస్తూ, రోగుల్ని మురిపించే వేణు స్వరూపం, శాంతి విశ్రాంతులు లేకుండా కన్నుల్లో వత్తులు వేసుకుని అతని క్షేమం కోరి పరిచర్యలు చేసిన, అలసట యెరుగని సుజాత స్వభావం—ఈ రెండే గణపతిని మామూలు మనిషిని చేసినై.

ఈ వారం రోజుల్లోనూ ఊళ్లో మరికొన్ని ముఖ్యమైన సంఘటనలు జరిగినై. గోపాలం కౌలుకు చేసే మాధవయ్యగారి పొలంలో కోసి ఉంచిన మినుమును సగానికి సగం దొంగిలించుకుపోయారు. డాక్టరు వేణు సొంత డిస్పెన్సరీలో ఒక భాగాన్ని తగలబెట్టేశారు. మందులన్నీ అగ్నికి ఆహుతైపోయినై. మొదటిదాని వలన ఐదారు వందల రూపాయలు గోపాలానికి నష్టమైతే, రెండవదాని వలన సుమారు వెయ్యి రూపాయల వరకూ నష్టపోయాడు వేణు. వేణు తనకు వైద్యంచేసి ప్రెసిడెంటు పార్టీ వాళ్లకు శత్రువైనాడు. ఇలాగని అనుకున్న గణపతికి అసలు సంగతి తెలిసేసరికి పట్టరాని ఆవేశం కలిగింది.

సుజాత అతనికా విషయం చెప్పగానే నమ్మలేకపోయేడు. వేణును లోపాయకారీ వ్యవహారానికి దిగమని ప్రోద్బలంచేసి, తనను అంతం చేయమని వత్తిడి చేశారట ప్రెసిడెంటూ వాళ్లు. అతని కష్టానికి ప్రతిఫలంగా వెయ్యి రూపాయలు ఎర చూపారట. మనుషుల ప్రాణాలు తీసే డాక్టరా వేణు ? కాదు కాబట్టే గణపతి పునర్జన్మ ఎత్తి ఈరోజున ఊరి బయట షికార్లుచేస్తూ తనలో తను ఆలోచించుకుంటున్నాడు.

''హుఁ .... తన ప్రాణం తీయటానికి వెయ్యి రూపాయల ఖర్చుకు వెనకాడలేదే. వాళ్లకు తనేం ద్రోహం చేశాడు. తన ప్రాణాల్ని తీస్తే వాళ్లకి ఒరిగే దేమిటి ? ఆ వెయ్యి రూపాయలూ ఏ గ్రామాభివృద్ధి కార్యానికో ఉపయోగించ గలిగితే, వాళ్లకీ వాళ్ల తర్వాతి తరం వాళ్లకీ ఎంత ఉపయోగంగా ఉండేది ? అలా కాకుండా అల్లకల్లోలంగా ఉన్న ఊరును ఓ దారికి తెద్దామనే తన మంచి ప్రయత్నానికి ప్రతిఫలంగా తన ప్రాణాన్నే బలిపెట్ట మన్నారు. ఏం మనుషులో'' అనిపించింది గణపతికి.

కంకర్రాయిని తన్నుకుంటూ నడుస్తున్న గణపతి మనస్సు వేణు, సుజాతల మంచితనాన్ని తలచుకుని ఆర్ద్రమైంది.

ప్రెసిడెంటు పార్టీవాళ్లు వేణూకు డబ్బు ఆశ చూపటం, అతను నిరాకరించిన విషయం, యివేవీఊళ్లో ఎవ్వరికీ తెలియవు. చివరికి మాధవయ్యగారికి కూడా తెలీదు. అందరూ అనుకోవటం, తనకు వైద్యం చేస్తున్నందుకే అతనికిలా జరిగిందని. కాని అసలు విషయం సుజాత కొక్కదానికే చెప్పేడట వేణు.

పరధ్యానంగా యింటికి చేరిన గణపతి మాధవయ్యగారి యింటి వసారాలోని దృశ్యాన్ని చూచి ఆశ్చర్యపోయాడు.

మాధవయ్యగారు మరో నలుగు రైదుగురు వ్యక్తులు కూర్చుని ఏదో ముచ్చటించుకుంటున్నారు.

గణపతి తల వంచుకుని తన గదిలోకి పోబోయేడు—కాని, మాధవయ్యగారు పిలిచారు ''మాష్టారూ.''

గణపతి ఆయనవైపు ప్రశ్నార్థకంగా చూసేడు.

కూర్చోండని కుర్చీ వైపు చేయి చూపుతూ చెప్పారు మాధవయ్యగారు. ''సిరిది .... రారండి. వీరు పున్నయ్యగారు. ఇతను వాళ్లబ్బాయి భుజంగం. మన సుజాతను చూడటానికని వచ్చారు.''

ఆశించని ఈ సంఘటనకు గణపతి నివ్వెరపోయేడు. మాటవరసకైనా ఏనాడూ సుజాత పెళ్లిని గురించి మాట్లాడి ఎరుగని మాధవయ్యగారు యింత త్వరగా పెళ్లి ప్రయత్నాలు చేయటానికి గల కారణాన్ని వెదకసాగింది గణపతి మనస్సు.

"ఇత నెవరండీ ?" భుజంగం ప్రశ్న కరుకుగా వినిపించింది.

గణపతి అదోలా అతనివైపు చూశాడు. భుజంగం మాధవయ్యగారి జవాబుకు నిరీక్షిస్తున్నాడు.

"మాస్కూల్లో మేష్టరుగారండి. మా యింట్లోనే ఉంటున్నారు.

మాధవయ్యగారి జవాబుకు 'ఓహో' అన్నారు. భుజంగంవాళ్ళూ.

గణపతి లేచి తన గదిలోకి వెళ్ళిపోయాడు. భుజంగం ఆకార వికారాలను గురించి మననం చేసుకో సాగిందాతని మనస్సు.

ప్రాణికోటికి జోల పాడుతున్నది నిశాకాంత.

కోరిన కోర్కెలు తీరనివాళ్లంతా కోపంతో నసుక్కుంటూ, తమ తమ కోర్కెల్ని తీర్చుకొనేందుకు వ్యూహాల్ని పన్నుతున్నారు.

గణపతి గదిలో పడుకుని తానా ఊరు వచ్చినప్పట్నుంచీ జరిగిన విషయాలను చర్విత చర్వణం చేస్తున్నాడు.

నిశ్శబ్ద నిశీథిలో కాలి యడుగుల చప్పుడు, దాని ననుసరించి గది తలుపును నెమ్మదిగా తట్టిన శబ్దం, అతని ఆలోచనలకు అంతరాయం కలిగించినై. లేచి వెళ్లి తలుపు తీశాడు.

గణపతి విస్తుపోయాడు !—

ఎదురుగా సుజాత !

అర్ధరాత్రి—ఏకాంతంగా తన గదిలోకి సుజాత రాక గణపతిని నిస్తబ్ధుణ్ణి చేసింది. శరీరం కంపించినట్లయి, అంతలోనే తెలివి తెచ్చుకుని లైట్ వేశాడు.

సుజాత రాకకు నివ్వెరపోతున్న గణపతిని ఆమె ఆకారం భయవిహ్వలుడ్ని చేసింది.

సుజాత చెక్కిళ్లపై కన్నీరు చారలు కట్టి, కళ్లు ఎర్రబడి వాచిపోయినై.

"సుజాతా !" గణపతి కంఠం వెలుగు రాచుకుంది.

". . . . . . . . ."

"లోపలికి రా సుజీ."

సుజాత తలెత్తి గణపతి వైపు చూసింది. గణపతి తాను తీసుకున్న చనువుకు సిగ్గుపడి తల దించుకున్నాడు. ఆమె ఉలుకూ, పలుకూ లేక అలాగే నిలబడిపోయింది.

గణపతికి ఏం చేయాలో పాలుపోలేదు. వెళ్లి కుర్చీలో కూర్చున్నాడు — రెండు చేతుల్తో నుదుటిని పట్టుకుని. వా రిద్దరి ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో కొద్ది క్షణాలు గడచినై. సుజాత ఏడుపు వెక్కిళ్ల స్థాయికి చేరింది. గణపతి బాధ పడ్డాడు.

"ఏం జరిగింది సుజాతా. చెప్పు."

సుజాత వెక్కిళ్లు దిగమ్రింగుకుంటూ అన్నది. "ఏం చెప్పేది, ఎలా చెప్పేది మేష్టారూ ? ...... నా పెళ్లి ..... నా కిష్టంలేదు......."

గణపతి కళ్లు పెద్దవిచేసి సుజాతను చూసేడు.

ఆమె కొంగుతో కళ్లొత్తుకుంటూ అన్నది. "నాన్నకు ఎన్నోవిధాల చెప్పాను ..... కాని, ఆయన వినటంలేదు."

"ఎందుకని యిష్టంలేదు ?" తన ప్రశ్నకు సుజాత చెప్పబోయే సమాధానం యిదై ఉంటుందనిపించింది గణపతికి. ఆమె జవాబు చెప్పేలోగా అలాంటి 'ఇది' లు పది గణపతి మనస్సులో ఒకదాని వెంట ఒకటి మెదలి కదలి పోయినై.

అతని ఊహల నన్నింటినీ పటాపంచలు చేస్తూ, ఎదురు ప్రశ్న వేసింది సుజాత—"మీకు తెలీదా మాష్టారూ?"

"ఏమిటి ?"

"అదే .... ఆయన్ని గురించిన రకరకాల వార్తలు. నేను వారిని చూడకముందే గోపాలం ఆయనగారి లీలా విలాసాల నన్నింటినీ వర్ణించాడు. పైగా ఆ రూపాన్ని చూస్తే ..... అబ్బ .... " అని రెండు చేతుల్లో మొహాన్ని దాచుకుని విలపింపసాగింది సుజాత.

గణపతి కళ్ల ఎదుట భుజంగం ఆకారం గోచరించింది.

బట్టతల వచ్చే సూచనల్ని కనుపింపజేస్తూ, తలపై రెండు వైపులా కోసుకుపోయి మధ్యలో మాత్రం కోడి యీకల్లా నాలుగైదు వెంట్రుకలు కలిగిన తల, కనుపాపలు బయటికి చొచ్చుకొచ్చి ఉబికిన కళ్లు, ఎడం చెంపమీద గాటు, చివరలు మెలిపెట్టి పైకి నిలబెట్టిన మీసాలు, వీ టన్నిటికీ తగినట్లున్న కాటుకరంగు మందపు చర్మం —

గణపతి తల ప్రక్కకు వంచి సుజాతను చూశాడు.

చిరుగాలికి ఊగిసలాడే అలినీల కుంతలాలు, కోల మొహం, గండుమీనుల్లాంటి కళ్లు, కమలాపండు తొనల్లాంటి పెదవులు, బంగరు వన్నె శరీరంతో సౌకుమార్యాన్ని పుణికి పుచ్చుకున్న కుందనపు బొమ్మ—

"కాకి ముక్కుకు దొండపండు'—అనిపించింది. పైగా భుజంగం లీలా కృష్ణుల అవతారమని చెప్పేడట గోపాలం.

గణపతి మనస్సు కలతచెందింది. ఊహా లోకాన్నుంచీ యిహలోకంలో పడి అడిగాడు.

"అయితే మీ నాన్నగారు అంతగా పట్టుపట్టటానికి కారణమేమిటి ?"

"ఏదో ఉందట నాకు మాత్రం చెప్పటంలేదు. కాని—నువ్వీ పెళ్లి చేసుకోక తప్పదని బలవంతం చేస్తున్నాడు."

గణపతి చప్పున ఏదో స్ఫురించినవాడిలా కుర్చీలోంచి లేచి సుజాత దగ్గరగా వచ్చాడు. ఆమెను పరికించి చూస్తూ, "ఒక్క విషయం అడుగుతాను, నిజం చెప్తావా ?" అన్నాడు.

సుజాత తల వంచుకునే అన్నది. "అడగండి మాష్టారూ!

గణపతి క్షణంసేపు తటపటాయించి అడిగాడు. "భుజంగమంటే నీకు సదభిప్రాయం లేకపోవటం సరేగాని నువ్వు .... నువ్వు ..... " అని అర్ధోక్తిలో ఆపాడు.

సుజాత తలెత్తి అతనివైపు ఏంవి టన్నట్లు చూసింది.

గణపతి తడబడుతూ "నువ్వు మరెవర్నయినా ప్రేమించావా, సుజాతా ?" అన్నాడు సన్నగా.

సుజాత గణపతి కళ్లల్లోకి సూటిగా చూసి, వెంటనే సిగ్గుపడుతున్నట్లు తల విలాసంగా వంచుకుంది.

గణపతిలో హృదయచలనం అధికం కాసాగింది. ఆమె నోటివెంట రాబోయే పలుకు కోసం ఆతృతగా నిరీక్షించసాగిం దాతని మనస్సు.

సుజాత మాటలు కూడబలుక్కుని "డాక్టరుగారు ..." అంది.

గణపతి నిర్ఘాంతపోయాడు. కొద్ది క్షణాలు అతని హృదయంలో భావ సంఘర్షణ రేగింది.

ఇంతలో సుజాత వేదనాపూరిత కంఠంతో అంది. "అన్నీ, తెలుసుకుని, నా క్షేమాన్ని కోరే మీరే యిక నాకు శరణ్యం మాష్టారూ. మా నాన్నతో మాట్లాడి ఆయనచేత యీ ప్రయత్నాన్ని విరమింపజేసే బాధ్యత మీదే. ఏం మాష్టారూ ?"

సుజాత ప్రశ్నకు జవాబు చెప్పలేకపోయాడు గణపతి.

మళ్లీ ఆమే అంది. "మీకే నాలాంటి చెల్లెలుంటే యిలా జరగనిస్తారా మాష్టారూ ...." ఆమె కంఠం గాద్గదికమైంది. పైట కొంగుతో కళ్లు వత్తుకోసాగింది.

గణపతి ఆశ్చర్యంతో తలెత్తి చూసేడు. కా ని .... సుజాత అప్పటికే గుమ్మందాటి వెళ్లిపోయింది.

ఈ సంఘటన కలవరపరచిం దాతన్ని. వెనుదిరిగి భారంగా మంచంమీదకు చేరాడు. గణపతి.

తన కర్తవ్య మేమిటో బోధపడలే దాతనికి. మాధవయ్యగారికి చెప్పి వప్పించినా, పల్లెపట్టుల్లో పుట్టి పెరిగి పెద్దగా విద్యాగంధంలేని సుజాతను డాక్టరు వేణు భార్యగా స్వీకరిస్తాడా ? అనే సందేహం అతన్ని పీడించసాగింది. ఆమె స్థితికి హృదయంలో కలిగిన బాధ, ఏమైనా సరే. సుజాతను ఇష్టంలేని పెండ్లికి బలి కానీయకూడదనే నిశ్చయాన్ని కలిగించిం దాతనిలో.

ఆలోచనల్తో ఎప్పుడు నిద్ర పట్టిందో తెలియని గణపతికి వరండాలో మాధవయ్యగారి అరుపులకు మెలకువ వచ్చింది. లేవటానికి ప్రయత్నించాడు కాని ఒడలంతా బద్ధకంగా ఉండి కళ్లు తెరిపిడి పడలేదు.

"సిగ్గులేని వెధవలు. వంకర కూతలు కూశారంటే చెప్పు తీసుకు ఒళ్లు చీరేస్తాను. జాగ్రత్త."

కేకలు కాస్త ఉధృతంగానే ఉండడంతో కళ్లు నులుముకుంటూ లేచాడు గణపతి. పైన కండువా వేసుకుని గది తలుపు తీసి వసారాలోకి వచ్చాడు.

మాధవయ్యగారు అటూ యిటూ పచార్లు చేస్తున్నారు. గోపాలంతో ప్రక్కగా నిలబడి ఉన్నాడు.

గణపతే పలకరించాడు. "ఎప్పుడొచ్చారండీ."

"ఇప్పుడే మాష్టారూ .... చూశారా ఏం జరిగిందో."

మాధవయ్యగారి ప్రశ్నకు ఆయనవేపు ప్రశ్నార్థకంగా చూడటంకన్న మరేమీ చేయలేకపోయాడు గణపతి.

"సుజాతకు పున్నయ్యగారి సంబంధం చేయటం నేను 'ఎస్. ఎల్. ఏ' ని కావటం కోసమని ఊళ్లో పెద్ద ప్రచారం మొదలెట్టాడు ఆ ప్రెసిడెంటుగాడు. నిన్న వాళ్లు వచ్చి వెళ్లినప్పట్నుంచీ యీ పొగ రాజుకుందిట. రాత్రి నేనూ వాళ్లతో వెళ్లానా !—యీపూట వచ్చేసరికి యిదీ వార్త." మాధవయ్యగారు కుర్చీలో కూర్చున్నారు.

గణపతికి ఆయనతో సుజాత విషయం ప్రస్తావించటానికి యిదే మంచి సమయ మనిపించింది. కాని, ప్రొద్దున్నే మొహుసున్నా కడుక్కోకుండా యీ గొడవెందుకు." అనే సందేహం లోపల పీడించింది.

ఇంతలో మాధవయ్యగారే మళ్లీ మొదలెట్టారు. "అది కాదు మేష్టరుగారూ. నా పిల్ల బాగోగులు నాకు తెలీవూ ? కేవలం నా స్వార్థం కోసం అమ్మాయిని ఉపయోగించుకునేంతటి నీచుడినా నేను ?"

గణపతి సాలోచనగా ఆయనవైపు చూసి అడిగాడు. "సుజాతకు అతనంటే సదభిప్రాయం లేనప్పుడు ఆమెను వత్తిడి డేచేయటం బాగుండదేమో ? .... "

"అదుగో అదేనండి. ఈ సంగతి ఊళ్లో వాళ్లకి ఎలా తెలుసు అంటా. ఇంతవరకు తెలీదు గదా ? అయినా వాళ్లు ఆ భుజంగాన్ని చూసి అమ్మాయికి తగినవాడు కాదనీ, ఆ కారణంచేత నా స్వలాభం కోసం యీ పెళ్లికి నేను ప్రయత్నిస్తున్నాననీ వాళ్ల ఊహ."

"ఊళ్లోవాళ్ల సంగతి మన కెందుకు గానీ, అసలు నే ననేది సుజాత విషయం .... "

మాధవయ్యగారు కొద్ది క్షణాలు ఆగి అన్నారు. "చూడండి. చిన్నతనం కనక ఏదో అలా అంటున్నది గానీ, అభం శుభం తెలియని పిల్ల దానికేం తెలుసు మాష్టారూ."

"ఒకవేళ సుజాత యీ పెళ్లిని దృఢంగానే వ్యతిరేకిస్తే .... "

"అంత మొండి పట్టుదల పెట్టటానికి కారణం ?"

గణపతి తడబడ్డాడు. సరే. జరిగిందేదో జరుగుతుంది. ఉన్న సంగతి చెప్తామనిపించింది. "సుజాత మరో వ్యక్తికి మనసిచ్చిందండి ....."

"ఆఁ .... " మాధవయ్యగారు అదిరిపడ్డారు. గణపతి వైపు అనుమానాస్పదంగా చూశారు. "ఎవ రతను ?" ఆయన కంఠస్వరం మంద్రంగా ఉంది.

"డాక్టర్ వేణు." గణపతి సమాధానం చెప్పి తలెత్తి మాధవయ్యగారి కళ్లల్లోకి చూసేడు.

# సాగరసంగీతం

ఆయన ఏదో ఆలోచిస్తూ గంభీరంగా ఉండి పోయారు. కొన్ని నిముషాల తర్వాత అన్నారు. "వీల్లేదు మాష్టారూ. అలా జరగటానికి వీల్లేదు. పున్నయ్యగారితో నాకున్న మైత్రిని, పలుకుబడిని చెడగొట్టుకోలేను. ఈ పెళ్లి జరిగితీరాల్సిందే. వచ్చిన వాదు రానే వచ్చింది—యింకేమిటి?"

గణపతి బాధపడ్డాడు. మాధవయ్యగారి పట్టుదలకు పర్యవసానాన్ని ఊహించుకుని, సుజాతను తలుచుకుని అతని హృదయం వ్యథ చెందింది. సన్నగా అన్నాడు. "ఊళ్లో వాళ్లతో పట్టుదలకు పోయి బిడ్డ బ్రతుకు బండలు చేసుకుంటారా మాధవయ్యగారూ .... ఆలోచించండి ..... సుజాతను తల్లీ తండ్రీ మీరై పెంచి పెద్ద చేశారు. ఇప్పుడా మనుకారాన్ని చంపుకుని ఆమె కిష్టంలేని పెళ్లి చేసి, ఆమె జీవితాన్ని నరకంగా మారుస్తారా ? ....."

గణపతి ఆవేశంలో యింకా ఏదో చెప్పబోతున్నాడు గానీ, మాధవయ్యగారు మధ్యలోనే "మాష్టారూ ? ...." అని గట్టిగా అరిచారు.

"మీరు నన్నిలా హింసించవద్దు. నా బిడ్డ క్షేమాన్ని నాకంటే మిన్నగా కోరేవాళ్లా మీరంతా ? సుజాత పెళ్లి భుజంగంతో జరగక తప్పదు...." అని విసురుగా పై పంచె దులుపుకుంటూ లోపలికి వెళ్లిపోయారు—మాధవయ్యగారు.

దీర్ఘంగా నిట్టూర్చి లేచాడు గణపతి.

గదిలోకి పోబోతున్న గణపతిని ఆపి చెప్పాడు గోపాలం. "ఊళ్లోవాళ్లనుకునే దాంట్లో నిజముంది బాబూ. ఈ అయ్యకి ఆ పదవిమీద యామోహం పుట్టింది. లేకుంటే ఆ భుజంగం చేష్టలు యీరికి మాత్రం తెలవ్వా. ఏందో పాపం. ఆపిల్ల ఖర్మ."

గోపాలం చేతి కర్ర చప్పుడు చేసుకుంటూ సాగి పోయాడు.

గణపతీ—అతని ఆలోచనా మిగిలారు.

*   *   *   *

రోజులు కాలగర్భంలో దాక్కుంటున్నాయి.

రోజు రోజుకూ మాధవయ్యగారింట్లో పెళ్లి సందడి హెచ్చుతున్నది.

రోజు రోజుకూ ఊళ్లో పగల పొగలు రాజు కుంటున్నాయి.

గణపతి పని నానాటికీ తీసికట్టు అన్న ధోరణిలో పడింది.

అతన్ని కొట్టినందుకు జరుగుతున్న కేసులో నాలుగు వాయిదాలు గడిచినై. సాక్ష్యాధారాలు తమవైపు బలంగా లేక పోవటంతో ప్రెసిడెంటు పార్టీవాళ్లు కాస్త త్రొక్కిసలాటలో వడ్డారు. కోర్టుకు వచ్చి పోయే సమయాల్లో గణపతి చిరం జీవిని కలుసుకుని అతనికి ఉన్న విషయాలన్నీ వివరిస్తూనే ఉన్నాడు. కేసులో రేపు చివరి వాయిదా. విచారణ ముగు స్తుంది.

నేరం తమదని తేలిపోతున్నదనే ఉక్రోషంలో ప్రెసి డెంటూ వాళ్ళూ తామంటే పళ్లు నూరటం హెచ్చింది.

"మాకేదన్నా జరిగితే ప్రాణాలతో ఎవడూ ఉండడు." అని తనకు వినపడేటట్లు మొన్న మునసబు కాబోలు పెద్దగా అంటున్నాడు.

ఇది ఇలా ఉండగా—

సుజాతంటే తనకు గల ప్రేమాభిమానాల వలన ఆమెను భుజంగం బారినుంచీ తప్పించాలని తన శాయ శక్తులా ప్రయత్నించాడు గణపతి. ఆ ప్రయత్నంలో మాధ వయ్యగారికి తనంటే ఉన్న గౌరవ మర్యాదల్ని కోల్పోయా డతను. కనుకనే ఆయన చేత అంతమాట అనిపించు కున్నాడు.

"ఏకు మేకయిందన్న సామెతగా నన్నే విమర్శిస్తున్నావ్ పంతులూ. ఎంత అలుసిచ్చినా, నెత్తి కెక్కుతే సహించలేను నేను. ఇది మా సొంత విషయం. ఇందులో నువ్వు తల దూర్చటం మంచిదికాద"న్న మాధవయ్యగారి మాట తల కొట్టేసినట్లయింది గణపతికి.

"అవును. వాళ్ల స్వవిషయాల్లో అంత లోతుకు పోవటం తప్పే" అనుకున్నాడు.

వేణూ కూడా యిదే విషయాన్ని యింకొంచెం సుతి మెత్తగా చెప్పాడు. "నేను సుజాతను ప్రేమించిన మాట నిజమే మాష్టారూ. కానీ, అందని మ్రానిపండుకు అర్రులు సాచటం అవివేకమన్నారు గదా. అందుకని మాధవయ్య గారు స్వయంగా వచ్చి ఆ విషయాన్ని అడిగితే ఉన్నమాట చెప్పాను. 'మీ అమ్మాయిని చేసుకోలేనంత మాత్రాన నేనేమీ భగ్నప్రేమికుణ్ని కాబోననీ, అలాంటి బాధలు, త్యాగాలూ నాకు తెలియవనీ చెప్పాను. నిజం మేష్టారూ. ఈ రోజుల్లో అతి మంచి మెడకు వుచ్చు తగిలిస్తుంది."

కాని, చూస్తూ చూస్తూ ఒక నిండు ప్రాణానికి అన్యాయం జరుగుతూఉంటే చేతులు ముడుచుకు కూర్చో వటం అనార్య లక్షణమని గణపతి అభిప్రాయం.

అయితే ఏం. అతని అభిప్రాయాలు హేళనపాలై, అతని ఆదర్శాలు బెడిసికొట్టి, అతని ఆశయాలు గగన కుసు మాలుగా మారుతుంటే అతనేమీ చేయలేని అసహాయు డైనాడు.

ఈ నిస్సహాయ స్థితి అనేది రానే రాకూడదు. కానీ, వచ్చిందంటే మనిషిని శల్యపరీక్ష చేసి క్రుంగదీస్తుంది. ఈ స్థితిలోనే సంఘానికి లోకువైపోతాడా వ్యక్తి. గణపతి స్థితీ అలాగే ఉంది.

గదిలో కూర్చున్న గణపతికి క్రితంరోజు అదే సమ యంలో జరిగిన సంఘటన కళ్లముందు మెదిలింది.

షికారుకని తను ఊరి వెలుపల కాలవగట్టుకు పోయి తిరిగి వస్తున్నాడు.

ముసిరిన మసక చీకట్లలో దారి సరిగా కనబడటం లేదు. తాటితోపు దగ్గరికి కొచ్చేసరికి, మట్టి రోడ్డుమీద ఏర్పడిన బండి గాడిలో కాలు పడి మడమ గీచుకుపోయింది. కాలు మెలి తిరిగినట్లయి అడుగులు తడబడి తూలిపడ్డాడు తను. ఆ పడటంలో దారి పక్కన నిలబడ్డ ఒక యువతికి కొట్టుకున్నాడని తెలియటానికి ఎంతోసేపు పట్టలేదు తనకు.

ఈ హఠాత్సంఘటనకు తత్తరపడి అంతలోనే తమా యించుకుని పరీక్షగా ఆవైపు చూసేడు తాను. కాని అప్ప టికే ఆ యువతి 'అమ్మో' అని అరుచుకుంటూ కంగారుగా ఊరివైపు పరుగెత్తుతోంది.

తన పొరపాటుకు ఎంతగానో చింతించాడు తాను. ఆమె ఎవరై ఉంటుందని ఊహించుకుంటూ యింటికి చేరు కున్నాడు.

మాధవయ్యగారి యింటి గేటు ముందు దృశ్యాల్ని చూసి ఆశ్చర్యపోయాడు తను.

శివకామయ్యగారు, ప్రెసిడెంటుగారు, మరికొందరు మోతుబరులు, ఇంకా కొందరు వాళ్ల అనుయాయులు గుంపుగా నిలబడి ఏదో అరుస్తున్నారు. తాను రావటంచూసి "అడుగో వస్తున్నాడు ..... వస్తున్నాడు ..... " అంటూ అర వటం ప్రారంభించారు.

తాను వాళ్ల దగ్గరికి రావటం, ప్రెసిడెంటు దారి కడ్డంగా నిలబడి తనను నిలవేయటం జరిగింది.

శివకామయ్యగారు కోపంతో నిప్పులు కక్కుతూ, "ఎవరనుకున్నావో ఏమో .... నిప్పులాంటి మనుషులం మేము. నీలాగా అల్లరి చిల్లరి జాతి అనుకున్నావేమో జాగ్రత్త. ఊరి బయట ఒంటరిగా పిల్ల కనపడితే రభస చేస్తావా ?" అని ఏవేవేమిటో అంటున్నారు.

"ఒళ్లు తిమ్మిరెక్కిందేమో కుర్రాడికి వదిలించండిరా... ఒకసారి శాస్తి జరిగినా బుద్ధి రాలేదల్లే ఉంది. చావ బాదండి. ఎవ డడ్డమొస్తాడో నే చూస్తా .... " అన్నాడు ప్రెసిడెంటు గారు తన బుంగమీసాల్ని దువ్వుకుంటూ, మునసబువైపు చూస్తూ.

జరిగిన సంగతిని తా నెంతగా చెప్పినా వినిపించుకోక వెనకనున్న నలుగు రైదుగురు వ్యక్తులు కర్రలు ఎత్తటం కూడా జరిగింది. కాని శివకామయ్యగారే వాళ్లని వారిస్తూ అన్నారు.

"నాలో యింకా పాపభీతి ఉండబట్టి బ్రతికిపోతున్నావ్. జాగ్రత్త. మళ్లీ నా పిల్లవంక కన్నెత్తి చూచావో ప్రాణాలు దక్కవు .... " అని పళ్లు నూరుతూ వెనక్కి తిరిగాడు. ఆయన్ని అనుసరించి వెళ్లిపోయారు మిగతావాళ్లు.

సిగ్గు, కోపం, బాధలతో కుంచించుకుపోయి గదిలోకి వెళ్లబోతున్న తనకు మాధవయ్యగారిమాట వినపడకపోలేదు. "కానిపనులకు పోతే అయినవాళ్లయినా యీసడించుకోక మానరు."—

మాధవయ్యగారి మాట గుర్తుకొచ్చి దుఃఖం ముంచు కొచ్చింది గణపతికి.

జరిగిన సంఘటనను పునశ్చరణ చేసుకుంటున్న గణ పతి ఏకాంతాన్ని భంగం చేసినై, వరండాలో చేరిన అమ్మ లక్కల పెళ్లి ఉపన్యాసాలు. కుర్చీలోనుంచీ లేచి గదిలో పచార్లుచేయ నారంభించాడు.

ఇంతలో ఎవరో కుర్రాడొకతను ఏదో కాగితం తెచ్చి "మాష్టారూ .... మీకో ఉత్తరమండీ ...." అంటూ అతని చేతికిచ్చి మెరపులా మాయమయ్యాడు.

గణపతి కాగితం మడత విప్పి చదువుకున్నాడు.

చదివి చలించిపోయాడు.....

"పంతులూ ! ....

ప్రాణాలమీద ఆశ ఉంటే యీ రాత్రికి రాత్రే వూరొదులు. ఈమాట కాదన్నావో సూర్యోదయాన్ని చూడలేవు. .... రేపు విచారణకు చివరిరోజు .... నీ యిష్టం .... ఇట్లు .... నీ శ్రేయోభిలాషి....."

గణపతికి పరిస్థితి విషమించిందని తెలిసింది. రేపు కొట్లాట కేసులో విచారణకు చివరి రోజు. కేసులో నేరస్థు లనబడే పెద్ద తలలకు ఏదో శిక్ష పడటం ఖాయమనేది. అందరికీ తెలిసిన విషయం. తత్కారణాన తనను బెదిరిస్తున్నా రన్నమాట. అంటే వాళ్ల ఉద్దేశ్యం తానీవూరు వదిలిపెట్టి పోయి, కేసును ఉపసంహరించుకోవాలని.

గణపతి మనస్సు పరిపరి విధాలుగా పోతున్నది. కర్త వ్యాన్ని బోధ చేస్తారేమోనని మాధవయ్యగారిని పిలిచి ఉత్తరం చూపించాడు.

ఆయన దాన్ని చదివి, అంటే పట్టనట్టు "ఏదో చెయ్యండి మేష్టారూ .... అసలే పనుల బరువుతో నా తల తిరుగుతున్నది. ఇలాంటివన్నీ ఎక్కడ నెత్తిమీద పెట్టుకోను... ఇప్పటికే సగం రొంపిలో దిగబడ్డాను...." అని విసుగ్గా అని, విసురుగా, హడావుడిగా వెళ్లిపోయాడు.

"ఎంత చెడ్డా వాళ్లూ వాళ్లూ ఒకటి." గణపతి మనస్సు గొణిగింది.

గదిలో వచ్చి కూర్చున్నాడు. మాధవయ్యగారి ప్రవ ర్తన వింతగా మారిందనిపించింది. ఒకవిధంగా తనను ఊళ్లో కొందరి దృష్టిలో చెడ్డవాణ్ణిగా మార్చి, శత్రువును చేసింది ఆయన. 'నా మూలంగా మీకు జరిగే అన్యాయం నాకు జరుగు తున్నట్లే' అన్న మాధవయ్యగారే యీనాడిలా మాట్లాడ టంతో గణపతికి కోపం కలిగింది.

పరిస్థితులు విషనాగులై కోరలుసాచి బుస కొడు తున్న సమయంలో మనిషికి తోడు ముఖ్యం. అది కరువై నప్పుడు ఎంతటి ధైర్యస్థుడైనా బెంబేలు పడక మానడు. గణ పతి స్థితి అలాగే అయింది.

అతని హృదయంలో తీవ్రమైన భావ సంఘర్షణ బయలుదేరింది. ఉనికి—పరిసరాలు—పరిస్థితుల పూర్వాపరా లాలో

ంచుకున్నాడు. కొద్దిసేపటికి ఏదో నిశ్చయానికి వచ్చిన వాడిలా కుర్చీలోనుంచీ లేచాడు.

*  *  *  *

గణపతి రాక చిరంజీవికి మహదాశ్చర్యాన్నే కలిగించింది.

"అయితే ఓడిపోయి పారిపోయి వచ్చావన్నమాట. మొత్తానికి ఖడ్గతిక్కన సంతతివాడినని ఋజువు చేసుకున్నావ్" అన్నాడు.

పొడిగా నవ్వేసి అన్నాడు గణపతి. "తా నొకటి తలిస్తే భగవంతు డొకటి చేస్తుంటే మానవుడు ఓడిపోతాడు చచ్చి పోతాడు."

చిరంజీవిక్కూడా నవ్వొచ్చింది. "అందుకనే అంత పెద్ద పెద్ద తలపులు యీ చిన్న తలలకు ఒద్దురా అన్నాను నేను. వింటేగా. అదేమంటే ఏ ప్రయత్నమూ, ఏ ఆశయమూ, లేక జీవచ్ఛవంలా బ్రతకమంటావా ? అని ప్రశ్న వేస్తావు. ప్రవాహ వేగానికి ఎదురీద గలమా ?"

గణపతి చిరంజీవి మాటల్ని విని అతనివైపు పరీక్షగా చూశాడు. ఒక్క క్షణం ఆగి అన్నాడు. "మన యిద్దరి భావాలూ ఎదురెదురు దిశల్లో పయనిస్తూ ఉన్నాయిరా. అవి ఎప్పుడో కలుసుకుంటాయనే తప్ప స్థిరంగా కలిసి ఉండలేవు. ఏం చేస్తాం. ఎవరి బాధ వాళ్లనుభవిద్దాం."

చిరంజీవి ఫెళ్లున నవ్వాడు. గణపతి కాస్త కంగారు పడ్డాడు.

నవ్వును ఆపుకుంటూ అన్నాడు చిరంజీవి. "బలే వేదాంతం చెప్పావురా గణపతీ" అని అంతలోనే విషయం మారుస్తూ "ఇహ నీ ప్రస్తుత కర్తవ్యం ఏమిటి ?" అని ప్రశ్నించాడు.

గణపతి మాట్లాడలేదు.

"చెప్తేనిగా. ఆ ఆటోమొబైల్ కంపెనీలో నాకు తెలిసిన ఫ్రెండ్ తండ్రి ఉన్నాడు. ఆయన దగ్గఱికి పోయి మాట్లాడదాం. బడిపంతులు ఉద్యోగం దొరకాలంటే యిప్పుడేం లాభం లేదు గదా ? ఏమంటావ్."

"నీ యిష్టం" అన్నాడు గణపతి.

ఇద్దరూ కలిసి ఆ కంపెనీకి పోయి మాట్లాడేరు.

గణపతికి ఉద్యోగం కుదిరింది.

*  *  *  *

మణి మస్తుగా ముస్తాబైంది.

లైట్ గ్రీన్ షిఫాన్ చీరమీద అదేరంగు స్లీవ్‌లెస్ పెర్లిన్ చోళీ వేసుకుంది. చీరలోనుండీ శాటిన్ పావడా, చోళీలో నుండీ బాడీ తొంగిచూస్తుంటే, ఆమె అవయవాల బింకం పొంగులెత్తి అందపు అంచుల్ని తాకుతున్నది. మెడ మీద జెర్రిపోతులా వ్రేలాడుతున్న జడలో మల్లెదండ ముడిచి నిలువుటద్దంలో తన్ను తాను చూసుకుంది. విలాసంగా తల వంచి ఒకటికి పదిసార్లు ఆపాదమస్తకం పరీక్షగా చూసుకున్న మణి మొహంమీద గర్వరేఖలు పరచుకున్నై. తన అందానికి తనే మురిసిపోయి, కులుక్కుంటూ వాకిట్లో కొచ్చింది.

అప్పుడే ఫస్టు షో వదలటంతో రోడ్డు జనంతో రద్దీగా ఉంది.

ప్రక్కనున్న 'టీ' కొట్టు రత్తయ్య గ్లాసుతో చెంచా వేసి 'గరం గరం చా' అంటూ గణగణలాడిస్తున్నాడు.

మణి ఓమారు నాలుగు వైపులా పరికించి చూసింది. ఆమె దృష్టి రోడ్డుకు ఆవలివైపున ఫుట్‌పాత్ మీద నిలబడి తదేకంగా తనవైపే చూస్తున్న ఓ యువకునిమీద నిలిచింది.

ఇంతలో ఆమె ముందుగా ఒక రిక్షా వచ్చి ఆగింది.

"ఓహో" అనే స్వరంలో యీలవేసి రిక్షానాడు "వస్తావా" అని అడిగేడు.

మణి చిరాగ్గా సమాధానం చెప్పింది, "నీ బేరమూ, నువ్వూ .... సరి .... సరి .... పో."

"ఆఁ .... ఆఁ ...." అని ఏదో సణుక్కుంటూ సాగి పోయాడు రిక్షావాడు.

మణి చూపులు ఆతృతగా రోడ్డు అవతలి వైపుకు మరలినై .... కాని .... ఇందాకటి యువకుడు అక్కడ లేడు.... అతనికోసం పరిసరాల్ని పరికించింది మణి. అతను ఆమె ఇంటికి నాలుగు గజాల దూరంలో నిలబడి, కుడిచేతి నాలుగు వేళ్ళూ ముడిచి, చూపుడు వ్రేలుతో కణతలు కొట్టుకుంటూ ఏదో ఆలోచిస్తున్నాడు.

మణి కన్నార్పకుండా అతన్ని చూస్తూ ఉంది. అతను ఆమెవైపు చూస్తున్నాడు.

మణి తల ప్రక్కకు వంచి కన్ను గీటింది. జారిన పైటను రెండు చేతుల్తో క్రిందకు తీసుకుని సరిచేసి విసురుగా వెనక్కు వేసుకుంది.

కొద్ది క్షణాలు అటూ యిటూ అనుమానాస్పదంగా చూసి ఆమె దగ్గఱికొచ్చా డతను.

మణి లోపలికి దారితీసింది. అతని కాళ్లు అసంకల్పంగా ఆమె ననుసరించినై.

మణి అతన్ని "కూర్చోండి" అని కుర్చీ చూపుతూ తలుపు వేసి వచ్చింది. అతను కూర్చున్నాడు.

అతనా యింటిని నలుమూలలా చూడసాగేడు. ఒక పెద్ద పందిరి మంచం, దాని ప్రక్కనే తను కూర్చున్న పడక్కుర్చీ, మంచానికి వెనుకగా ఓ పెద్ద నిలువుటద్దం, దాని ప్రక్కనున్న గూట్లో కొన్ని అలంకరణ సామగ్రి, ఇంటి కప్పు నుంచీ వ్రేలాడదీయబడిన దండెంమీద కొన్ని చీరలు, లంగాలు, జాకెట్లు—ఇవి తప్ప ఆ గదిలో చెప్పుకోతగ్గ సామాన్లేమీ లేవు. గదికి ఓ మూల డోర్ కర్టెన్ వ్రేలాడుతున్నది. దాని వెనుక వంటగది కాబోలు అనుకున్నాడు.

మణి గదిలోకొస్తూ "ఎలా ఉంది మా యిల్లు" అంది, చేతిలోని యిస్త్రీ లుంగీని అతని కందిస్తూ.

''బాగానే ఉంది'' అని ''అక్కర్లేదు'' అన్నా డతను.

మణి ఆశ్చర్యపోయింది.

ఆమెను పరీక్షగా చూశా డతను. ఇప్పు డామె పూర్తి వైట్ డ్రెస్‌లో ఉంది. ఆమె అతనికి దగ్గరగా వచ్చి పడ క్కుర్చీపైన చేతు లానించి, అతని మీదికి వంగింది.

ఆమె సౌందర్యాన్ని కండ్లతోనే తనివితీర గ్రోలి అన్నా డతను, ''ఇంతటి జగదేక సౌందర్యాన్ని బజారుపాలు చేసి, అందా నికి తగ్గ విలువ తెలుసున్నావా?''

మణి దెబ్బతిన్న లేడిలా ఐంది. లేచి వెనక్కు నిల బడింది. ఆమె కళ్ల నీళ్లు తిరిగినై.

అతను లేచి ఆమె దగ్గఱగా వచ్చాడు. ఆమె భుజం మీద చెయి వేసి ''నీ పేరు?'' అన్నాడు.

''మణి.''

''చూశావా మరి. మణి యిలాంటి మురికికూపంలో ఉంటే ప్రకాశించదు. ఇరవైయేళ్లన్నా నిండని నువ్వీ పాడు వృత్తిలో కెలా దిగా వసలు?'' అనునయంగా అడిగేడు.

ఆమె జవాబు చెప్పలేదు. ఆ విషయాలన్నీ నీ కెందు కన్నట్లుగా చూసింది.

అతను మళ్లీ అడిగాడు.

'ప్రపంచంలో దుర్వ్యసనాలకు లోనయే ప్రతి వ్యక్తి వెనుక ఏదో జాలి గాథ దాగిఉంటుందనీ, ఏదో బలవత్తర మైన కారణాలవల్ల పరిస్థితుల ప్రోద్బలంవల్ల వ్యసనాలకు లోనవటం జరుగుతుంద' నే సిద్ధాంతవాది అతను.

ఆమె చెప్పింది. ''మా అమ్మ ఒక బిచ్చగత్తెట. చచ్చి పోతూ నన్ను ఓ ముసలావిడ కిచ్చి పోయిందిట. ఆవిడే నాకు చదువు, నాట్యం నేర్పించి ఆ విద్యలతోపాటు యీ విద్యా నేర్పింది. ఆవిడా నిరుడే పోయింది. పొట్టకూటికి మరో మార్గం లేక నేర్చిన విద్యను ఉపయోగించుకుంటున్నా.''

''ఎంతవరకూ చదివేవు?''

''థర్డు ఫారం.''

అతను కొద్ది క్షణా లాగి మంచంమీద కూర్చుంటూ అన్నాడు. ''మణీ, నీవంటి సౌందర్యరాశి అంతో యింతో చదువు ఉన్న స్త్రీ యిలాంటి పనికి పూనుకున్నదంటే నా కెంతో బాధగా ఉంది. జీవితంలో ఏ మాధుర్యమూ చవిచూడని నువ్వు యీ విషవలయంలో పరిభ్రమిస్తూ పచ్చని జీవితాన్ని బీడుగా మార్చుకోవటం—హుఁ .... ఈ విషయాలన్నీ ఎందుకు. నే వచ్చిన పని చెప్తాను. నాకు వెనకా ముందూ ఎవరూ లేరు. ఈ ఊళ్లో ఓ ప్రయివేట్ కంపెనీలో ఉద్యోగం చేస్తు న్నాను. నెలకో వంద రూపాయ లొస్తాయ్. పెళ్లి చేసుకోవా లనే కోర్కెతోపాటు నీవంటి యువతిని చేసుకోవాలనే ఆశయం కలిగింది నాకు. నెలరోజుల్నించీ ప్రయత్నంలో ఉన్నాను. యివ్వాళ నువ్వు తటస్థపడ్డావు. నా ఎన్నిక సరయినదేనని తోస్తున్నది .... నీ కభ్యంతరంలేకుంటే .... ''ఆపి'' ఆమెను సూటిగా చూస్తూ అన్నాడు. ''నిన్ను నా దానిగా చేసు కుంటాను.''

మణి పొడిగా నవ్వింది. ఆ నవ్వులో ఏ భావమూ లేదు. జీవంలేదు. కొది క్షణాలు ఆలోచించి ''సరే .... నేనూ ఆలో చించుకుని ఓ నిర్ణయానికి వస్తాను. నాకు కొంత వ్యవధి యివ్వండి'' అంది.

అతను సంతృప్తిగా ఊపిరి పీల్చుకుని ''అలాగే .... నీ యిష్టం వచ్చినంత టైమ్ తీసుకో.'' అంటూ లేచాడు.

మణి ''అహఁ .... '' అంటూ దగ్గఱికొచ్చి ''మరి...'' అని అర్థోక్తిలో ఆపింది .....

''ఒక నిశ్చయానికి వచ్చిన తర్వాత ....'' నవ్వుతూ బయటికి వచ్చా డతను. గడప వరకూ సాగనంపింది మణి.

ఇంతలో ఏదో మర్చిపోయిన దానిలా అతన్ని పిలిచింది. ''ఏమండీ.''

అతను వెనుతిరిగి చూసేడు.

''మీ పేరు ?'' ఆమె ప్రశ్నించింది.

''గణపతి .... '' అంటూ సాగిపోయా డతను !—

*    *    *    *

గణపతి యింటికి చేరుకొనేసరికి పన్నెండు కావచ్చింది.

రూమ్‌లో లైట్ వెలుగుతూ ఉండటం గమనించి ఆశ్చర్య పోయాడు గణపతి. చిరంజీవికి తొమ్మిదిన్నరకల్లా పంక్చు వల్‌గా నిద్రపోవటం అలవాటు. గదిలోకొచ్చి మడతమంచం వాల్చుకుని పడుకున్నాడు గణపతి.

అతని చర్యల నన్నింటినీ పరీక్షిస్తూ అప్పటివరకూ మూభావంగా కూర్చున్న చిరంజీవి, గణపతి పడుకోగానే మొద లెట్టాడు. ''నీ ప్రవర్తన నాకేం నచ్చటంలేదురా గణపతీ ...''

గణపతి విస్తుపోయాడు.

''అవును. నెలరోజుల్నుంచీ చూస్తూనే ఉన్నాను. అర్ధ రాత్రీ, అపరాత్రీ వచ్చి పడుకోవటం, మాటా మంతీ లేకుండా తిరగటం, అన్నీ గమనిస్తూనే ఉన్నాను. ఇవ్వాళ నువ్వు చేసినపని .... ఛా .... నీలాంటివాడలా తిరుగుతున్నా డన్నా నమ్మ శక్యంగాదు. అలాంటిది నా కళ్లతో చూసే దౌర్భాగ్యం పట్టింది నాకు .... ఛీ .... యింత బ్రతుకూ బ్రతికి .... ''

''చిరంజీవీ'' గణపతి ఆవేశంగా అరిచాడు. ''నేనేం అంత చెడ్డపని చెయ్యలేదు .... అనవసరంగా మాట జార వద్దు.''

చిరంజీవి నిశ్చేష్టుడై పోయాడు.

గణపతే అన్నాడు మళ్లీ, ''పైగా నీకు నా ఉద్దేశాన్ని ఏనాడో చెప్పాను. ఇందులో తప్పేమీ లేదు. నేనేమీ పరువు తక్కువ పనులు చెయ్యటంలేదు. ''

చిరంజీవి కోపంగా అన్నాడు. ''ఆదర్శం పేరుతో నీ చిత్తమొచ్చిన పనులు చేస్తానంటే నేను సహించలేన్

గణపతి. నాకెంత జీవిత లక్ష్యాలు తెలియకపోయినా నువ్వు యివాళ చేసిన పనిని గాని, రేపు చేయబోయే పనిని గాని హర్షించలేను.''

''ఇతరులు హర్షించరనీ, ఏదో అయిపోతారనీ నేను నా ప్రయత్నాన్ని వదులుకోలేను .... ''

''నేను అలాంటి మనుష్యుల్నే వదులుకోగలను ....''

''చిరంజీవీ .... '' గణపతి నివ్వెరపోయి అన్నాడు.

''తల వంచుకుని చెప్పాడు చిరంజీవి. ''నువ్వు నీ ప్రయత్నాన్ని విరమించుకోలేకపోతే మనకు పొత్తు కుదరదు. పండు వంటి మన మైత్రిని కుళ్లబెట్టి నడిబజార్లో విసిరేసే వరకూ నేనూ చేతులు ముడుచుకు కూర్చోలేను.....''

''అయితే సరే .... యింత దూరం వచ్చిన తర్వాత యింకెందుకు .... రేపు మాపుల్లో జరిగేసని యీరోజే జరిగి పోవటం మంచిది. నే నిప్పుడే వెళ్లిపోతాను ....'' గణపతి విసురుగా మంచం దిగాడు.

చిరంజీవి ఆశ్చర్యంగా అన్నాడు, ''ఇప్పుడా .... ?''

''అవును యిప్పుడే .... ''

''ఎక్కడికి .... ''

''ఎక్కడి కేవిటి. లోకంలో నీ అంత ఉదారులు ఇంకెంతోమంది ఉన్నారు .... ''

చిరంజీవి బాధపడ్డాడు. గణపతి వెళ్లిపోవటానికి సిద్ధపడుతూంటే అతని మనస్సు తహతహలాడ సాగింది. ''గణపతీ ....'' అన్నాడు బొంగురుపోయిన కంఠంతో. అతని కళ్లు అశ్రుపూరితా లైనాయి.

''గణపతీ .... నామాట విని నీ ప్రయత్నము మానుకో. కావాలంటే మంచి సంబంధం చూసి నీకు పెళ్లిచేసే బాధ్యత నాది.''

''వీల్లేదు చిరంజీవీ .... ఇతరులకోసం నేను నా ఆశయాన్ని వదులుకోలేను .... ''

''అయితే నన్నే వదులుకుంటావా ?'' చిరంజీవికి దుఃఖం కట్టలు తెంచుకుంది.

''ఆఁ .... '' మొండిగా అనేశాడు గణపతి.

గణపతి మొండి పట్టుకు వగవటం కన్నా మరేమీ చేయలేకపోయాడు చిరంజీవి.

మరో గంటకు—చీకటీ—చిరంజీవి మిగిలేరా గదిలో !

*    *    *    *

అగ్నిసాక్షిగా జరుగవలసిన గణపతి పెళ్లి రిజిస్ట్రారు సాక్షిగా జరిగిపోయింది.

ఆ ఆఫీసులో పనిచేసే గుమాస్తాలే పెళ్లి పెద్దలై దంపతుల్ని దీవించారు.

పవిత్ర మాంగల్యబంధం మరోరూపు దాల్చి పూలదండగా మారింది.

మంత్రాలు దస్తావేజుగా రూపొందినాయి.

గణపతి ఒక యింటివాడైనాడు.

చిరంజీవిని ధిక్కరించి మాటమీద మాట అని వచ్చేసినందుకు గణపతికీ బాధగానే ఉంది. కాని ఈబాధను మించిన తీయని బాధల్లో దాన్ని మర్చిపోగలిగాడు.

మణి అతనికి మధుర రసాలను చవి చూపుతూ, అతన్ని నందనవనాల్లో విహరింపచేయసాగింది. అతని భావనా స్వర్గానికి రూపొన్నిచ్చి, అతని ఆశయసాధనకు పట్టుకొమ్మయి—మణి గణపతికి ఆరాధ్యదైవంగా మారింది. ఆమె సన్నిధిలో అతనొక పసివాడై క్రీడించసాగేడు. ఆ ఆటపాటల్లో రోజులు క్షణాలుగా దొర్లిపోతున్నై.

ఆవేళ .....

సరసాల మురిపాల తూగు టుయ్యాలలో తేలిపోతున్న గణపతి ఆనందమయ కేళికి అంతరాయాన్ని కలిగిస్తూ కవ రొకటి యిచ్చిపోయాడు పోస్టుమన్.

చదవమని కవర్ని మణికిచ్చాడు గణపతి. ఆమె ఉత్తరం తీసి చదవసాగింది.

''ప్రియమైన మేష్టరుగారికి—

''ఓ .... మా సుజాతా .... ఏదీ .... యిలా తే.... '' అంటూ హుషారుగా లేచి మణి చేతిలో ఉత్తరం లాక్కుని గబగబ చదవసాగేడు.

తాను చదవబోయే ఉత్తరాన్ని గణపతి లాక్కుని చదవ సాగటంతో మణికి కోప మొచ్చింది.

జాబు చదువుతున్నకొద్దీ అతని కవళికలు మారి, మొహం విషణ్ణమైంది. నిరుత్సాహంతో మంచంమీద కూలబడి పోయేడు.

అతని మనస్సు కలతచెందింది. సుజాతను గురించిన ఆలోచనలు ముసురుకోసాగినై. ఆమె వ్రాసిన విషయాల వెనుక దాగిన ఘోరాలు అతని కళ్లముందు నర్తించసాగినై.

కొండంతను గోరంతలుగా చెప్పినా, దాని యదార్థ పరిణామాన్ని ఊహించుకోగలిగినవాళ్లు కొంద రుంటారు. గణపతి తత్వం అంతే. ఎదుటివారికి ఏమాత్రం కష్టం కలిగినా దాని లోతును గమనించటం అలవడిం దతనికి. ఇప్పుడు సుజాత కూడా చెప్పీ చెప్పనట్లు కొన్ని బాధల్ని వెలువరించింది. ఆమె వ్రాత వెనుక దాగిన ప్రత్యక్ష కథనాలు ఆమెకే తెలుసు. కాని, 'అవి యిలా ఉండి ఉంటాయి' అని చెప్తున్నది తన మనస్సు.

ఉత్తరాన్ని మళ్లీ చదువుకున్నాడు గణపతి.

''ప్రియమైన మేష్టరుగారికి—

''నమస్కారములు. నాన్నకు గారాబు పట్టిగా పుట్టి పెరిగిన నేను, మరొకరి దాసిగా యిక్కడకు వచ్చిన చాల రోజులకు మీకు ఉత్తరం వ్రాస్తున్నాను. ఈ ఆలస్యానికి కారణం మీ అడ్రస్ దొరక్కపోవటమే .... మొన్న గోపాలం యిక్కడికి వచ్చినప్పుడు చెప్పాడు మీరా ఊళ్లో ఉద్యోగం చేస్తున్నారని.

"ఆ రోజున మీరు మూగకళ్లతో నాకు వీడ్కోలు చెప్తున్నప్పుడు, పెళ్లికూతురుగా మారిన నేను కళ్ళు వప్పజెప్పి చూడటంకన్నా మరేమీ చేయలేకపోయాను. ఉదర పోషణకోసం మా ఊరికి వచ్చి, నలుగురికి ఉపకారం చేయాలనే సదాశయానికి ప్రతిఫలంగా అవకారాన్ని పొందిన మిమ్మల్ని తలచుకుని నే నెంతగానో బాధపడ్డాను. పోనీలెండి. ఏదెలా ఉన్నా మీరా విషవలయంలోనుంచీ త్వరలో బయట పడినందుకు 'కీడులో మేలని'పించింది నాకు మాత్రం. సరే .... గతించినదాన్ని పునరావృత్తిచేసి మీ మనసుకు కష్టం కలిగించట మెందుకు ?—

ఇక నా సంగతి. మీకు తెలుసుగా మాష్టారూ .... నాదంతా లక్కీ స్వభావమని. వేడిచేస్తే ఉక్కిరిబిక్కిరై చెప్పినట్లు వంగుతుంది. మా మామగారు ఈ ఊళ్లోకల్లా పెద్ద రైతు. రోజూ పది పదిహేనుమంది దాకా రాజకీయ వేత్తలు వీరికోసం వస్తూ పోతూ ఉంటారు. మా నాన్న కూడా వాళ్లల్లో ఒకడైనాడు. వచ్చే యేడు 'ఎమ్. ఎల్ ఏ' పదవి ఆయనదే నని నిర్ణయమైందట. ఆ సంగతి నాకు చెప్పి, "ఇదంతా నీ అదృష్టం. తల్లీ" అంటూ మురిసిపోయాడు.

మా అత్తగారు చాల మంచిది. కొడుకంటే ఆవిడకు పంచ ప్రాణాలు. వారికి కావలసిన సకలావసరాలనీ ఆమె స్వయంగా తీరుస్తుంది. తల్లిని పిల్లిలా ఆడించి కావలసింది ఒడుక్కుపోగల నేర్పు మావారికీ ఉందిలెండి. వారు ఉద్యోగం ఏమీ చేయటంలేదు కానీ ఉద్యోగస్థుల కుండే కనీసపు తీరిక కూడా వారి కుండదు. దానికి ముఖ్య కారణం వారి వ్యాపకాలే. ఇంట్లో భార్యకన్నా కర్తవ్య నిర్వహణ ముఖ్యం గదా మాష్టరూ ? .... అందుకే వారు నాకన్నా, నా సౌఖ్యంకన్నా కూడా తమ 'విధి' కి ప్రత్యేక ప్రాముఖ్యాన్నిస్తారు. దాని తర్వాతే మిగిలిన విషయాలు. ఆ విధి నిర్వహణతో ఎంత 'సొమ్ము' పోయినా బాధపడరు.

"అదీ నా పరిస్థితి. ఇలాంటి సుఖాన్నీ, ఆనందాన్నీ అనుభవించి అనుభవించి విసుగు పుడుతున్నది .... మాష్టరూ ?....

"అందుకే మా అత్తగారు అంటూ ఉంటారు. "నీకు వేదాంతం తలకెక్కు తున్నదే కోడలా" అని.

"అవును మరి. అన్ని ఆనందాలకూ చరమావస్థ అదే గదా .... నిజమేనా మేష్టరూ .... ఏమిటోలెండి. ఫోర్త్‌ఫారం తెలివంతా ఉపయోగిస్తున్నదే సుజాత అనుకుంటున్నారా ? అనుకోండి .... నాకేం ఫర్వాలేదు ....

"గోపాలం మొన్నీమధ్య యిక్కడి కొచ్చినప్పుడు భయపడుతూ అన్నాడు. "అమ్మాయిగారూ .... మిమ్మల్నిచూస్తుంటే నాకేదో భయంగా ఉందండి ...." అంటూ.

"పిచ్చివాడు ! కాక మరేమిటి ? ఆనందంతో త్రుళ్లి పడుతున్న నన్ను చూస్తే భయమేమిటి ?—అదే చెప్పి పంపాను, "నాకీ సంసార సౌఖ్యంమీద యింకా పూర్తిగా విరక్తి పుట్టలేదు లేవయ్యా గోపాలం .... అంత భయపడకు', అని.

"అది సరే మేష్టరూ .... అన్నట్టు పెళ్లి విందెప్పుడు చేస్తారు మా కందరికీ .... ఆ సంతోషాన్ని నా కిస్తారో —లేక ఆఁ .... ఎక్కడి సుజాత, అని వదిలేస్తారో ?—

"ఉంటాను మాష్టరూ .... ఇప్పటికే మీకు తలనొప్పి పుట్టించి ఉంటుంది. నా రాత .... సెలవు ... సుజాత ...."

కంఠంలో మ్రింగుడుపడని గరళాన్ని దాచుకున్న ఈశ్వరుడి నెత్తినే ఉన్నాడు, చల్లని వెన్నెలలు కురిపించే చంద్రుడు.

బడబాగ్నులతో హృదయాన్ని దహింపజేసుకుంటూ, చిరునవ్వు చిలకరించగలిగే శక్తి అందరికీ ఉండదు.

తెరిపీ, తెంపసట్టు తన స్థితిని వివరించిన సుజాత తెలివితేటలకు ఆశ్చర్యపోయాడు గణపతి .... "అవును. సంస్కారం, జ్ఞానం కేవలం చదువువల్ల కలిగేవి కావు.' అనుకున్నాడు.

"ఎవరండీ యీమె ?"

గణపతి ఆలోచనల్ని ఆపి మణిని చూశాడు.

ఆమె ఉత్తరాన్ని చదివినట్లుంది. మడిచి కవర్లో పెడుతూ అడిగింది.

మణి ప్రశ్నలో ఈర్ష్యాసూయలు ధ్వనించినై గణపతికి. తీక్షణంగా ఆమెను చూస్తూ అన్నాడు, "నా కాప్తురాలు" అని.

"అహాఁ .... అది తెలుస్తూనే ఉంది." అని మూతి విరిచి అక్కణ్నుంచి లేచి వెళ్లింది మణి.

'అసూయకు పర్యాయపదం—స్త్రీ' అనిపించింది గణపతికి. నవ్వుగా నవ్వుకుని భార్యను పిలిచాడు. మణి పలక్కుండా వంటగదిలో చాప పఱుచుకుని పడుకుంది.

గణపతి ఆలోచన జాబులోని విషయాల మీదికి పోయింది. 'తనను చూసి అత్తగారు వేదాంతం తల కెక్కుతున్నదనీ— గోపాలం తనకేదో భయంగా ఉందనీ, అన్నాడని వ్రాసింది సుజాత .... అంటే ?—ప్రశ్నార్థకం వెక్కిరించింది గణపతిని .... మరో విషయం, ఈ సంసార సౌఖ్యంమీద ఇంకా పూర్తిగా విరక్తి పుట్టలేదు." అని వ్రాయటంలో సుజాత ఆంతర్యం ఏమిటి ?—పూర్తిగా విరక్తి పుడితే ?—

గణపతిలో హృదయచలనం అధికమైంది. మనస్సంతా అల్లకల్లోలమైంది. సుజాత ఏ అఘాయిత్యానికన్నా తలపడుతుందా ?—అతని కేదో భీతి కలిగింది. సుజాతమీద అతనికున్న అభిమానం, ఆప్యాయతా పొంగి, ఆమెను గురించి చెడుగా ఆలోచించుకునేసరికి దుఃఖం ముంచుకొచ్చింది. ఆమె అంటే అవ్యక్తమైన అనురాగం నిండిన అతని మనస్సుకు, సోదరీ ప్రేమను చవిచూపిన సుజాతకు ఈ కష్టా లేమిటని వ్యధ చెందింది గణపతి హృదయం.

'వ్యథిత హృదయాలకు శాంతి నిచ్చే శక్తి ఒక్క నిద్రాదేవతకే ఉంది.....'

* * * *

# సాగరసంగీతం

నెలరోజుల తర్వాత ఒకరోజు—

సాయంత్రం ఆరుగంట లైంది—

గణపతి ఆఫీసునుంచి కాళ్లీడ్చుకుంటూ యింటిదారి పట్టాడు.

వ్యాపారం నష్టంలో నడుస్తున్నదని ఉద్యోగాన్నుంచీ తీసేసి, ఆనాటి వరకూ అతనికి రావలసిన జీతం యిచ్చి పంపారు కంపెనీవాళ్లు. భవిష్యత్తు కష్టాల మయంగా గోచరించి, నిస్పృహ కలిగించింది గణపతికి.

'టీచర్ ఉద్యోగం వదిలేసి వచ్చినా చిరంజీవి సహాయంతో వెంటనే యీ ఉద్యోగం దొరికింది తనకు, యిప్పుడిదీ పోయింది, చిరంజీవీ లేడు—రేపనేది ఎలా గడుస్తుందో ననే దిగులుతో, మరో ఉద్యోగం ఎలా దొరుకుతుందనే బెంగతో నిండిపోయింది గణపతి హృదయం.

అనేక రకాలయిన ఆందోళనలతో యిల్లు చేరాడు. ఎదురుగా తాళం అతన్ని చూసి వెక్కిరించింది.

ఇంతలో ప్రక్కింటి పిల్లవాడు తాళంచెవి తెచ్చిచ్చాడు, "మణమ్మగారు యిమ్మన్నారు. ఎటో "వెళ్లా" రంటూ.

"సరి .... యీావిడ కెప్పుడూ ఏదో ఓ షాపింగు" అనుకుంటూ విసుగ్గా లోపలికి వెళ్లి పడకుర్చీలో కూర్చొబోయాడు. అందులో ఉత్తరం .... తీసి గబగబా చదివాడు.

"శ్రీవారికి .....

"నేను పతితను .... ప్రపంచానికి తెలిసిన యదార్థమిది. అయినా కోరి నాకోసం పరితపించి నన్ను పెళ్లిచేసుకున్నారు. నాకోసం గొప్ప త్యాగంచేసి ఆదర్శంగా నిలిచారు .... కానీ ....

"మీరూ నాలాగే పూర్వ చరిత్ర ఉన్నవారని తెలిసిన తర్వాత నాలో ఉన్న అసూయ కానీండి, బలహీనత కానీండి, బయటపడింది. నాకీ జీవితంకన్నా గత జీవితమే హాయిగా మేలనిపించింది. ఆలోచించి ఆలోచించి యీ నిశ్చయాని కొచ్చాను .... అందుకనే మీనుంచి తప్పుకుంటున్నాను. నన్నొక నీచురాలిగా తలచి మరచి పొండి .....

"మీ పూర్వ ప్రేయసి కాబోలు మళ్లీ ఉత్తరం వ్రాసింది. టేబుల్‌మీద ఉంది .... మీ మణి .... "

"మణి ! .... " గణపతి కుప్పలా కూలిపోయాడు. ఏదో విషవాగురలో తగుల్కొని తల్లడిల్లేవాడిలా అయిపోయాడు .... కోటికంఠాలేకమై వికటాట్టహాసాలు చేస్తూ అతని కళ్ల ముందు నర్తించినై. అసంకల్పంగా టేబులుమీద కవరును తీశాయి చేతులు .... ఉత్తరాన్ని చించి పుచ్చుకున్నాయి ..... కళ్లు అక్షరాల్ని చూశాయి .... మనస్సు చదువుకుంది ....

"పంతులుగారూ .... సుజాతమ్మగారు వాళ్ల ఊరి పక్క ఏటిలో పడి చచ్చిపోయారు .... గోపాలం ...."

"సుజీ .... " గణపతి తల పడకుర్చీ ప్రేముకు కొట్టుకుని దిమ్మెక్కిపోయింది. గణపతి పిచ్చివాడే అయాడు.

విధి చేతి కీలుబొమ్మ నట్టొకటి రాలిపోయింది.

ప్రపంచంలో వెలుగు నిండుకుంది—

జగతి చీకటిని నింపుకుంది—

ప్రకృతి పురుషుల వింత వింత సల్లాపాల్ని విని గంభీరంగా అపహసించాడు సాగరుడు—



# లేఖలు

# నత్కీరుని కథ - ఔచిత్యము

భారతి సంపాదకులకు,

ఆర్యా,

మే నెల భారతిలో శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు నత్కీరుని కథలోని ఔచిత్యాన్ని గురించి వర్ణిస్తూ "అధమ కవులు మిథ్యాదోషము ఆరోపించిన విమర్శకునిగా నత్కీరుని తరుచుగా ఉదహరించుట పరిపాటి య్యైనది" అని, "కొంత వరకు ధూర్జటికి గూడ ఆ భావమే ఉన్నదేమో" అని సందేహించారు. వచ్చినవాడు శివుడని తెలియక నత్కీరుడు వాదమునకు దిగినాడని శ్రీ నరసింహశాస్త్రిగారి అభిప్రాయము.

"మిథ్యాదోషము ఆరోపించిన విమర్శకునిగా" నత్కీరుని పేర్కొనటం అసమంజసమని శ్రీ శాస్త్రిగారు నిశ్చయంగా యెఱుగుదురు. వారే "నిర్భయముగా సూక్ష్మ దృష్టితో పరిశీలించిన యెడల, నత్కీరుడు చేసిన సాహిత్య విమర్శ సహేతుక మనియే తోచును" అనియు, "నత్కీరుడు ప్రదర్శించిన ధైర్యము అసూయాదోష దూషితులు చేయ గలిగినది కాదు" అనియు "నత్కీరుని వాదమే సమంజసమ్మైన దనక తప్పదు" అనియు వక్కాణించి యున్నారు. ఆధునిక కవులు ఆవిధంగా నత్కీరుణ్ణి గురించి అనటానికి కారణం శ్రీ శాస్త్రిగారికి తెలియనిది కాదు. "సరిగ్గా కొంద రాధునిక కవులు తమ పద్యములఁ తామే పొగడుకొనునట్లే ఈశ్వరుడును తన పద్యమును పొగడుకొన్నాడు." అని వారే వ్యాఖ్యానించారు. నత్కీరుని తీర్థయాత్రా సందర్భంలో ధూర్జటి చెప్పనే చెప్పాడు. "నత్కీరుఁడను మేఘుఁ డుత్తరంబు నడచె సంతోషమున దక్షిణమున నున్నకవుల ముఖ పంకజములు వికాస మొంద" అని. మోమోటము లేకుండా విమర్శించేవారిని యిల్లాగే అంటారు కవులు.

వివాదమునకు వచ్చినది శివుడని నత్కీరు డెఱిగి వున్నట్లు కథలో కనబడుతూ ఉంది. హరద్విజుడు 'ఆ పద్యము' రాజసభలో చదివినప్పుడు నత్కీరుడు తప్పని ఆక్షేపించాడు. అప్పుడు "ఆ బ్రాహ్మణుఁడు మారు మాటాడక తల వంచుకొని పోయి పార్వతీశ్వరునికి జరిగినది విన్నవించుకొనెను." అని రాశారు శ్రీ శాస్త్రిగారు. కాని, ఆ విప్రుడు చిన్నవోయి "నాక వ్వరమేశ్వరుండు వసుధాధిపుపై రచియించి యిచ్చినాఁ డొప్పును దప్పు నే నెఱుఁగ నుత్తములార" అని చెప్పి మరీ పోయాడు. జరిగినది బ్రాహ్మణుని వలన విన్న నిటలాక్షుడు యే రూపంతో రాజసభకు వచ్చినదీ ధూర్జటి చెప్పలేదు. సామాన్య మానవుని రూపంలో విప్రుని వెంటబెట్టుకుని రాజసభకు వచ్చిన ట్లూహించటానికి అవకాశం ఉంది." "గిరి తనయా ఘన కచ భారంబు సహజ గంధంబు" అన్నమాట విన్నప్పుడు నత్కీరుడు వాదమునకు వచ్చినవాడు శివుడని నిర్ధారణ చేసికొని యుండవచ్చును. "లాలామాలపు మాటలు చాలు" నని నత్కీరు డన్నప్పుడు నీలగ్రీవుడికి కోపం వచ్చినా, నత్కీరుడు యెవరితో మాట్లాడుతున్నదీ తెలియక మాట్లాడుతున్నాడను కొని, "తన నిజంబగు రూపం బాలోనఁ దెలుపవలెనని" నిటల నేత్రము చూపినాడు. దానికి బెదరక నత్కీరుడు "తల చుట్టు వాఱఁ గన్నులు గలిగినఁ బద్యంబు దప్పు గాదన వశమే" అని పరిహసించాడు.

ఇక్కడ శ్రీ నరసింహశాస్త్రిగారు "నత్కీరు డాతడు మాయదారియే అని నిశ్చయించుటకు ఆధార మున్నది. నిటల నేత్రము చూపినచో భువనములకే ప్రళయము రావలె. నత్కీరునితోపాటు రాజ్యసభ యంతయు మాడిపోవలె. అది జరుగ లేదు. నత్కీరునికి వేడి కూడ తగులలేదు." అన్నారు. ఈ అభిప్రాయంతోనే నత్కీరుని మాటలకు "నీ వెవరవో మాయ దారివిగా నున్నావు" అన్న మాటలు కలిపారు. శ్రీ శాస్త్రి గారు నిటల నేత్రము చూపటానికీ, నిటల నేత్రముతో చూడటానికీ భేదం గమనించలేదని తోస్తుంది. తాను ముక్కంటి నని నత్కీరుడికి తెలియాలని శివుడు తన నిటలనేత్రాన్ని నత్కీరుడికి చూపాడు. ఆ నేత్రం తనకి చూపటంవల్లనే నత్కీరుడు "తలచుట్టునాఱఁ గన్నులు గలిగినఁ బద్యంబు దప్పు గాదన వశమే" అని, కవిత్వం చెప్పినవాడు శివుడని తెలిస్తే, చెప్పినది తప్పయినప్పుడు చెప్పినవాడు శివుడైనా, మాధవుడైనా, మానవుడైనా ఒకటే ననే దృఢ విశ్వాసంతో పరిహసించాడు. శివుడి శాపానికి గురి అయిన తరువాత నత్కీరుడు "ఈ కవితాభిమానము వహించితి నేటికి ? శంఖ పీఠిపై నీ కవులున్నయట్లు వసియింపక దేవునితోడ నేల చార్వాక మొనర్చితిన్" అని చింతించాడే కాని, తెలియక వాదించానని చింతించలేదు. తక్కిన కవులు పరమేశ్వరుని పద్యం అని తెలియటంతోనే కిమ్మనకుండా ఊరుకున్నారు. సుబ్రహ్మణ్యస్వామితో చెప్పుకొన్నప్పుడూ నత్కీరుడు "ఏ నొక తప్పుఁ జేసిన మహేశుఁడు నన్ను శపించె" అనే చెప్పుకొన్నాడు గాని తెలియక తప్పు చేశానని చెప్పుకోలేదు. సాహిత్య విమర్శలు చేసి శాపాలు పాలవటం మంచిది కాదనుకున్నాడేమో నత్కీరుడు కూడా !

నత్కీరుని కథలో ధూర్జటి విమర్శను సహించలేని కవిగా శివుని చిత్రించినాడు. పరమశివుడే తన కవిత్వాన్ని విమర్శించటం సహించలేనప్పుడు, సామాన్య మానవుల కది సాధ్యమా ? తమ కవిత్వంలో తప్పు పట్టినప్పుడు కవు లందరికీ యెంత ఆగ్రహం వస్తుందో పరమశివుడికీ అంతే

ఆగ్రహం వచ్చింది. ఈ విషయాన్ని చిత్రించటానికి అనుకూలంగా ధూర్జటి నత్కీరుని కథను రూపొందించాడు. అందుకే యీనాటికీ "కవిత సాహిత్య స్ఫురన్మాధురీచారు ప్రౌఢిమ" చెప్పే వారికి నత్కీరు డారోపించినది మిథ్యాదోషంగానే కనిపిస్తూ ఉండవచ్చును.

"ధూర్జటి చెప్పిన నత్కీరుని కథలో ఎన్నో అసందర్భములు కూడా సూక్ష్మముగా చూచినవారికి పొడగట్టును. కాని, వాని నిప్పుడు ప్రస్తావింప తలంపలేదు" అన్నారు శ్రీ నరసింహశాస్త్రిగారు. కొన్ని అసందర్భాలైనా చెప్పారుకారు మఱి!

—శ్రీ న. చ. రామానుజాచార్యులు.

## హరవిలాసము-యతిచ్యుతులు

ఆర్యా,

మే నెల భారతిలో 'విశ్వనాథవారి యతిగీతము' అన్న వ్యాసములో శ్రీ ఏ. రామమోహనరావుగారు శ్రీనాథుని హరవిలాసములోని యతిసౌలిత్యముల గొన్నిటి జూపిరి. లభ్యమగు పూర్వ గ్రంథములు చాలవరకు పాఠభేదములతో, నష్టభ్రష్ట పాఠములతో నున్నవని పండితుల మాట. పరిశోధన పరిష్కారములు జరిగినను పాఠభేదనులు తప్పుటలేదు. ప్రకృత ముదహరింపబడిన యతిభ్రంశములు పండిత ప్రకాండులు పరిశోధకులు నైన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారిచే పీఠికతో గూడ ప్రకటింపబడిన హరవిలాసములో నున్నవి సాధు పాఠములుగా గ్రహించుట ఉచితమనుకొందును—అందున్న ప్రకారము :—

ద్వితీయాశ్వాసము—25 ప.

1. ఉ . . . . . . . నదీముఖంబునం
బయ్యెరవట్టె మేఘములు పంచుగ బాలెనుదఙ్ము
ఖంబులై.

శ్రీ రామమోహనరావుగారి పాఠము — నచ్చుగ అన్నను పూర్వ పాదాంత న కారముతో యతి మైత్రి కలదు.

2. 30—ప—

చ. దినములు రేల్ పయోఘృత దధి ప్రచురాన్న సమర్పు..

వారి పాఠమున రేఁబవల్ దధిమదు అన్న చోట పదములు మారియుండి యతిదోషము దొరలును. ముద్రణముల నట్లాయి యుండరాదా.

3. 37. ప—

స్నానముచేసి ధౌత పరిధానము గట్టి—

దీనిని తద్భవవ్యాజ యతియని శ్రీ ప్రభాకర శాస్త్రుల వారు తెలిపియున్నారు. పీఠికలో గొంత వివరణమును గలదు. ఈ యతి లక్షణ గ్రంథములలో నున్నదే. ఇది యిట్లే సమర్థింపబడవలె—స్నానము—తద్భవము—తానము.

4. 45— గీ. బ్రమసి తప్పిన పసరంబు నెమకినట్లు.

ఇట ప్రాసయతి.

5. 98—కం. ప్రాగల్భ్యంబున నిధాన వన సిద్ధులకై.

యతి చెడలేదు—ప్రకరణము బట్టి నవసిద్ధుల కంటె వనసిద్ధులని యుండుట ఒప్పు—

6. తృతీయాశ్వాసము 61—ఉ. పాఠము.

ఉ. పంకజరేణు గంధియగు పల్వలవారి గరేణు విచ్చె, ని
శ్శంక మదావళంబునకుఁ జాచి గజంబును—పద్మినీ....

యతి గలదు.

7. తృతీయ. 35. ప—

కం. సమధిక విఘ్నంబ యనుచు జర్చించియు —అని పాఠము.

8. చతుర్థాశ్వాసము—9—ఉ. . . . మండలీ సము
త్రైధ విశీర్ణ సంహతులు జెల్లు మహీరుహ వల్క
లంబులన్. అని పాఠము గలదు.

2—శృంగార నైషధము—ద్వితీయాశ్వాసము.

మ. . . . . . . . . . శ్రీ సుధా
నవదిగ్వారణ సోదరుండవు గడన్ శ్లాఘ్యుండవు.

అని పాఠము కలదు. అందు విశ్రామస్థానమునకు బూర్వమందు గల న కారముతో మైత్రి—జగచ్ఛ్లాఘ్యుండనుచో యతి లేదు.

ఇక తృతీయాశ్వాసమున—

తే. తగవుగా దిందులో ననేక తరగర్తా.

ఇట యతి తప్పినది. శ్రీ వేంకటరాయ శాస్త్రులవారు ఏకతమ గర్తా అని పఠించిరి కాని యందును యతి తప్పె—మార్చున కవకాశమును లేదు—

ఈ పై పాఠములన్నియు బరిష్కర్తలు మార్చి యుందురా! సాధు పాఠములవియే కాకూడదా—సరిచేయు మార్గము న్యాయము కాదన్న సరియైన వివియే యని యేల తలపరాదు.

ఒక్క ద్వితీయాశ్వాసమున (హరవిలాసము) శ్రీనాథుఁ డిన్ని యతిభ్రంశములు చేసినాడన్న నమ్మదగినది కాదు. ప్రమాదము లుండవని కాదు. ముద్రణ గ్రంథములు పలు

మారులు పలు చేతులు పడి తార్మారయి యుండునని పెద్దల భావన—అనేక తాళపత్ర గ్రంథముల బరిశీలించి శ్రీ ప్రభాకర శాస్త్రులవారు సమకూర్చిన ముద్రణమున నిన్ని యతిచ్యుతము లున్న పీఠికలో నయిన వారామాట తలపెట్టరా—ఒక్క స్నానముచేసి ధౌత పరిధాన' మన్న యతి గూర్చియే కొంత వ్రాసిరి.

జిజ్ఞాసువునై నాకు దోచిన దిట తెలిపితిని—

—చిగురుపాటి పద్మనాభశర్మ.

# "యతిగీతము"

ఆర్యా,

విశ్వనాథవారి "యతిగీతము" గురించిన శ్రీ ఎ. రామమోహన రావుగారి సమర్థనాలేఖను చదివి చాల ఆశ్చర్యపోయాను.

ఆధునికమైన యతిప్రాసరహిత కవితల్ని ఆక్షేపిస్తూ, కేవలం ఛందోబద్ధ కవితలే సాహిత్యానికి అలంకారాలుగా భావించే సనాతన కవులు—భావావేశంలో యతిప్రాసలను, తమ కను వుగా ప్రక్కకు నెట్టి—అటు ఛందోబద్ధ కవిత్వమూ కాక—ఛందోరహిత భావ కవిత్వమును కాక—మధ్యరకంగా రచన చేయడం మెచ్చుకోదగింది కాదు.

ఇక శ్రీనాథుడి హరవిలాసం, శృంగారనైషధ కావ్యాలో ల్లోని కొన్ని యతి దోషాల్ను ఉటంకించి—శ్రీనాథు డంతటి మహాకవే తప్పులు చేశాడనీ, విశ్వనాథవారి తప్పు అంతగా పట్టించుకో నవసరము లేదని వ్రాశారు. శ్రీనాథుడి కాలానికి కాగితాలు, అచ్చు యంత్రాలు లేనందువల్ల తాటాకులపై కావ్యరచనలు చేశారు. ఆ వ్రాతప్రతుల్ని శతాబ్దాల తర్వాత (కొన్ని జీర్ణమైనవి కూడా) మనం అచ్చొత్తించుకొన్నాం. ఎన్నో చేతులు మారి—కొన్ని అక్కడక్కడా జీర్ణమై—అచ్చయే వాటికి ఒక పదం మారు మరోపదం ఉండటంలో ఆశ్చర్యం లేదు.

శైలీ ప్రవాహమూ—అర్థమూ యివి రెండే ప్రధానంగా చూడదలిస్తే కవితలు, గేయాలుగా వ్రాయ వచ్చును. కానీ, ఛందోబద్ధ కవిత్వం వ్రాస్తూ, తన్నియమోల్లంఘన గావించడం —సామాన్యకవులు చేస్తే యేదో సర్ది చెప్పుకోవచ్చేమో కానీ, కవిసామ్రాట్టులు చేయడం—కాస్త విచారకర విషయం.

ఎంతటి కవి సామ్రాట్టులైనా, పొరబాట్లు మానవ సహజాలు కావున—తప్పులు దొర్లుంటాయ్. వారు ఇప్పటికే వాటిని సరిదిద్దుకొని కూడా ఉండొచ్చు. కానీ, వారిపైని తమకు గల అభిమానంతో—వారి తప్పుల్ని సమర్థించడం చాల అనుచితంగా ఉంది.

పత్రికల్లో ప్రచురించిన రచనల విమర్శించే హక్కు పాఠకుడి కుంది. 'కేవలం సామాన్య పాఠకుడు వెలువరించిన కొన్ని ప్రశ్నలకు—నే ననునది యేమియూ లేద'ని తీసికట్టుగా అనడం శ్రీ ఎ. రామమోహనరావుగారి లాంటి విజ్ఞులకు ఉచితం కాదేమో !

(మడకశిర) ముడార్ వేణుగోపాల్.



# గ్రంథ విమర్శలు

## ఉ ద బిం దు వు లు

భావ తరంగిణి—రచయిత : జి.వి.కృష్ణరావు. ప్రచురణకర్తలు: అన్నపూర్ణ పబ్లిషర్సు, ఏలూరు రోడ్డు, విజయవాడ—2. వెల : రు 5.

పద్యములు, కథానికలు, నాటిక, సాహిత్య వ్యాసాలు అనే శీర్షికల క్రింద 1938—64మధ్య కాలంలో తాము చేసిన వివిధ రచనలను సంకలితం చేశారు కృష్ణారావుగారు. రచయిత 'భావతరంగిణి' చిమ్మిన ఉద బిందువులు యీ రచనలు. ఇందులో కొన్ని 'కథలూ పద్యాలూ, సాహిత్య భవిత్యం' అనే వ్యాసమూ లోగడ 'భారతి'లో ప్రచురించబడినవే.

1938 — 64 మధ్య కాలంలో రావుగారిలో క్రమంగా వచ్చిన పరిణామం ఈ సంపుటిలో చక్కగా గోచరిస్తోంది. ఉదాహరణకు — 'భిక్షాపాత్ర' నాటిక ఏప్రిల్ 1938 నాటిది. రెండు రంగాల ఏకాంకిక. వ్యాసుడు భిక్షం దొరక్కపోవటంతో కాశీకాపురిని శపించటానికి ఉద్యుక్తుడు కావటం, అన్నపూర్ణాదేవి ఆయన్ని పిలిపించి భిక్ష పెట్టబోవటం, విశ్వనాథుడు ఆయన్ని శిష్యసమేతంగా పురినుండి వెడలగొట్టడం కథ. ఇందులో దృక్పథం పూర్తిగా మార్క్సిస్ట్ దృక్పథం. వ్యాసుడు తన రచనా వ్యాసంగమంతా ఒక పెద్ద పొరపాటని వాపోతాడు. ఈ జారిన అశ్రుకణమే ఇదివరకే యీ భిక్షాపాత్రలో వర్షించి ఉన్నట్టయితే!...జారలేదు, అందుకనే శ్రుతిలేని రాగమాలపించాను...బీదలకు ద్రోహం చేసే కర్మ సిద్ధాంతమూ, అవతార వాదమూ బోధించి దాస్యం అంగీకరింపజేశాను. నా గీత యీ కర్మ భూమిలో ఎంతకాలం ఉంటుందో అంతవరకు నివృత్తి లేకుండా చేశాను. ఈ సంఘమే మారిపోకుండా ఆశాసించాను.....ఆధ్యాత్మికమనే పేరుతో తుచ్ఛ భౌతిక తత్వాన్ని ఉపదేశించాను. భిక్షాపాత్ర నిచ్చి విద్యావంతుల్ని పాడుచేశాను....అబ్బా, విప్లవ హృదయాన్నే చిదిమి వేస్తున్నాను...'' ఈ ధోరణిలోనే, యీ దృక్పథంలోనే 1947లో వ్రాయబడిన కథానికలు 'చేసుకున్న కర్మ', 'మాయ', అతడంటే', వేదాంతి' అనేవి. శీర్షికలు వ్యక్తం చేస్తున్నట్లే కర్మ, మాయ, నిర్లిప్తత, వేదాంతం అనేవి హిందూ సంఘంలో సిద్ధాంత రూపేణా వ్యక్తుల్లో క్రమంగా వాళ్ల చేతకాని తనాన్ని, బాధ్యతారాహిత్యాన్ని, కుళ్ళుబోతు తనాన్ని స్వార్థం లేక లోభ గుణాన్ని కప్పిపుచ్చుకునేందుకు ఎలా దుర్వినియోగం అవుతున్నాయో నిరూపించే కథ లివి. అవహేళన, వ్యంగ్యం ప్రధానంగా ఉన్న యీ రకం రచనలు సంఘానికి ముల్లుగర్రలా పనికి వచ్చేవి. అయితే ఇవి సాహిత్యంలో ఏ శ్రేణికి చెందినవి? అని ప్రశ్నిస్తే, దానికి సమాధానంగా —ఈ సంపుటిలోనే కృష్ణారావుగారు 'సాహిత్యభవితవ్యం' అనే విమర్శ వ్యాసంలో పేర్కొన్న నాలుగు తరగతుల్లో రెండో తరగతికి చెందినవని చెప్పవలసి ఉంటుంది. ''1. మనః కాఠిన్యం సడల్చక ఆసక్తిని మాత్రం కలిగించే రచనలు సామాన్యాలు, 2. మనః శ్లైథిల్యం మాత్రమే కల్పించేవి మధ్యమాలు, 3. చిత్తద్రుతి కలిగించి తన్మయీ భావ మాపాదించేవి ఉత్తమాలు, 4. నిర్బీజ సమాధ్యవస్థ కల్పించేవి ఉత్తమోత్తమాలు.'' కృష్ణారావుగారి విభజన ప్రకారం 1938—47 నాటి ఆయన రచనలు మనః శ్లైథిల్యం కల్పించేవి.

తర్వాత దృక్పథం మారింది. నాగార్జునుల మాధ్యమిక వాదం రచయితకు ఆదరణీయమైంది. ఆ రచనలు— 'మాధ్యమక వింశతి' (1956), 'నివేదనము' (1958). 'మాయ సిద్ధాంతాన్ని వెక్కిరించిన రచయితే 'మాధ్యమక వింశతి'లో యిలా అంటున్నారు.

''మాయ గల్గినదై చిత్రమాత్ర మగుచు  
నీ సమస్త ప్రపంచమ్ము నెసగుచుండు  
దానిచే శుభాశుభ కర్మ తతియు బొడము  
దానిచే శుభాశుభము లుద్భవము పొందు  
చిత్త చక్ర నిరోధంబు చేత సర్వ  
ధర్మ సంఘాతములు నిరుద్ధంబు లగును  
దానిచే ధర్మములు ననాత్మంబు లగును  
దానిచేతనే యవ్వి శుద్ధంబులగును''

చిత్తచక్రగతి ఎలా ముఖ్యమో గుర్తించడం చేతే, రచయిత 'ఉద బిందువులు' (1963) అనే కథలో చిత్త వృత్తుల సంఘర్షణ, ఒకరినొకరు అర్థం చేసుకోలేక పోవడం ప్రధాన వస్తువుగా చిత్రించారు. ఇది చిత్తద్రుతి కలిగించే రచన, కావున రావుగారి విభజన ప్రకారం మూడో తరగతికి చెందింది.

ఈ సంపుటిలోని వ్యాసాలు— 'కావ్యాలలో నీతిబోధ', 'సాహిత్యభవితవ్యం'— సాహిత్య ప్రయోజనాన్నీ, సాహిత్య తత్వాన్ని పరామర్శించేవి. ఎన్నదగిన వ్యాసాలు. రెండో వ్యాసంలో, ఇదివరకే సూచించినట్లు, రావుగారు సాహిత్య తత్వాన్ని నాలుగు తరగతులుగా విభజిస్తూ, ఆ విభజన ''ముఖ్యంగా సామాజికుల హృదయ స్పందనంపై ఆధారపడింది'' అన్నారు. అవును తర్వాత కవికీ లోకానికీ ఉన్న సంబంధాన్ని గట్టిగా నొక్కి చెబుతూ ''ఆధివ్యాధి పీడితులు, క్షుత్పిపాసార్దితులు అయినవారు యోగానికి వలెనే కావ్య నిర్మాణా స్వాదనలకు అనర్హులు, అశక్తులు'' అన్న నిర్ణయానికి వచ్చారు. ఈ అభిప్రాయానికి, 1938లో వ్యాసుని పాత్ర ద్వారా పలికించిన అభిప్రాయాలకూ ఎక్కడ పోలిక!

పోతే, రావుగారు సాహిత్య భవితవ్యాన్ని గూర్చి నిస్పృహ వ్యక్తం చేశారు. ''సాయుధ సంఘర్షణ పరిహారించ గలిగిన

విశ్వకల్యాణ ప్రదలక్ష్యం కోసం రచయితలు అన్వేషణ సాగిస్తున్నారు. ఇంతవరకూ వారికి ఒక విస్పష్ట దృష్టి ఏర్పడలేదు. విస్పష్ట దృష్టి లేనప్పుడు రచన ఎలా వెలువడుతుంది.? వెలువడినా అందులో జీవం ఎలా ఉంటుంది?'' ఇదివారు చెప్పిన మొదటి కారణం. రెండోది : ''భౌతిక భోగలాలసమైన ప్రజానీకం కావ్యాస్వాదనకు దూరమవుతున్నది.... ప్రభుత్వాలు రచయితలను, లలితకళా స్రష్టలను పూర్తిగా అనుశాసిస్తున్నవి...భావస్వాతంత్ర్యం లేని చోట ఉత్తమ కృతులు ఎలా వెలువడుతవి?'' అన్నారు. నేటి పరిస్థితులను గూర్చిన పై పరామర్శ న్యాయంగానే ఉంది. కాని చిట్టచివర : ''ఉత్తమ కృతుల ఆవిర్భావానికి సమాజంలో కొంత నిలకడ అవసరం.... స్థితిగతులుఇంత త్వరగా మారుతున్నప్పుడు రచయితకుగాని పాఠకునకుగాని విస్పష్ట దృష్టి, విలువలు ఉండటానికి వీలున్నదా? ఈ యిరుపక్షాలు విభ్రాంతులై ప్రతిదీ తాత్కాలికమని భావించవా? ....సమాధ్యవస్థా పాదకాలైన కృతులకు అవకాశం తక్కువ. తదాస్వాదన శక్తిగూడ సన్నగిలక తప్పదు....'' అంటూ సందేహాన్ని నిస్పృహనూ వెలిబుచ్చారు. రావుగారిలా అనటం, నాగార్జునుల మాధ్యమిక వాదంలో నిష్ణాతులైన రావుగారే యీ నిస్పృహకు లోనుగావటం ఆశ్చర్యం కలిగిస్తోంది. 'యత్ సత్ తత్ క్షణికం', ఏది వాస్తవికమో అదంతయూ క్షణికమే. ''యః ప్రతీత్య సముత్పాదః శూన్యతాం తాం ప్రచక్షతే'' ఈ 'ప్రతీత్య సముత్పాదః దృష్టిని ఆకళింపు చేసుకున్న రావుగారు 'నిలుకడ', 'విస్పష్టమైన విలువలు' అంటూ సమాజంలో జీవితంలో, వాటిని కోరుతూ ఎలా భ్రాంతిలో పడుతున్నారో అర్థం కావటంలేదు! 'సమాధ్యవస్థ' అంటే ఏమిటి?'' ఆ స్థితి ఆర్య నాగార్జునుడు పేర్కొన్నట్లు ''చతుష్కోటి (సదసదుభయాను భయాంతాలు) వినిర్ముక్తం....మూర్త ప్రపంచంనుంచీ అమూర్త ప్రపంచానికీ, ఆ అమూర్త ప్రపంచంనుంచీ అసంవృతికీ వెళ్ళటమే''నని వ్రాసిన రావుగారే ఉత్తమరచయితకు సమాజంలోపరిస్థితులుయిలాఉండాలి అలాఉండాలి అని కోరటంచూస్తే, ఆనాడు ప్రబంధ కవులు 'రమణీ ప్రియ దూతిక తెచ్చి'యిచ్చు...' అంటూ కోరికలు కోరినట్లుగా ఉంది. విలువలూ అభిప్రాయాలూ త్వరితంగా మారుతూ ప్రతిదీ తాత్కాలిక మన్న భ్రాంతి' సర్వసామాన్యంగా అందరికీ కలుగుతూన్నదా సమాజంలో?, అలా అయితే మంచిదే—అదే ప్రతీత్యసముత్పాద దృష్టి. అటువంటి దృష్టి కలుగుతూ విభ్రాంతులౌతున్న మనుష్యుల్లోనే 'అమూర్త ప్రపంచాన్ని' గురించీ 'చతుష్కోటి వినిర్ముక్తమైన' తత్వాన్ని గురించీ జిజ్ఞాసా, అన్వేషణా యితోధికంగా వృద్ధి చెందుతుంది. ప్రజానీకం భౌతిక భోగలాలసమౌతున్నదా. అవనీయండి? కామిగాక మోక్షగామి కాడు' ఇలాటి పరిస్థితులలోనే ఉత్తమ సాహిత్య సృష్టికీ, ద్రష్ట తత్వజ్ఞుడు అయిన రచయితకూ అవకాశం ఎక్కువగా లభిస్తుంది. షేక్‌స్పియర్ నాటి ఆంగ్ల ప్రజానీకం, పెద్దన నాటి ఆంధ్రప్రజ, కాళిదాసు నాటి మనుష్యులూ భోగలాలసులే అనే మాట మరచిపోతే ఎట్లా? నేటి రచయితలు వెదకవలసింది 'సాయుధ సంఘర్షణ పరిహరించ గలిగిన విశ్వకల్యాణ ప్రద లక్ష్యం', అంటే కేవలం **Political solution** కోసంకాదు! అలా చేస్తే అది పత్రికా రచనమే (Journalism) అవుతుంది. జర్నలిజం విపరీతంగా అభివృద్ధి చెందినంత మాత్రాన ద్రష్ట అయిన రచయిత నిస్పృహచెంద వలసిన కారణం కనిపించదు. నేటి రచయిత 'ప్రతీత్యసముత్పాద దృష్టి' తత్వ జిజ్ఞాసా, కలిగి ఉండడమే కాదు, దాన్ని సాహిత్య కృషిలో రూపొందించే పద్ధతుల్నీ ప్రక్రియల్నీ అవలంబించాలి. అందుకు పరిస్థితులు ఈ యుగంలో అనుకూలించినట్లు గతంలో ఎప్పుడూ అనుకూలించలేదు అనే చెప్పాలి. రావుగారు యీ విషయమై యింకోసారి ఆలోచిస్తే, నిస్పృహను అధిగమించి, ఉత్తమ రచనలు చెయ్యగలుగుతారని ఆశిస్తున్నాను.

—ఆర్ ఎస్. సుదర్శనం.

# ముమూర్షువు

గేయ కావ్యం. రచయిత : వెన్నం. ప్రచురణ : క్వాలిటీ పబ్లిషర్స్, విజయవాడ—2. పుటలు: 102. మూల్యం: రు. 2.

నాలుగు కాలాలపాటు చల్లగా బ్రతకాలన్న కోరిక ప్రాణికోటికి సహజం. అందుకు విరుద్ధంగా మరణాన్ని అభిలషించడం ఏవో ప్రత్యేక పరిస్థితుల్లో గానీ అసహజం. ఈ కావ్యంపేరు—ముమూర్షువు. చావ నిచ్ఛ గలిగినవా డన్నది ఆ పదానికి నిఘంటువు లిచ్చే అర్థం. ఆ యిచ్ఛను రకరకాలుగా వ్యక్తం చేశారు రచయిత. ఒకచోట మృతి దాపువాడను అన్నారు.. మరొకచోట కాటికి పోకమునుపే మసైపోతి నన్నారు. ఇంకొకచోట 'శిరము సమీపములో ఓ చమురు దీపమా! దూరాన జీవ సమాధికి దారి జూపుమా' అన్నారు. తన చితిని గురించి, దానినుంచి ఎగసే జ్వాలల్ని గురించి, ఆ పొగలను, సెగలను గురించి ఒకప్పుడు ఆప్యాయంగా, మరొకప్పుడు ఆక్రోశిస్తూ చెప్పుకున్నారు. ఇంతకూ ఇంతటి బ్రహ్మండమైన ముమూర్షకు హేతువేమిటో కావ్యంలో స్పష్టంగా చెప్పబడలేదు. వాడిన (?) వాడి కొమ్ముల ఖడ్గమృగంగా భావించి చేడియ ఈయనపైన ద్వేష శరం కుమ్మిందట! పాపం, భగ్న ప్రేమికుడేమో! కానీ అంతకుముందే ఒకమా టన్నారు—అలవాలై ఆకలి హోయని (హోయి—అని)పించినది ప్రతినాడు—అని! తిండి గూడా దొరికింది గాదేమో! ఎవరో క్రూరాత్ములు (బహుశా లోకులేమో!) తన శరీరాన్ని సెగలు చిమ్మ నిప్పులలో పొరలించినారనీ, పరుషపు వాక్కుల గాలాలతో గ్రుచ్చినారనీ ఒకచోట విశదం చేశారు. ఇంకా భూతాలు శాపా లిచ్చినవనీ, కుసుమాలు పూచిన దిలత యేమోనని తాకి చూడగా, అది పాము తలగా తేలిందనీ, తమ దౌర్భాగ్యాన్ని వెయ్యి రకాల ఊహలతో, పోలికలతో వ్యక్తం చేశారు. ముక్తసరిగా చెప్పాలంటే లోకంలో ఎన్నెన్ని బాధలు, ఎన్నెన్ని ఆవేదనలు అయితే ఉన్నాయో అవి అన్నీ కలిసి కట్టుగా మాట్లాడుకుని ఈ ముమూర్షువుపైకి దాడి వెడలాయేమో ననిపిస్తుంది. పాఠకులు గూడా ఆ బాధలో ఏ కొంచెమో నంచమో అనివార్యంగా పంచుకోవలసి వస్తుంది. కానీ, అందుకు ముమూర్షువుపట్ల కలిగే సానుభూతి గానీ, కావ్యంవల్ల కలిగే రసానుభూతిగానీ కారణాలు గావు. అందుకు కారణం కావ్యరచనలోని వైచిత్రి:

# గ్రంథ విమర్శలు

ఒకటి ఒకటిన్నర అంగుళాల దగ్గిరి నుంచీ, నాలుగు నాలుగున్నర అంగుళాల దాక తోచిన చోట విస్తరించి, తోచని చోట రుచించకపోయే రెండేసి పాదాల చరణాలతో సుమారు అరవై పేజీల దాకా వ్యాపించిన గేయ కావ్యం యిది. (అసలు పుస్తకంలో 'ముమూర్షువు' గాక ఇంకా నాలుగైదు ఖండ కావ్యా లున్నాయి) ఈ రెండు పాదాల పడికట్టురాళ్లను పొందించ డంలో ఎడతెగని భావధారను నిర్వహించాలన్న కక్కుర్తికన్నా, ఎక్కడి కక్కడ అంత్యప్రాసలు కుదిరితే అదే పదివే లనుకుని సంతృప్తి వహించారు రచయిత—

మొదటి గీత : ఎవరు నా అభిమాన పాత్రము ?

భాషా ప్రపంచంలో 'పాత్రము' అనే పదానికి అప్రశమంగా లభించే తోడుకోడలు 'నేత్రము.' వెంటనే రెండో గీత యిలా పూర్తవుతుంది—ఎవరు నా హృదయానికి నేత్రము ?

మొదటి గీత : 'ప్రళయంలో నేను కలిసి మాడిపోవు నప్పుడు'—అప్పుడుకు జంటపదం ? ఆలోచనెందుకు ?— చప్పుడు. ఇంకేం, రెండో గీత తయార్ !—శూన్యంలో వినిపించు నాహాకారపు చప్పుడు.

ఒక్కొక్కప్పుడు రచయితకు పాదాల కుదుళ్లలో గూడా ప్రాసను నిర్వహించాలన్న బుద్ధి పుడుతుంది. అలాంటి చోట్ల మరింత చమత్కారాన్ని వెల్లడిస్తూ రాయన—

నా దగ్ధవేల్పు నెవరూ ఆరాధించరు
నా లుప్తపాలు నెవరూ ఆరగించరు—

'దగ్ధవేల్పు' అంటే, పోనీ ఆయనగారు తమ వేల్పుకు సైతం ముప్పు తెచ్చారని అనుకోవచ్చు. కానీ లుప్తపాలేమిటి? అదేమైనా భక్ష్య విశేషమా ! తా నారగించగా మిగిలిన పాలు కాదుగదా !

నిశీథము నంతా నన్నే ఏలుకోనీ
మశీదువలె ఏకాంతమున కాలిపోనీ—

ప్రాస కోసం గాకపోతే ఏకాంతంలో కాలిపోయేది మశీదులే కావాలన్న అగత్యం కనిపించదే !

ప్రాసలు కుదర్చడంలో మాత్రమే గాదు, తెలిసిన పదాల కలయికతో ఊహించడానికి వీలుకాని భావాన్ని దేన్నో ప్రక్షిప్తం చేయడంలో గూడా రచయిత సిద్ధహస్తులు.

కావ్యారంభంలో ప్రత్యేకంగా నాందిలాగా చెప్పిన నాలుగు గీతలు—

నిశలలో పార్లిన విషము
ఆశలను కరచిన దోషము
హృదిలో తడులు కనరాని కరినులకు
పృథివిలో విడుపులు లేని పతితలకు.

ఒకసారి చదవగానే అర్థమైపోవాలని కాదు గానీ, ఎన్ని సార్లు చదివినా విస్పష్టంగా భావం బోధపడకపోతే పాఠకులు తమ దురదృష్టాన్ని వినా మరి దేన్ని నిందించుకో గలరు ?

ఆశలకై ఎన్ని సుబాసలు నశించినవో
పసులకై ఏ ఛాయలు భస్మమైనవో

ఆశలకోసం సుబాసలు (?) నశించడమంటే ఏమిటో, పసుల కోసం ఛాయ లెందుకు భస్మమైనవో తెలియడానికి పుస్తకంలో లఘుటీక లేపీ పొందుపరచబడలేదు.

ఘూత్కరించు ఉరగవాలు దంతులపై
పాదాలు మోపి ఏవాలుగా పోయిరి .....

ఉరగవాలు అంటే ఉరగాలా ? ఏవాలు అంటే ఏటవాలా? నిఘంటువుల పాలిటికి అదృశ్యంగా ఉండిపోయి, మొదటిసారిగా ఈ పుస్తకంలో దర్శనమిచ్చే పదాలు గూడా కొన్ని ఉన్నాయి. ఉదా : ఉరగవాలు, ఏవాలు, పేశము, ఖతలము మొ.

ఏమైనా ఒక ముఖ్యమైన కారణాన్ని పురస్కరించు కుని రచయితను అభినందించక తప్పదు. శవాలతో, హాహారవా లతో నిండిన ఈ కావ్యాన్ని చదివిన తరువాత, తమంతట తాముగా ఓ నిర్ణయానికి రావలసిన బరువైన బాధ్యత నుండి ఆయన పాఠకులను తప్పించారు. చివరిపుట చివరి చరణంలో —'నా కవిత పతిత' అని ఆయన చెప్పనే చెప్పారు.

—యం. ఆర్.

## పారిపోయిన చిలుక

( ఇతర కథానికలు )

ఆచంట శారదాదేవి, ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ. ధర : 2.50.

ఈ కథలలో సామాన్య గృహిణుల మనస్తత్వాల కెక్కువ ప్రాముఖ్యత యివ్వబడినది. "పూలల్లో దాగిన దారం వలె" ఇంటిపనుల నంతా చక్కబెడుతూ తన ఆరోగ్యాన్ని సహితం లెక్కచెయ్యక చివరికి ఒంటరిగానే ఆస్పత్రిలో కళ్లుమూసిన రాజేశ్వరమ్మ "ఒట్టి పిచ్చిది." గృహిణుల పట్ల మధుర భావా లతో నిండిన జాలిని చిలికించే ఈ కథ వివిధ వ్యాపకాలతో కుటుంబాలను విస్మరించే పురుష పుంగవులు చదువదగినది.

"కులాసాగా చేరాను. ఉత్తరం వ్రాస్తారా" ఒక్క వాక్యంతో సంతృప్తిపడే భర్త మనస్తత్వము—, "మా అమ్మ పేరు శాంత" అని చెప్పగనే ప్రొఫసర్‌లో స్ఫురించే మధురాను భూతుల సంపుటాలు, రెండువే లేండ్లు బ్రతికిన మహా వృక్షాల అనుభవాలు—, పారిపోయిన చిలుకతో కామాక్షమ్మ చెలిమి బలం, "నాకు కొడుకు పుడతాడు" అనే ఉత్సాహంతో జీవితాశలతో ఆలోచించే కన్నెపడుచు వెన్నెల మానసము, అందని ఆదర్శంతో కాఫీ రుచిని సహితం గమనించని రచ యిత ధ్యేయం, "ఒకదాని నొకటి నాకుతూ ప్రాణాలు విడిచిన కోడెదూడల" అంతిమ సందేశం, "మీరా" వంటి స్త్రీల స్వభా వము, అమ్మ కోసం బిడ్డలు పడే ఆవేదన, స్వార్థ మెరుగని అర్థం చేసుకోలేని మానవుని అన్వేషణలను క్రమంగా కథలలో కమ్మగా చెప్పగల్గడం గొప్ప విశేషం. ఆకాశం, నక్షత్రాలు, మేఘాలు పదేపదే వర్ణనలలో కన్పించడం చర్విత చర్వణం, ప్రకృతి దృశ్యాల చిత్రీకరణలో వైవిధ్యం లోపించినది కొద్దిగా. ప్రత్యేకించి క్రొత్తగా కథారచన కుపక్రమించి కథావస్తువు చిక్కడంలేదని కంగారుపడేవా రిట్టి కథలు చదివితే తమ నిత్య

జీవితాల నుండి అనుభవాలను దృష్టిలో ఉంచుకొని అనేక కథలు వ్రాయగలరు.

## న వ గీ తా లు

రచన : జాస్తి వేంకటనరసయ్య, భారతీ సమితి, పామర్రు, కృష్ణాజిల్లా, వెల : 1.30.

ఇందులో గేయాలు పద్యాలు వివిధ శీర్షికలతో ఉన్నవి. గ్రంథాలయోద్యమము, వయోజన విద్యావశ్యకత, సైనిక శిక్షణావసరము, బ్లాక్ మార్కెట్ నివారణావశ్యకతల గూర్చిన ప్రబోధనాత్మక రచనలు విద్యార్థులు నేర్చుకోదగినవి.

"లంచగొండులను పట్టండి
లాకపులో పడ నెట్టండి
ఎంచబోకుడట ఎక్కువ తక్కువ
తెల్లరగని శిక్షించండి."

వంటి గేయాలు ప్రచారంలో ఉండదగినవి. సంఘసేవకుల, దేశ భక్తుల, కవుల పట్ల గ్రంథకర్త కున్న గాఢాభిమానాన్ని సూచించే శీర్షికలీ గ్రంథంలో ఇంకా కొన్ని ఉన్నవి.

—కె సభా

## జ య దే వు డు

రచన : విష్ణుభట్ల కృష్ణ మూర్తిశాస్త్రి, ప్రతులకు : ఎ. వెంకటేశ్వర్లు, సామర్లకోట, తూర్పుగోదావరిజిల్లా, వెల : 1.50.

జయదేవ మహాకవి జీవితగాథ కథావస్తువుగా రచించ బడిన పద్యకావ్య మిది.

## అ ధు నా :

రచయిత : సుప్రసన్న, దీప్తి కన్సరన్స్—ఒరంగల్, వెల : 1.50. ఇరువదిఒక్క శీర్షికలతో లలితములైన పదజాలములతో రచించబడిన ఖండకావ్య మిది.

## తే జో మూ ర్తు లు

(మొదటి భాగము)

రచయిత : శ్రీ దశిక సూర్యప్రకాశరావు, శ్రీ గోదా గ్రంథ మాల, శ్రీమన్నారాయణపురం. ఉల్లిపాలెం పోస్టు, దివి తాలూకా, కృష్ణాజిల్లా, వెల : 1.35.

శ్రీ వీరేశలింగము, రఘుపతి వెంకటరత్నమునాయుడు, కొండా వెంకటప్పయ్య, స్వామి సీతారాం—గార్ల జీవిత చరిత్రలు క్లుప్తముగా ఉన్న గ్రంథ మిది.

## ఖ ం డ కృ తి

రచన : జాస్తి వేంకట నరసయ్య, భారతీ సమితి, పామర్రు, కృష్ణాజిల్లా. వెల : 1.25.

చిన్న చిన్న శీర్షికలతో సులభశైలిలో నున్న పద్యములతో కూర్చిన గ్రంథం.

## మ ం జ రి

(సంస్కృత ఖండకావ్యమ్)

రచన : జాస్తి వేంకటనరసయ్య, భారతీ సమితి, పామర్రు, కృష్ణాజిల్లా. ప్రముఖులను ప్రశంసించే శ్లోకాలు—వాటిలో కొన్నిటికి తాత్పర్యాలు కూడా ఉన్నవి.

## భ ల్లా ట శ త క ము

గ్రంథకర్త : కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహము, చిలకమర్తి పబ్లిషింగ్ హౌస్, కాకినాడ. వెల 0.40.

మంచి పద్యములు. వివిధ శీర్షికల క్రింద విభజించి ప్రచురించి యుండిన బాగుండును.

## కూర్మక్షేత్ర వైభవము

కూర్మనాథ శతకము. కృతికర్త : పూన్నా జనార్దనరావు. ప్రాథమికోపాధ్యాయ సంఘ కేంద్రము. శ్రీ కూర్మం, వయా శ్రీకాకుళం. వెల : 0.30

శ్రీ కూర్మక్షేత్ర స్థల పురాణమును పద్య కావ్యముగా విరచించారు. గ్రంథము చివర చారిత్రక వివరములను పొందుపరచి ఉన్నారు.

## షేక్స్పియరు జీవితకథ

రచన : బాలాంత్రపు శ్యామలరావు ఎం. ఏ., తెలుగు వెలుగు ప్రచురణలు, అమలాపురం. వెల : 0.50 న. పై.

విశ్వ విఖ్యాత కవి షేక్స్పియరు జయంత్యుత్సవ సందర్భమున ప్రచురించబడిన ఈ గ్రంథము ఆదరించదగినది.

## చి న్నా రి పా ట లు

గేయ సంకలనము. సంపాదకులు : కపుల ఆంజనేయ శర్మ, అలవర్తి వెంకటసుబ్బారావు, రామా బాలానంద సంఘ ప్రచురణలు, శాఖ వీధి, అనకాపల్లి. వెల : 0.60. పిల్లలు పాడుకోవడానికి అనువైన ఇరవై గేయాలతో వెలుపడ్డ సంపుటి.

---

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at The AndhraPatrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor: S. Sambhu Prasad.